# జలక్రీడావిలాసము

## యక్షగానము

మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ ప్రణీతము



ప్రచురణ

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**

# జలక్రీడావిలాసము

## యక్షగానము

**మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ ప్రణీతము**

సాధారణ సంపాదకుడు

**బి.యస్. రెడ్డి (భూమన్)**

సంచాలకులు, తరిగొండ వెంగమాంబ వాఙ్మయప్రాజెక్ట్

తి.తి.దే. "శ్వేత" తిరుపతి




**పరిష్కర్త : ఆచార్య కె.జె.కృష్ణమూర్తి**

తరిగొండ వెంగమాంబ వాఙ్మయప్రాజెక్ట్

**తి.తి.దే."శ్వేత" తిరుపతి**

**ప్రచురణ**

**కార్యనిర్వహణాధికారి**

**తిరుమల తిరుపతి దేవస్థానములు,తిరుపతి.**

**2008**

**JALAKRĪḌĀ VILĀSAMU**
**(YAKṢA GĀNAMU)**
**MĀTṚ ŚRĪ TARIGONḌA VEṄGAMĀMBA**

Edited by
Prof. K.J.Krishnamoorthy
Tarigoṇḍa Veṅgamāmba Vāṅmaya Project
"SVETA", T.T.D., TIRUPATI.

TTD "SVETA" Religious Publications Series No.


Second Edition: 2008
Copies : 1000

Published by
K.V.RAMANACHARY.I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams.
TIRUPATI-517 507

Printed at
TTD.Press, Tirupati.

ఓం నమో వేంకటేశాయ

# ముందు మాట

భూమన కరుణాకర రెడ్డి 15-07-2008.
అధ్యక్షులు,
తి. తి. దేవస్థాన పాలకమండలి,
తిరుపతి.

'జలక్రీడావిలాసం' - అనే ఈ యక్షగానం వెంగమాంబ రచించిన యక్షగానాల్లో ఎనిమిదవది. శ్రీవేంకటాచల మాహాత్మ్యానికి తరువాతి కాలంలో తిరుమలలో రచింపబడింది. ఇందులో శ్రీకృష్ణుని జననం మొదలుకొని గోపికల జలక్రీడల వరకు సాగిన ఆ గోపాలబాలుని బాల్యదశ వర్ణింపబడింది.ఈ కథ పోతన రచించిన ఆంధ్రమహాభాగవత దశమస్కంధం నుండి స్వీకరింపబడింది.

సిద్ధహస్తురాలయిన వెంగమాంబ యీ కథను తన రచనా ప్రణాళికకు అనుగుణంగా మలచుకొని, జీవము, చేవ గలిగిన విశిష్టమైన వ్యావహారికభాషలో, సహజసుందర శైలిలో రమ్యాతిరమ్యంగా ఈ నాటకాన్ని తీర్చిదిద్దింది.

వెంగమాంబ కృష్ణభక్తికి ఈ కృతి చక్కని నిదర్శనం! ఇలవేల్పైన తరిగొండ నృసింహుణ్ణీ, ఇష్టదైవమైన తిరుపతి వేంకటరమణున్నీ తన సాహిత్యమందంతటా అడుగడుగున అభేదంగా భజించిన ఈ భక్తకవయిత్రి, తాళ్లపాక అన్నమాచార్యుల లాగానే ఆదినుండీ తిరుమల శ్రీనివాసుణ్ణి శృంగారరస సర్వస్వమయిన శ్రీకృష్ణునిగానే అత్యధికంగా ఆరాధించింది!

ఈ 'మధుర కవితా సరస్వతి' యొక్క మనోజ్ఞరచనారీతికి ఇందులోని శ్రీకృష్ణావతారఘట్టం ఒక మంజులోదాహరణం. పలుపోకడలలో వెల్లివిరిసిన ఇందలి గేయాల సముదాయం ఈ కవయిత్రీ శిరోమణియొక్క కవనకౌశలానికి చక్కని తార్కాణం!

క్రీ.శ.18వ శతాబ్ది ఉత్తరార్థంలో మాతృశ్రీ వెంగమాంబ తిరుమలలో స్వామి సన్నిధియందు వెలకొల్పి నిర్వహిస్తూవుండిన "సాహితీ బృందావనం" నుండి వెలువడిన రసవత్కావ్యాల్లో ఈ 'జలక్రీడావిలాస' యక్షగానం ఆహ్లాదకరమైన కృతిరత్నం!

తిరుమల తిరుపతి దేవస్థానముల "శ్వేత" సంస్థ అధ్వర్యంలోని "మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ వాఙ్మయ ప్రాజెక్టు" ఇలాంటి విశిష్ట ప్రచురణలను ఇతోఽధికంగా చేపట్టి ఈ పరమయోగిని ప్రవచించిన వాఙ్మయరాశిని విస్తృతంగా వెలుగులోకి తీసికొనిరాగలరని ఆశిస్తున్నాను; అశంసిస్తున్నాను.

సదా శ్రీవారి సేవలో

భూమన కరుణాకర రెడ్డి

శ్రీనివాసో విజయతే

# నా మాట

**కె.వి.రమణాచారి, ఐ.ఏ.ఎస్.,** 22- 07-2008.

కార్యనిర్వహణాధికారి,

తి.తి.దేవస్థానములు,

తిరుపతి.

మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ తిరుమల పుణ్యక్షేత్రంలో రచించిన పదమూడు కృతులలో 'జలక్రీడావిలాసం' ఒకటి. ఇది ఆమె యక్షగానాల్లో ఎనిమిదవది; ముక్తికాంతావిలాసానికన్నా మునుపటిది. పరమ భాగవత కవయిత్రిగా ప్రశస్తిగాంచిన వెంగమ్మ బమ్మెర పోతనామాత్యుని ఆంధ్రమహాభాగవతం, దశమస్కంధం, పూర్వభాగంలోని శ్రీకృష్ణుని బాలలీలలను - కృష్ణజననం మొదలుకొని గోపికల జలక్రీడల వరకు గల వాటిని స్వీకరించి, తన కవితాకౌశలంతో ఈ దేశీయరూపకాన్ని కమనీయంగా, స్వేచ్ఛగా, రమణీయంగా సృష్టించింది.

ప్రధానంగా ఈ నాటకంలోని కథారంగం వ్రేపల్లె (వ్రజము= మంద). అందుచేత ఇందులో ఆ గోపాలకుల జానపద జీవనం అత్యంత స్వాభావికంగా చిత్రింపబడింది.

మహాకవయిత్రి వెంగమాంబ ఈ యక్షగానంలో భాషాపరంగా కావించిన వినూత్న ప్రయోగం ఒకటి ఈ సందర్భంలో పేర్కొనదగివుంది: **వేర్వేరు పాత్రలు భాషించే వ్యావహారిక భాషా విషయంలో కవయిత్రి ఇందులో ఆ యా పాత్రోచితమయిన వైవిధ్యాన్నే గాక, వయోనుగుణమయిన వైచిత్రినిసైతం ప్రదర్శించింది. "అమృతం బాలభాషితం" - అన్న ఆర్యోక్తిని అనుసరించి బలరామ, కృష్ణులను ఇందులో ముద్దు లొలికే**

"బాలభాష"లో మాట్లాడించి, ఆట పాటల్లో, హావభావాల్లో వాళ్లను అచ్చమైన తెలుగు బాలకులనుగా ఆవిష్కరించింది!

ఒక్క మాటలో, వెంగమాంబిక పరిణత కవితాప్రజ్ఞ, పండిన లోకానుభవం, పరినిష్ఠిత మధురభక్తిభావన - రాశీభవించి ఈ కృతి రత్నంగా ఆవిర్భవించాయి!

తి.తి.దే. "శ్వేత" సంస్థ సంచాలకులు, "మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ వాఙ్మయ ప్రాజెక్టు" డైరెక్టరు శ్రీయుతులు "భూమన్"గారి దీక్షాదక్షతలవలన ఈ వాఙ్మయపీఠం అచిరకాలంలో వెంగమాంబగారి తదితరరచనలను, సాహిత్య సదస్సులకు సంబంధించిన వ్యాససంకలనాలను, సంచికలను, తులనాత్మక పరిశీలనలను, శబ్దసూచికలు (concordances) మొదలైనవాటిని క్రమేణ ప్రచురింప గలదని ఆశిస్తున్నాను; ఆశంసిస్తున్నాను.

సదా శ్రీనివాసుని సేవలో

కె.వి. రమణాచారి

# కవితా సౌందర్యం

"భూమన్" 01 -07 -2008.

సంచాలకులు,

మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ వాఙ్మయప్రాజెక్టు,

"శ్వేత", తి. తి. దేవస్థానములు, తిరుపతి.

భక్తకవయిత్రి తరిగొండ వెంగమాంబ రచించిన యక్షగానాల న్నింటిలో "జలక్రీడావిలాసము" విశిష్టమయినది. శ్రీకృష్ణుని 'బాల్యలీలలు' ఇందలి ప్రధాన కథ. భాగవత దశమస్కంధం పూర్వభాగం నుండి స్వీకరించిన ఈ కథలో కొన్ని సన్నివేశాలను సంగ్రహీకరించి, మరి కొన్నిటిని పెంచి, ఇంకా కొన్నింటిని పరిత్యజించి, కవయిత్రి ఈ నాటకంలో స్వేచ్ఛగా కథా నిర్వహణ కావించింది.

వెంగమాంబ భాషా ప్రయోగ ప్రావీణ్యానికి ఈ కృతి చక్కని నిదర్శనం. గొల్లగౌడు మొదలుకొని పురోహితుని దాకా సమాజంలో నివసించే విభిన్న వర్గాల పాత్రలు మాట్లాడే వ్యావహారికంలోని వైవిధ్యాన్నీ, వైచిత్రినీ ఈ రచయిత్రి అత్యంత సహజంగా, సుందరంగా చిత్రించిన తీరు నిజంగా నిరుపమానం!

ఇందుకు తోడన్నట్లు బాలకృష్ణుని తొక్కుపల్కులను (వచ్చీరాని మాటలను) ఇందులో అచ్చటచ్చట సముచితంగా సమకూర్చి వుండటం వెంగమాంబ భాషా పరిజ్ఞానానికి గీటురాయిగా ఉంది! చిన్నపిల్లలు మాట్లాడే ఇలాంటి పల్కులనే "బాల భాష" అని కూడ ఈమె తన రచనల్లో పేర్కొన్నది.

ఈ యక్షగానంలోని వేర్వేరు గేయాల శైలి చాలా శ్రావ్యమై అలరారుతున్నది. ఈ హేతువు చేతనే ఇందలి గేయాలు చాలవరకు ఆడియో సి.డి.ల కెక్కి, ఆ బాలగోపాలాన్ని అలరిస్తూ వున్నాయి.

ఇలాగే, ఈ మహాకవయిత్రి రచించిన శ్రీ భాగవతము (ద్విపద), శివనాటకము (యక్షగానము) లాంటి తదితర కృతులను సైతం ఈ ప్రాజెక్టు అచిరకాలంలోనే ప్రచురింపనున్నదని తెలియజేయటానికి మిగుల ఆనందిస్తున్నాను.

ఈ ప్రచురణలతోపాటు, సాహిత్య సదస్సులు, పాటల సి.డి.ల విడుదల, సాంస్కృతిక ప్రదర్శనలు - మొదలయిన మార్గాల ద్వారా మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ భక్తిభావాన్ని గూర్చి, యోగసిద్ధిని గురించీ ఇతోఽధికంగా ప్రబోధింపచేయ టానికి తి.తి.దే. దృఢ సంకల్పంతో కృషి చేస్తున్నది.

-భూమన్

# పీఠిక

## 1.ప్రక్రియ

ఆంధ్ర వాఙ్మయమున 'యక్షగాన' మను సారస్వతప్రక్రియ మిగుల విశిష్టమైనది. ఆ విశిష్టతకు కారణములు అనేకములు. వాటిలో ముఖ్యమైనవి ఈ క్రిందివి:

1. యక్షగానము తెనుగునందలి దేశిసాహితీస్వరూపమును సమగ్రముగా పుణికి పుచ్చుకొని మధుర కవితలలో అగ్రగణ్యమై అలరుచుండుట.

2 .యక్షగానము శ్రవ్యములలో శ్రవ్యము, దృశ్యములలో దృశ్యమునై, ఆ యుభయ ప్రయోజనములచే ఆబాల గోపాలమునకు ఆనంద దాయకమగు సమాహార కళా స్వరూపముగా విలసిల్లుచుండుట.

3. యక్షగానము పేరునకు సాంస్కృతికమైనను, కాలక్రమమున గీర్వాణ రూపకముచే ప్రభావితమైనను, అది అంతస్స్వరూపమున తెలుగు వాఙ్మయ వ్యక్తిత్వమును ఉట్టిపడజేయు స్వతంత్ర సారస్వత ప్రక్రియ యై యుండి, తరువాతి కాలములలో తమిళ కర్ణాటభాషలయందు వెలువడిన యక్షగానములకు ఆదర్శమగు ఒజ్జబంతిగా వెలసియుండుట.

4. యక్షగానము వైవిధ్యమువలని విస్తృతి, సమన్వయమువలని ఏకరూపత, ప్రయోజనమువలని ప్రశస్తి - అను లక్షణముల మూలముగాఆంధ్రమున ఏ యితర సాహిత్యశాఖకు తీసిపోని పేరుపెంపులను గడించియుండుట.

తెలుగున యక్షగాన మెంత విశిష్టమైనదో దాని పుట్టుక అంత విచిత్రమైనది.

ఆదిలో అది దేవతరాధనకై ఉద్దిష్టమైన ప్రత్యేక గాన పద్ధతిగా ఆవిర్భవించినది. 'యక్షుల' యొక్క గానము యక్షగానము. యక్షులు గంధర్వ, విద్యాధరాదులవలె దేవయోనులు[1](Demi-gods). వారల అధిపతి కుబేరుడు. అతడు 'ధనాధిపుడు'.[2] కావున యక్షజాతికి లక్ష్మి కులదేవత యగుట సహజము. యక్షులు 'యక్షరాత్రి' (దీపావళి) వంటి ఉత్సవసమయములలో లక్ష్మివిష్ణువు మున్నగు దేవతల మహిమలను ప్రత్యేక ఫణితిలో గానము చేసెడువారు. యక్షులు పైన తెల్పినటులు దేవయోనులైనను, వారు

---

1,2చూ. అమరకోశము, 1 వ కాం., 11 శ్లో. మరియు 68 శ్లో.
(వావిళ్ల ముద్రణ - 1938)

మానవులకు సన్నిహితులనువిషయము కూడా ఇట స్మరింపదగినది. యక్షుల రాజగు కుబేరుడు 'మనుష్యధర్మడు'.[1] అతని వాహనము సైతము నరుడే ![2] యక్షులకు మానవులతోడి సాన్నిహిత్యమున కివి రెండును నిదర్శనములు.

యక్షజాతీయులలో కొందరు కడు ప్రాచీనకాలమున దక్షిణ హిందూ దేశమున వ్యాపించి, తమ విచిత్ర వేషములచే, విశిష్ట గాన సరణిచే ప్రజల నాకర్షించి యుందురు. ఆ యక్షుల ప్రత్యేకగానపద్ధతి[3] రానురాను తదితరుల చేతను అనుకరింపబడి తరతరములుగా పెంపొందుచువచ్చి, కాలక్రమమున 'యక్షగాన' మను పేరిటి సాహిత్య ప్రక్రియ ఆవిర్భవించుటకు మూలకారణమై వెలసెను. ఈ విషయమునే ఈ క్రింది గాథ భంగ్యంతరముగా నిరూపించుచున్నది.

తెనుగునాట కడుప్రాచీనకాలమునుండి నెలకొనియున్న కులములలో 'జక్కులవా' రొకరు. వీరి కులదేవత కామవల్లీ మహాలక్ష్మి. ఆమెయే ఆదిలక్ష్మీకామేశ్వరి. ఆ దేవతను ఆరాధించు నిమిత్తము పరమశివునిచే ఆజ్ఞాపింపబడిన 'ఇద్దరు యక్షుల' వంశమునకు చెందినవారే జక్కులవారని తెల్పెడి ఐతిహ్య మొకటి కలదు. ఆ యైతిహ్యము ననుసరించి చూచినచో "యక్షులు" అను పదమునుండి "జక్కులు" అను పేరేరడ్డినట్లు తెల్లమగును.

ఆ యైతిహ్యమును తెలియజేయు ద్విపద పంక్తు లివి:

"కామవల్లియు చిన్ని కన్యరూపమున
కామారి కప్పు డాకారంబు చూపె
చూపిన ముదమంది సురల రాబనిచి

---

1,2. చూ. అమర కోశము, 1వ కాం., 68 మరియు 69 శ్లో.(వావిళ్ల ముద్రణ - 1938)

3.'యక్ష' శబ్దయునకు 'యజ్ఞము', 'పూజ' - ఇత్యాద్యర్థయులు కూడ కలవు. See. A Sanskrit English Dictionary (New Edition-1951) by Sir Monier Williams, Page 838ఈయర్థముల ననుసరించి "యక్షార్థమై (పూజార్థమై) యక్షులచే జేయబడు గానముయక్షగానము" అనియు నిర్వచింపవచ్చును.

యా పార్వతీశ్వరుం డతి సంభ్రమమున
యిరవొప్ప యక్షుల నిద్దర బిలిచి
మురువొప్ప జక్కుల ముద్రలు జేసి
ఉరుమలు మద్దెలల్ ఉపకరణములు
కరమొప్ప తగినవి గావించి యిచ్చి
ముత్యాల రంగముల్ మున్నూరు జేసి
అత్యంతముదముతో నడిగిన వేళ
చిందెముల్ బోనముల్ శృంగారములును
అందముల్ పరికెలు ఆనందములును
ఆ రీతి సంతసమందగా జేసి
సారెకు ముద్రల జక్కుల బిలిచి
'రమణ మీ వంశపారంపర్యమెల్ల
కమలాక్షి గొలువుడీ కామవల్లెమను
కామ వల్లిని గొల్చు ఘనులెల్ల మున్నె
ప్రేమతో మిము జాల ప్రియము జేసెదరు
పొం'డని వీడ్కొల్ప పూబోణులందు
దండిగా వార లిద్దరు తోడురాగ
తేకువ కనకావతీపురం బపుడు
యేక చిత్తంబున నేలుచునుండె."

కామేశ్వరీ చరిత్రము, వ్రాతప్రతి,
-R.No. 1945 (Paper),పుట,37,
S.V.U.O.R. Institute Library.

పై గాథను గ్రంథస్థము గావించిన కవి రేటూరి భావనామాత్యుడు[1] అంత ప్రాచీనుడు గాకపోయినను, ఆ కథ అంతకు మున్నెంతో పూర్వకాలముననే ఆంధ్రదేశమున ప్రచారములో నుండినదని

1. ఈ కవి కాలము క్రీ.శ. 16వ శతాబ్ది. చూ. ఆంధ్రకవి తరంగిణి, 11వ సంపుటము పుట. 134.

క్రీడాభిరామమునందలి జక్కులపురంధ్రి వర్ణన, అక్కల కొలువు సన్నివేశము - మొదలగునవి చాటుచున్నవి.[1]

తెలుగు దేశమందలి జక్కుల కోవకు చెందినవారే కన్నడదేశపు 'ఎక్కలగాణలు'.వీరి ప్రసక్తి కర్ణాటవాఙ్మయమున పలుతావుల కన్పట్టుచున్నది. వాటిలో 'అభినవ పంప'డను బిరుదు వహించిన నాగచంద్రుడు (క్రీ.శ. 12వ శతాబ్ది) రచించిన మల్లినాథ పురాణములో "కమలామోదియైన తుమ్మెద ఝుంకారం కమలాలయయైన లక్ష్మిని కీర్తిస్తూపాడే 'ఎక్కల' గానంతో పోల్చి వర్ణించ బడిన"[2] సన్నివేశము ప్రాచీనమైనది. ఇందలి ఉపమానమును బట్టి కన్నడ దేశపు 'ఎక్కలు' లేక 'ఎక్కలగాణలు' మన జక్కుల వలెనే లక్ష్మీ ప్రశస్తిని గానమొనర్చెడు జానపద గాయకులని స్పష్టమగుచున్నది.

'యక్షు'లనువారు బౌద్ధయుగమునకు పూర్వకాలమున సింహళ దేశమునుండి మతప్రచారార్థమో, మరేనిమిత్తమో బయలుదేరి, క్రమముగా కర్ణాటాంధ్రములలో వ్యాపించి యుందురనియు, పైన పేర్కొన్న జక్కులు, ఎక్కల గాణలు అట్లు స్థిరపడిన ఆ యక్షుల సంతతియై యుందురనియు పరిశోధకుల అభిప్రాయము.[3]

జక్కులవారు తమ యిలువేల్పగు కామవల్లీ మహాలక్ష్మి మాహాత్మ్యము నుద్దేశించి పాడెడి పాటలు శ్రోతలలో భక్త్యుద్రేకమును రేకెత్తించెడి ప్రత్యేక దేశీయ ఫణితిలో నృత్యసహితముగా ఆలాపింపబడుచుండెడివి. అట్టి ఉద్రేక జనకమగు గానఫణితి నేడును కొన్ని యెడల కాననగును.[4]శివరాత్రివంటి పర్వదినములలో శ్రీశైలాది పుణ్యక్షేత్రములందు జరిగెడు ఉత్సవములలో జక్కులవారో, లేక వారి

---

1. చూ. క్రీడాభిరామము 136 - 139 పద్యగద్యములు. ఈ చారిత్రక కావ్యమున వర్ణితములైన విషయములు క్రీ.శ. 14వ శతాబ్ద్యారంభ కాలమునకు చెందినవి.

2. చూ. 'కన్నడ యక్షగానాలు' (వ్యాసం), శ్రీముట్నూరి సంగమేశం, భారతి 1956 ఫిబ్రవరి సంచిక, పుట. 67.

3. చూ. 'ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర' ప్రథమ భాగము, పుటలు 13 మరియు 14, డా. యస్వీ జోగారావు ఎమ్.ఏ., పిహెచ్.డి.

4.చూ. కీ.శే. వేటూరి ప్రభాకర శాస్త్రిగారి 'క్రీడాభిరామ' పీఠిక, తృతీయ ముద్రణము పుట. 104.

నమకరించిన మరికొందరో యక్షగంధర్వాది విచిత్ర వేషములను ధరించి అటువంటి గేయములను పాడి యాడినపుడు'వారి 'ఆటపాటలు' అశేష ప్రజానీకమును అమితముగా అలరింపజొచ్చెను. 'జక్కుల పాటల' చరిత్రలో దీనిని తొలిదశగా భావింపవచ్చును.

అటు పిమ్మట ఆ పాటల బాణీలో మరికొన్ని పౌరాణిక గాథలు, క్షేత్రమహిమలు అజ్ఞాతకవుల నోళ్లనుండి అవతరించి విరివిగా ప్రచారమునంది పండితులను సైత మాకర్షింప గల్గినవి.[2] అట్లు పండితుల దృష్టి నాకర్షించుటతో జక్కుల పాటలు' 'యక్ష గానము' లనెడు సాంస్కృతిక నామధేయమును సవదరించెను. ఈ తీరున 'జక్కులపాటల' ప్రత్యేక

---

1. "అ దట గంధర్వ యక్షవిద్యాధ, రాదులై పాడెదు నాడెదువారు".
పండితారాధ్య చరిత్ర, ప్రథమ ముద్రణము, పర్వతప్రకరణము, పుట. 43.

ఈ గ్రంథము క్రీ.శ. 13వ శతాబ్దికి చెందిన రచన. పై ద్విపదలో పాల్కురికి కవి సూచించిన యక్షవేషధారణ నే డాంధ్రదేశమున కారణాంతరములచే అంతరించి పోయినను, అది కన్నడదేశ యక్షగానప్రదర్శనములలో ఈనాటికిని నిలిచియుండుటను కన్నులార గాంచవచ్చును. కన్నడదేశ యక్షగాన శాఖలలో "యక్షగాన బడగతిట్టు బయలాట" (North Style of Yakshagana) అనునది మిక్కిలి ప్రాచీనమైనది. ఈ ప్రదర్శనములలో పాల్గొను పాత్రములు ఇంచుమించు అన్నియు చాలవరకు ఒకే విధమగు వేషధారణగలవై కన్పట్టును. ఆ వేషధారణలో ముఖ్యముగా ఇట పేర్కొనదగినవి వెడల్పాటి ఉష్ణీషములు(headdresses). ఇవి రావియాకు ఆకృతి గలిగి మిగుల విశాలములై పైకి మొనదేలియుండును. వీటిలో పెద్దవారి యుష్ణీషములకు "ముండాసు" అని, పిన్నలు ధరించు వాటికి "కేదగె ముందలె" అనియు కన్నడమున పేళ్లు.

See: ' Yaksagana A Dance Drama of India' (1977) by Martha Bush Ashton & Bruce Christie, page 54.

పైన పేర్కొన్న శిరో వేష్టనములు పాల్కురికి సోముని (క్రీ. శ 13వ శతాబ్ది) నాటికే యుండినవనుటకు, పారంపర్యముగా వచ్చుచున్న కన్నడ యక్షగాన (బడగతిట్టు బయలాట) సంప్రదాయమే ప్రత్యక్ష సాక్ష్యము.

2. "కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు
గాంధర్వమున (గాంధారమున?) యక్షగానసరణి".-భీమఖండము, 3వ ఆశ్వా., 65వ.

ఫణితి 'యక్షగాన' మనుపేరశిష్ట సాహితీమందిరమున ప్రాణప్రతిష్ఠ నొంద బ్రయత్నించుచుండిన (క్రీ.శ. 13, 14 శతాబ్దుల మధ్య) కాలముననే

---

'గంధర్వులు దక్షవాటీ క్షేత్రముయొక్క కీర్తిని ('గాంధార' గ్రామమున?) యక్షగాన సరణిలో కీర్తించుచుందు'రని పై పంక్తియొక్క తాత్పర్యము.
భీమఖండముయొక్క రచనాకాలము క్రీ.శ. 1430 ప్రాంతము. చూ. కీ.శే. పింగళి లక్ష్మీకాంతంగారి 'ఆంధ్రసాహిత్య చరిత్ర', పుట. 349.

పై సీసపాదములో 'గాంధారమున' అనునది సరియైన పాఠమని, అదియే కవి ప్రయుక్తమై యుండునని నే నూహించుచున్నాను. గంధర్వులు కీర్తించునది గాంధర్వముననే గనుక, మరల అట్లు చెప్పుటలో పునరుక్తియేగాని, విశేషమేమియు లేదు. అట్లుగాక , శ్రీనాథమహాకవి 'యక్షగాన సరణి'ని గూర్చి పేర్కొనుచు, ఆ సరణి 'గాంధారగ్రామము' నకు చెందియున్నట్లు పై పద్యపాదమున సూచించెనని భావించుట మిగుల సమంజసము. ఈ క్రింది ఆంగ్ల వాక్యములు కూడ పై ఊహను బలపరచుచున్నవి.

"He (K S. Karanth) suggests that its earliest from was Gandharagrama, which developed into Ekkalagana,a nd nallly evolved into a style known as Yaksagana

............ ............ ... ... . . . ... ... . .... .................

Karanath believes Ekkalagana to be a musical style derived from Gandharagrama because both are thought to share the same characteristics that either the fifth note of the raga scale was not used or the style used only five notes of the usual eight-note raga scale. In addition. the Gandhara note, (the third note) of a raga scale and the probable sruti note of Gandharagrama was also the sruiti note for Ekkalagana"

1. i) పదకవితా పితామహుడైన తాళ్లపాక అన్నమాచార్యుడు (క్రీ.శ. 1408 - 1503) సంకీర్తన లక్షణము( సంస్కృతము)న యక్షగానములందలి

ఆ పేరు అటు కన్నడమునకు ప్రాకియుండును. ఇది మలి దశ. ఇంచుమించు క్రీ.శ. 15వ శతాబ్ది పూర్వార్ధము పర్యంతము ఈ దశాపరిమితిగా గుర్తింపవచ్చు.

తెలుగులో యక్షగాన రచన క్రీ.శ 14వ శతాబ్దము నుండియు కొనసాగినట్లు స్పష్టమైన నిదర్శనము లున్నను[1] ఆ రచనలు నేడు మృగ్యములైనవి. కాని క్రీ.శ 15వ శతాబ్ది ఉత్తరార్ధమున రచింపబడిన ఒకటి రెండు యక్షగానముల పేళ్లు మాత్రము వినబడుచున్నవి. ప్రోలుగంటి చెన్నశౌరి రచించిన 'సౌభరి చరితము (జక్కుల కథ)' అట్టివానిలో నొకటి. వెల్లంకి తాతంభట్టు కవిచింతామణిలో ఉదాహరించిన 'లక్ష్మీకల్యాణము' మరియొకటి.

---

పదములను గూర్చి పేర్కొనియున్నట్లు ఆయన మనుమడగు చిన తిరుమలయ్య (క్రీ.శ. 1495 - 1553) తన 'అనువాదము' నందలి ఈ క్రింది పద్యమున తెల్పియున్నాడు.

"గీ. యక్షగానపదంబులు నవ్విధమున
సముచితానేకవిధ తాళ సంగతులను
నవరసాలంక్రియా సవర్ణంబు లగుచు
నలరునని హరికీర్తనాచార్యు డనియె".

- సంకీర్తన లక్షణము (తెనుగు). 66 ప.

చూ. 'తాళ్లపాకవారి లఘుకృతులు' (1935). పుట 149. ii.) "నా దృష్టిలో 14వ శతాబ్దమునకు చెందిన యక్షగాన మొకటి తాటాకులలో మూల్గు చున్నది".

'యక్షగాన వాఙ్మయము' (1973). పుట 7.

ఆచార్య బిరుదురాజు రామరాజు. ఎమ్.ఏ.పిహెచ్.డి.

అన్వేషించినచో తాటాకులలో అజ్ఞాతవాసము చేయుచున్న ఇట్టి రచన లింకెన్నేని బయల్పడు అవకాశము కలదు.

పోగా, క్రీ.శ. 16వ శతాబ్దినుండి రచింపబడిన యక్షగానములు మనకీనాడు లభించుచున్నవి. వాటిలో చక్రపురి రాఘవాచార్యుని విప్రనారాయణచరిత్ర, కందుకూరి రుద్రకవి సుగ్రీవవిజయము, దినవహి ఓబయమంత్రి గరుడా చలవిలాసము. బాలపాపాంబ అక్కమహాదేవి బోధోల్లానము మున్నగునవి ప్రాచీనతరములు. అటుపిమ్మట ఆ యొరవడిలో అనేక యక్షగానకృతులు వివిధ ప్రాంతములలో విరివిగా వెలువడి ఆ వాఙ్మయశాఖను పరిపుష్టము గావించినవి. ఇట్లు యక్షగానరచనలు అందుబాటులోనికి వచ్చిన దశను మూడవ దశగా పరిగణింపదగును. ఇది ముఖ్యముగా క్రీ.శ. 19వ శతాబ్ది వరకు కొనసాగింది. ఈ సుదీర్ఘ దశలో యక్షగాన రచనా, ప్రదర్శనములపై ప్రభావమును ప్రసరింపజేసిన రెండు ముఖ్యఘట్టములు కలవు. అందొకటి కూచిపూడి భాగవతుల 'పండితపోషణము'; రెండవది తంజావూరు నాయకరాజుల 'రాజపోషణము'.

పై రెండు ముఖ్య ఘట్టములు కొంచెము వెనుకముందులుగా క్రీ.శ. 17వ శతాబ్ద్యారంభకాలమున తటస్థించినవి. అందు మొదటి ఘట్టము యక్షగాన మునకు అభినయ శాస్త్రానుగుణమగు గౌరవమును ప్రసాదింపగా, రెండవది సంస్కృత నాటకపు మెరుగులను సంతరించినది. ఈ రెండింటి ప్రభావము యక్షగాన చరిత్రలో మరొక మలుపును సృజించినది. అప్పటినుండి యక్షగానములు 'పారిజాతములు'గా, 'కలాపములు'గా 'భాగవతములు'గా, 'యక్షగాన నాటకములు'గా, 'యక్షగాన ప్రబంధములు'గా పలుతెరగుల పర్యాయ నామములతో అసంఖ్యాకముగా వెలువడినవి. 'యక్షగాన' వాఙ్మయశాఖపరిణత ఫలముల నొసంగుచుండిన యీ కాలమున (క్రీ.శ. 18, 19 శతాబ్దముల నడుమ) ఎందరో యక్షగాన కవులు, కవయిత్రులు విలసిల్లిరి. అట్టివారిలో కవిశ్రేష్ఠాధిష్ఠితయైన కవయిత్రి తరిగొండ వెంగమాంబ.

## 2. రచయిత్రి

వెంగమాంబ ప్రాచీనకవయిత్రుల కోవలో కాలక్రమమున చిట్టచివరి రచయిత్రి. ఈమె జీవితయాత్ర క్రీ.శ. 1750 - 1850 సంవత్సరముల నడిమినూరేండ్ల కాలమున కొనసాగినట్లు స్థూలముగ నిర్ధారింప వచ్చును.[1] ఆ కాలములో సహస్ర చంద్ర దర్శన మొనర్చిన ఈమె[2]దాదాపు 85 సంవత్సరములు జీవించి యుండును. ఈ కవయిత్రి పుట్టుకచే చరితార్థమైన గ్రామము తరిగొండ. ఇది చిత్తూరు మండలమున[3]వాయల్పాడుకు ఉత్తరముగా నాలుగుమైళ్ల దూరమున నున్నది. ఈ గ్రామనామ మేర్పడుటకు ఉత్తరముగా నాలుగుమైళ్ల దూరమున నున్నది. ఈ గ్రామనామ మేర్పడుటకు కారణముగా చెప్పెడు గాథ యొకటి కలదు.[4]

ఇప్పటికి కొన్ని శతాబ్దుల క్రిందట రాయదుర్గమను ప్రాంతమున తీవ్రక్షామము సంభవింపగా, ఆ ప్రాంతపు అధిపతియై యుండిన చిట్టేచర్ల

---

1. i) " The Dwipada Bhagavatham written by a poetess who was living in the year 1840".
- పి. పి. బ్రౌనుదొరగారి తెలుగు - ఇంగ్లీషు నిఘంటువు (1852), పీఠిక పుట xii

.పై పల్కులు నిస్సంశయముగా ద్విపద భాగవత రచయిత్రియగు తరిగొండ వెంగమాంబ నుద్దేశించి రచించినవే. ద్విపద భాగవతము ఈ కవయిత్రి అపరవయస్సున రచించిన రచనలలో నొకటి.

.ii) తరిగొండ వెంగమాంబ క్రీ.శ. 1730 - 35 సంవత్సరముల నడిమి కాలమున జన్మించి, క్రీ.శ. 1817 ఈశ్వర సంవత్సరమున పరమపదము నొందియున్నట్లు ఇటీవల నూతనముగా లభించిన యాధారముల సాహాయ్యమున ఈ పరిష్కర్తచే "తరిగొండ వెంగమాంబకృతులు - సవిమర్శక పరిశీలనము" అను సిద్ధాంత గ్రంథమున నిరూపింపబడింది.

2. తరిగొండ వెంగమాంబ సహస్రచంద్రదర్శన మొనర్చిన విషయమును ఆమె ప్రశిష్యయగు వెంగమ్మగారిచే, తాను కొండ కేగినపుడు విని యున్నట్లు, విద్యావాచస్పతి విక్రాల రామచంద్రాచార్యులుగారు "తరిగొండ వేంగమాంబా విజయము" (1932) అను గ్రంథమున పేర్కొనియున్నారు. చూ. పుట 80.

3. చిత్తూరుజిల్లా యేర్పడక పూర్వము (అనగా క్రీ.శ. 1911కు ముందు) తరిగొండ గ్రామము, తత్పరివర్తప్రాంతములు కడప మండలములో చేరియుండినవి.

4. చూ. 1) శ్రీ మహాభక్త విజయము (1966), పుటలు 400 -404.- శ్రీ పాద సుబ్రహ్మణ్య శాస్త్రి
2) శ్రీ తరిగొండ వెంకమాంబ జీవిత రత్నాకరము, పుటలు 1-5.- రామి సెట్టి జంగమయ్య

రామానాయుడను నాతడు సపరివారముగా ఆ యూరు వదలి ఈనాడు తరిగొండ యున్న ప్రదేశమునకు వచ్చెను. అపుడాప్రాంతము తృణ కాష్ఠజలసమృద్ధిగలిగి వాసయోగ్యముగా గన్పట్టెను. అందుచే ఆ గ్రామస్థులెల్లరు (ప్రత్తిమిట్టయను పేరు గల) ఆ చిట్టడవి ప్రాంతమున కొంత కాలము వసింప నిశ్చయించిరి. ఒకనాటి యుదయమున రామానాయుని ధర్మపత్ని కుండలో పెరుగుబోసి చిలుకుచుండగా నందు మాటిమాటికి కవ్వమున కేదియో తగులజొచ్చెను. పరిశీలింపగా అది యొక నున్నని నల్లరాయి. ఆమె దానిని వెలికి తీసివైచినను మరల నదే రాయి కుండలో ప్రత్యక్షమగుచుండెను. ఈ విచిత్రమును భార్యవలన నెరింగిన రామానాయుడు అదేదో 'దైవమాయ' యై యుండునని భావించెను.

ఆ రాత్రి స్వప్నమున నాతనికి లక్ష్మీనృసింహస్వామి కనిపించి తా నచట సాలగ్రామ శిలారూపమున పెరుగు జిలుకు కుండ (తరికుండ) లో వెలసినట్లును, అందువలన తన నచట ప్రతిష్ఠింపవలసినదనియు ఆదేశించెను. అందుకు వలయు ధనము ఆ ప్రాంతమునగల 'మారెళ్ల గవి' యనుచోట లభించుననియు స్వామి సూచించెను. రామానాయుడా ధనముతో నచట లక్ష్మీనృసింహాలయమును నిర్మించెను. ఇట్లు, తరికుండ యందు వెలసిన దేవుడు ప్రతిష్ఠితుడైన గ్రామమగుటచే, ఆ యూరికిని 'తరికుండ' అను సంకేత మేర్పడెను. ఆ ' తరికుండ' యే క్రమముగా 'తరిగుండ'యై, జన వ్యవహారమున 'తరిగొండ'గా స్థిరపడెను.

తరతరములుగా తరిగొండలో నివసించుచుండిన కుటుంబ ములలో కానాలవారొకరు. వారు నందవరీక శాఖీయులు. వాసిష్ఠ గోత్రులు. ఆ వంశీయుడైన కానాల కృష్ణార్యుడు వెంగమాంబయొక్క తండ్రి; తల్లి మంగాంబ. ఈ పుణ్యదంపతుల నోము ఫలముగా జన్మించిన వెంగమ్మ బాల్యము నుండియు భక్తిభావన, తాత్త్విక ధోరణి గలిగి మనస్వినిగా మసలుకొనుచుండెడిది. తల్లి దండ్రులామె భక్తి భావనకు తొలుదొలుత మురిసినను, రాను రాను వైరాగ్య ధోరణితో గూడిన ఆమె వింత వర్తనము మాత్రము వారికి నచ్చక పోయెను. అందుచే వా రామెకు ఆనాటి

సాంఘికాచారము ప్రకారము బాల్యముననే వివాహము గావించిరి. వరుడు శ్రీవత్స గోత్రజుడగు ఇంజేటి వెంకటాచలపతి. పెండ్లియైన కొలది కాలమునకే ఆతడు విధివశమున అకాలమృతి నొందగా వెంగమాంబలో బీజప్రాయమయుగా అణగియున్న భక్తి వైరాగ్యధోరణి ప్రబుద్ధము కాదొడగినది. ఈ జన్మాంతర సంస్కారము సుబ్రహ్మణ్యయోగి యను ఆధ్యాత్మిక గురువర్యుని ఉపదేశ ప్రభావమున చక్కని సాధనామార్గములలో వికసించి, అచిరకాలముననే వెంగమాంబను బ్రహ్మజ్ఞానిగా నొనర్చినది.

ఇట్లు కడు పిన్నవయస్సుననే ఆత్మవేత్తయైన వెంగమాంబ తన అనుభూతిని రచనలద్వారా సామాన్య జనులకు సుబోధమగు భాషలో లోకమున కందింప సంకల్పించెను. ఒకవైపు పూర్వాచార పరాయణులు కల్పించెడి ఇక్కట్టులను ఏకాకిగా ఎదుర్కొనుచునే ఇంకొకవైపు రచనా వ్యాసంగమును నిర్వహించిన వెంగమ సాహితీమూర్తిమత్త్వము ( Literary Personality) నిరుపమానము! వితంతువయ్యు సువాసినీ వేషమున వర్తించుచుండుటచే పుష్పగిరి పీఠాధిపతి ఆ యూరికి వచ్చి, సభ చేయించి వెంగమాంబను బిలిపించి ప్రశ్నించెను. స్వాములవారితో వినయ పూర్వకముగా మాటాడుచునే, ఆయనను వాదమున నిరుత్తరుని గావించిన వెంగమాంబయొక్క సుజ్ఞాన విశేషమున కెల్లరు నచ్చెరువందిరి. చివరకు ఆ స్వాములవా రామె నభినందిచుచు వెడలిపోయిరి.

ఐనను, మొండివైఖరిగల తరిగొండ గ్రామీణులు కొందరు, వెంగమ్మను వెలివేయవలసినదనియు, లేనిచో తాము వారి కుటుంబమును కులమునుండి బహిష్కరించి అంక్షలు విధింతుమనియు ఆమె తండ్రి పై నొత్తిడి కల్గించుచుండిరి. తత్ఫలితముగా వెంగమ పుట్టినిల్లు వదలి తరిగొండ లక్ష్మీనృసింహాలయమును జేరెను. కాని, అచ్చటను ఆమె కాటంకము లెదురైనవి. ఆలయమందలి యాంజనేయ విగ్రహము చాటున ధ్యానసమాధినిమగ్నయై యుండగా ఒకనాడచటి యర్చకుడు వెంగమాంబను గాంచి, యపోహపడి, కోపముతో తలవెండ్రుకలుపట్టి యీవలకు లాగెను. ఏకాగ్రతకు భంగము కలుగగా, నామె కన్నులు దెరచి

చూచెను. ఆ చూపుల తీవ్రతకు తాళజాలక భీతిల్లి, పూజారి యామె పాదములపైబడితన తప్పిదమును క్షమింప వేడుకొనెను. ఈ సంఘటన మూలమున, అటనుండి వెడలిపోవలసినదిగా స్వామి తనను అదేశించినటుల భావించి, వెంగమ ఆ యూరును శాశ్వతముగా వీడి, సుప్రసిద్ధమగు వేంకటాచలపుణ్యక్షేత్రమును జేరెను.

ఆ కాలమున హథీరాంజీ మఠాధిపతిగా నుండిన మహంతు వెంగమాంబ గొప్ప భక్తురాలని గుర్తించి ఆమె యుండుట కొక కుటీరమును చూపించి, దేవస్థానమునుండి యామెకు దినవెచ్చము పంపు నేర్పాటు గావించెను. తదుపరి కొన్నాళ్లకు తాళ్లపాక చిన్నన్న వంశీయుడొకరు తమ యింటి ప్రక్కనున్న చిన్నమిద్దె యింటిని వెంగమాంబ నివసించుటకై యొసగెను. ఆ యింటి పొరుగున నున్న అక్కారామయ్య దీక్షితులనెడు అర్చకు డామెకు నిర్హేతుకముగా కష్టములు కల్గించుచుండెను.[1] అట కొంతకాలముండి, అంతరాత్మ ప్రేరణచే ఆయమ తిరుమలకు పండ్రెండు మైళ్లు ఉత్తరముగా నున్న తుంబురుకోనయను అరణ్య ప్రదేశమును జేరి, అచటి కొండగుహలో కొన్ని వత్సరములు తీవ్ర తపస్సాధన గావించెను.

వెంగమాంబ తుంబురు కోననుండి తిరుగ తిరుమల చేరిననాటినుండి ఆమె మహానుభావత సర్వులకు విదితమయ్యెను. తులసీ సుమమాలికలను సమర్పించు నిమిత్తము, కర్పూర హారతి నొసంగుటకు 'ఆనందనిలయుని' సన్నిధి కామె నిత్యము వచ్చుచు పోవుచుండునపుడు సేవకుడు మొదలుకొని అర్చకుని వరకు గల ఆలయపరివారమంతయు ఆమె యెడల మిగుల భక్తి శ్రద్ధలతో మెలగుచుండిరి. వెంగమాంబ ప్రతివత్సరము జరిపెడి నృసింహ జయంత్యుత్సవముల మూలముననను, భక్తి వేదాంతభావ గర్భితములైన రసవద్రచనలవలనను ఆమె కీర్తి తెలుగుదేశము నలుగడల వెన్నెలవలె

---

1. చూ. శ్రీ తరిగొండ వేంకమాంబ చరిత్రము (1915), పుటలు 39, 40, - శ్రీరంగప్రకాశదాస విరచితము.

అలముకొనెను. ఆవాడాము మతము 'అష్టఘంటము'[1]లను పేర ఎనిమిదిమంది వ్రాయసకాండ్రతో నిరంతరము సందడిగా నుండుచు దర్శనీయమగు పవిత్ర సారస్వత కేంద్రముగా ప్రకాశించుచుండినది.

వెంగమాంబ లేబ్రాయముననే వేంకటాచలము చేరినందున ఆమె రచనలలో ఏ రెండు మూడో తప్ప, తక్కిన కృతులన్నియు ఆ పుణ్యక్షేత్రము లోనేఅవతరించినవి. ఆ 'కవితాతపస్విని' యొక్క అమృత లేఖిని నుండి వెలువడిన రచనలలో ఇదివరకు తెలియవచ్చినవి ఈ క్రిందివి.[2]

| | |
|---|---|
| 1. నారసింహాంకిత శతకము | (పద్యము) |
| 2. నారసింహ విలాస కథ | (యక్షగానము) |
| 3. శివనాటకము | ( " ) |
| 4. రాజయోగసారము | ( ద్విపద ) |
| 5. కృష్ణనాటకము | (యక్షగానము) |
| 6. పారిజాతాపహరణము | ( " ) |
| 7. రమాపరిణయము | (ద్విపద) |
| 8. చెంచునాటకము | (యక్షగానము) |
| 9. శ్రీకృష్ణమంజరి | (మంజరీద్విపద) |
| 10. శ్రీరుక్మిణీనాటకము | (యక్షగానము) |
| 11. గోపినాటకము | ( " ) |

---

1. "శ్రీ వేంకటాచల మాహాత్మ్యమను గ్రంథమును వ్రాసిన పరమభక్తురాలు పూజ్య మాతృశ్రీ తరిగొండ వెంగమాంబగారి వద్ద ఎనిమిది ఘంటములలో నొక ఘంటమును నిర్వహించిన చంద్రశేఖరపిళ్ల విశ్వనాథపిళ్లకు ముత్తాత".

ఈ వాక్యములు కార్వేటినగర వాస్తవ్యులు, పండితులు, నవతితమవృద్ధులు, ఇటీవలనే కీర్తిశేషులు నైన మధురకవి ముకుందదైవజ్ఞులు (ముకుందపిళ్ల గారు) రచించిన "రక్షమాంశరణాగతం" (1973) అను సంస్కృత శతకముయొక్క తొలిపలుకునందలివి. పై పంక్తులలో పేర్కొనబడిన చంద్రశేఖరపిళ్ల శతక రచయితయగు ముకుందదైవజ్ఞులకు మాతామహుడు. ఈ చంద్రశేఖరపిళ్ల బాల్యమున ఇంటిలో తనకేర్పడినవైమనస్యము వలన నెవ్వరికి జెప్పక కార్వేటినగర ప్రాంతమునుండి నేరుగా తిరుమలకేగి, క్రమముగా తరిగొండ వెంగమాంబగారి సన్నిధిని 'అష్టఘంటముల'లో నొకడుగా గుదురుకొనెనని ముకుందదైవజ్ఞులుగారు నాతో తెల్పియున్నారు.

2. చూ. A Descriptive Catalogue of the Telugu Manuscripts in the G.O.M. Library, Madras Vol. IV (1936), పుటలు 1328, 1329.

12. శ్రీభాగవతము (ద్విపద)
13. శ్రీ వేంకటాచల మాహాత్మ్యము (పద్యము)
14.అష్టాంగ యోగసారము (పద్యము)
15. ముక్తికాంత విలాసము (యక్షగానము)
16. తత్త్వ కీర్తనలు (గేయము)
17. వాసిష్ఠరామాయణము (ద్విపద)

పైన పేర్కొనిన కృతులలో కొన్ని నేడలభ్యములు, లభ్యములైన వాటిలో కొన్ని మాత్రమే సమగ్రములు. ఆ సమగ్రములలో ముద్రణ భాగ్యమునకు నోచుకొన్నవి కొన్నే. ఆ కొన్ని కృతుల ముద్రిత ప్రతులుకూడ నేడు అరుదుగా లభించుచున్నవి. ఇవి యిట్లుండ, వెంగమాంబ మరియొక రచనయైన ఈ జల క్రీడావిలాస యక్షగానము ఇటీవలనే బయల్పడినది. దీనితో ఈ కవయిత్రి రచన లిప్పటికి పదునెనిమిది యని తేలినది.

## 3.రచన

**1. వ్రాతప్రతి:**

ఈ యక్షగానము యొక్క తాళపత్ర ప్రతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధన సంస్థ గ్రంథాలయమున గలదు. దీనిసంఖ్య 7627. ఈ ప్రతి స్వరూప వివరణ మిది:

కొలతలు: 41.5 సెంమీ.×3.5 సెంమీ. 54 తాళపత్రములు. పుటకు 6 పంక్తులు; పంక్తికి దాదాపు 100 అక్షరములు. వ్రాత స్పష్టమైనది. అక్షరదోషము లంతగా లేవు. ఒకటి రెండు చోటుల కొద్దిగా శైథిల్యమున్నను గ్రంథ సమగ్రతకు భంగము లేదు. లేఖకుని పేరు, లేఖన కాలము మున్నగునవి యుండెడి చివరి (55వ) పత్రము లోపించినది.

ఐనను, ఈ వ్రాత ప్రతి లేఖకుని పేరును, లేఖన కాలమును స్థూలముగా ఊహించుట కొక వీలు కలదు. ఈ ప్రతిని శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనసంస్థకు విక్రయించివారు కీ.శే. మానవల్లి రామకృష్ణ

కవిగారు. వారే క్రీ.శ. 1935-36 సంవత్సరములలో మదరాను ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయము వారికి తాము సేకరించుకొని యుండిన వెంగమాంబ రచనలగు విష్ణుపారిజాత, రమాపరిణయము లను,'కాపీ' చేసికొనుటకు ఎరవిచ్చినవారు.[1] మరియు వారే ఈ కవయిత్రి రచించిన 'తరిగొండ నృసింహ శతకము'ను S.V.O. Journal లో ప్రప్రథమముగా ప్రకటించిరి.[2] వీటన్నిటిని బట్టి ఆలోచింపగా, మానవల్లి కవి గారు ఈ కవయిత్రి రచనల ప్రతులను కొన్నిటిని ఒకచోటినుండి సేకరించి యుందురని తోచుచున్నది. వారు సేకరించిన ఆ ప్రతులలో విష్ణుపారిజాతము చివర వ్రాయునకాని పేరు, లేఖన కాలము, రమాపరిణయము చివర లిఖించిన కాలము మాత్రము క్రింది రీతిని తెల్పబడియున్నవి:

విష్ణుపారిజాతము: లేఖకుడు: తరిగొండ వెంగమ్మగారికి మునిమనుమడగు గరిడిమి(ట్ట) గంగాధరప్ప. కాలము: క్రీ.శ. 1896వ సం॥ జూలై నెల 16వ తేదీ.

రమాపరిణయము: కాలము: హేవిళంబి సంవత్సర కార్తీక శుద్ధ షష్ఠి. (ఇది క్రీ. శ 1897 అక్టోబరు నెల 31వ తేదీ ఆదివారముతో సమానము).

కావున ప్రకృత జలక్రీడా విలాస ప్రతిని సైతము పై గంగాధరప్పయే క్రీ.శ. 1896-1897 సంవత్సరముల మధ్యకాలమున వ్రాసియుండునని నిశ్చయింప వచ్చును.

వెంగమాంబ ద్విపద భాగవతావతారికలో తానంతకుమున్ను రచించిన పదునొకండు గ్రంథముల పేళ్లను పేర్కొనినది. ద్విపద

---

1. చూ: A Triennial Catalogue of the Telugu Manuscripts in the G.O.M. Library, Madras, Vol VI (1949), పుటలు 2261, 2263.
2. చూ: Journal of Sri Venkateswara Oriental Institute, Vol V, NO. I1944 ,పుటలు 1-16.

భాగవతానంతరము ఆమె శ్రీవేంకటాచల మాహాత్మ్యమును రచించినది.[1] ఇక, ముక్తికాంత విలాస, వాసిష్ఠ రామాయణములు ఈ కవయిత్రి చివరి రచనలనుటకు వాటియందలి వస్తుతత్త్వ రచనా రీతులు తార్కాణములు. కావున ప్రకృత కృతియగు జలక్రీడా విలాసము వేంకటాచల మాహాత్మ్య, ముక్తికాంతా విలాసములకు నడిమికాలమున రచింపబడినట్లు నిశ్చయింపవచ్చును.

## 2. కథాసంవిధానము:

ఈ కృతి వెంగమాంబ తుది రచనలలో నొకటై యుండుటే గాక, వస్తు తత్త్వము ననుసరించి, రచనా కౌశలమునుబట్టి ఆమె సృజించిన యక్షగానములలో అగ్రగణ్యమై విలసిల్లుచున్నది. ఈ కృతికి బమ్మెరపోతనామాత్యుని భాగవతమందలి దశమస్కంధ పూర్వభాగము ఆధారము. ఈ భాగము దాదాపు 1800 గద్య పద్యములలో విస్తరిల్లియున్నది. అందుండి వెంగమ అవశ్యకములైన కథా భాగములను గైకొని, వాటిని నాటకోచితముగా తీర్చిదిద్ది, 'కలికి కృష్ణుని' బాల్య లీలలను కడుమనోజ్ఞ రీతిని స్వేచ్ఛగా గానమొనర్చినది.

కంసుడు దేవకీవసుదేవులకు రథము నడపుట మొదలుకొని, శ్రీకృష్ణుడు జలక్రీడలాడుచున్న గోపికలను కరుణించువరకుగల కథాంశము లిందు గలవు. వీటిలో కొన్ని మిగుల విపులముగా వర్ణింపబడినవి. కొన్ని కథాంశములు సంగ్రహముగా దెలుపబడినవి. మరికొన్ని నామమాత్రముగా పేర్కొనబడినవి. ఈ కథాంశము లన్నింటిలోను చివరిది, ఈ కథకు శిఖరాయమాణమైనది జలక్రీడా (గోపీవస్త్రాపహరణ) ఘట్టము గనుక, ఈ నాటకమునకు 'జలక్రీడా విలాస' మను పేరు సార్థకమై యున్నది.

---

1. సీ. "దారునిర్మితవీణ నారూఢిఁ బల్కించు, గాయకపురుషుని కరణిగాను
పురుషోత్తముఁడు దయాపూర్ణుఁడై నా జిహ్వ యందుఁ దావసియించి యరుదుగాను
బలికించుఁగావున భాగవతపురాణ, మమర నే ద్విపదకావ్యంబుగాను
ద్వాదశస్కంధముల్ తగ జెప్పి హరికి స,మర్పించి శ్రీ వేంకటాద్రిమహిమ
తే. మవని పై రమ్యపద్య కావ్యంబొనర్చి శ్రీనివాసునికే సమర్పింపమంటి".
- శ్రీ వేంకటాచలమాహాత్మ్యము, 1 అశ్వా, 22వ. (వావిళ్లముద్రణ - 1914.)

ఇందలి కథా సంవిధానమున వెంగమాంబ కడు స్వాతంత్ర్యమును ప్రదర్శించినది. భాగవత దశమస్కంధ పూర్వభాగమందలి కథలలో కొన్నిటిని మాత్రమే ఈమె స్వీకరించినది. అట్లు స్వీకరించిన వాటిలో అత్యంత విపులముగా వర్ణించిన ఘట్టములు మూడు: అందులో నొకటి శ్రీకృష్ణావతార ఘట్టము. ఇది - కంసుడు తేరుదోలుట మొదలుకొని పురోహితుడు శ్రీకృష్ణుని జన్మఫలమును జెప్పుటయను సన్నివేశము వరకు - ఈ యక్షగానమున ఇంచుమించు మూడవ వంతు విస్తరించియున్నది. రెండవది - బాలకృష్ణుడు గోకులమున జేయు దుడుకు పనులు, గోపకాంతల ఫిర్యాదులు, వలనపోయెదమని యశోదతో పల్కుటలు - వీటన్నిటితో ఈ గ్రంథమున దాదాపు ఇంకొక మూడవ వంతు పరిమితిలో విస్తరిల్లి యున్నది. మూడవది - గోపికలు జలక్రీడలాడుచుండగా శ్రీకృష్ణుడు వారి చేలముల నపహరించిన ఘట్టము.

పూతనాహరణము, శ్రీకృష్ణుడావులించి వదన గహ్వరమున బ్రహ్మాండమును చూపించిన ఘట్టము, గోపికలు పార్వతీవ్రత మొనర్చుట - అనునవి ఇందు విపులీకరింపబడిన మరికొన్ని సన్నివేశములు.

శకటాసురభంజనము, తృణావర్తవిదళనము, బలరామకృష్ణుల నామ కరణము, మృద్భక్షణ సన్నివేశము, యమళార్జున భంజనము, కాళియ మర్దనము-మున్నగు సన్నివేశములను ఈ కవయిత్రి నాతివిస్తరముగా, నాటకాను కూలముగ వర్ణించినది. వత్సాసుర, బకాసుర, అఘాసురాది రాక్షసుల సంహ రించుట, (అనంతర కథలగు) బ్రాహ్మణస్త్రీల రక్షించుట, గోవర్ధనోద్ధరణము, చాణూర కంసాది దుష్టుల దునుమాడుట, వనధిమధ్యమున ద్వారకఁ గట్టుట, అష్టభార్యలయందు పెక్కండ్రు పుత్రుల గనుట - అను అంశము లిందు మాట మాత్రమున సూచింపబడినవి.

ఇక, ఈ కవయిత్రి స్వీకరింపక వదలిన భాగవత కథాంశములలో శ్రీకృష్ణ బలరాముల బాలక్రీడాభివర్ణనము, యశోదానందుల పూర్వజన్మ వృత్తాంతము, నందాదులు బృందావనమునకు వచ్చుట, శ్రీకృష్ణుని చల్దులు, బ్రహ్మాగో వత్సములను, గోపబాలురను అంతర్ధానమొందించుట, బలరాముడు ధేనుకాసుర, ప్రలంబాసురులను వధించుట,కాళీయుని పూర్వకథ,గో గోప

గోపికా సంఘమును కార్చిచ్చు చుట్టుకొనుట, శ్రీకృష్ణుడు దావాగ్నిని మ్రింగుట, గ్రీష్మ, వర్ష, శరత్, హేమంత ఋతువర్ణనలు - ముఖ్యమైనవి. ఈ ఘట్టములను వెంగమాంబ నాటకీయతా దృక్పథముతో పరిత్యజించినది.

### 3. కవితా విశేషములు:

ఈ యక్షగానమందలి కవితా విశేషములలో మొదట పేర్కొనదగినవి ఇందలి స్వరూపవర్ణనలు. వాటిలో ముఖ్యమైనది శ్రీకృష్ణావతార వర్ణనము. ఇది సంస్కృత భాగవతమున రెండే రెండు శ్లోకములలో ఇమిడియున్నది.[1] ఆ మూల భావము పోతనరచనలో నొక సీసపద్యముగా పెంపొందినది.[2] వెంగమ పోతన వర్ణనను యథాతథముగా గైకొనక, ఇష్టదైవమగు శ్రీకృష్ణుని దివ్యమంగళ స్వరూపమును మణిమకుటము మొదలుకొని పాదాంగుష్ఠము పర్యంతము మహనీయముగా భావనచేసి ఆ భావనను ఇరువదియైదు ద్విపదపంక్తులలో మనోజ్ఞముగా అవిష్కరించినది. (చూ, పుటలు 20, 22).

వెంగమ ఈ కృతిలో అటనట లీలాశుకుని కృష్ణకర్ణామృతము నందలి శ్లోకముల భావములను స్వీకరించి, వాటిని స్వీయభావనచే చక్కగా పెంపొందించి వర్ణించినది. మచ్చున కొకటి:

యశోద కృష్ణుని నిదురపుచ్చుటకై రామాయణకథను చెప్పు సందర్భమందలిది.

శ్లో. రామోనామ బభూవ హుం; తదబలా సీతేతి హుం; తాం పితు
ర్వాచా పఞ్చవటీతటే విహరత స్తస్యాహర ద్రావణః ।

---

1 ఆ రెండు శ్లోకములు 1. "శ్లో. తమద్భుతం బాలక మంబుజేక్షణం"
2. "శ్లో. మహార్హవైడూర్య కిరీటకుండల"
అనునవి. - 10 స్కం., 3 అధ్యా., 9, 10 శ్లో.

2. "సీ. జలధరదేహు నాజానుచతుర్బాహు, నరసీరుహాక్షు విశాలవక్షు" అను పద్యము. - 10 స్కం., పూర్వభాగము. 112ప.

నిద్రార్థం జననీ కథామితి హరే ర్హుఙ్కారతః శ్రుణ్వతః
సౌమిత్రే! క్వ ధనుర్ధనుర్ధనురితి వ్యగ్రా గిరః పాంతు నః ॥
- 2 అశ్వా., 72 శ్లో.

**ఈ శ్లోక భావ మిది:**

'రాముడనువా డొకడుండెను. అతని భార్య సీత. అతడు తండ్రియాజ్ఞ ననుసరించి పంచవటియొద్ద విహరించుచుండగా, రావణుడు అతని భార్య నపహరించెను. అనగానే అంతవరకు హుం, హుం - అని ఊ కొట్టుచుకథ వినుచుండిన కృష్ణుడు 'లక్ష్మణా! విల్లు, విల్లు, విల్లెక్కడ?' అని ఆవేశముచే తొట్రుపడుచు పల్కెను. ఆ తొందర పల్కులు మమ్ము రక్షించు గాక!'

పై శ్లోకమున కృష్ణుని నిదురపుచ్చుటకై యశోద కథ చెప్పినట్లున్నది. ఈ యక్షగానమున (పొరుగిండ్లకు పోనీయనందువలన) పొద్దు బోవుటలేదని, ఒక 'ఊకుడుకత'[1] చెప్పవలసినదని శ్రీకృష్ణుడడుగగా యశోద కథను చెప్పినట్లు మార్పు గావింపబడినది. మరియు పైశ్లోకమున కథచెప్పుట పూర్తిగాకముందే "ఇతి వ్యగ్రా గిరః పాంతు నః" అను కవి వాక్యముతో అసమగ్రముగా ముగింపబడినది. వెంగమాంబ శ్రీకృష్ణుని వీరావేశము చల్లారుటకై యశోదచే తదనంతర కథను చెప్పించినది. రాముడు రావణాది రాక్షసుల సంహరించి సీతతో సాకేతపురి జేరి ప్రజలను పాలించెనని, యశోధ కథను పూర్తిజేయుటతో, శ్రీకృష్ణుడు ఉపశమనమునొంది యథాపూర్వకముగ తల్లితొడపై గూర్చొనెను. (చూ. పుటలు 120-131). ఇట్లు లీలాశుకుని భావ మాధారముగా రామాయణ కథను సమగ్రము, సంగ్రహమునైన ఊకుడుకతగా వర్ణించిన వెంగమాంబ కవన కౌశలము నిజముగా నిరుపమము!

పోతన భాగవతములో పేర్కొనబడిన శ్రీకృష్ణుని దుడుకుచేతలను వెంగమ ఈ యక్షగానమున జానపద జీవనానుగుణముగా విస్తరించి వర్ణించియున్నది. ఈ కృతియందలి కథాంశములు కొన్ని లోకరూఢి

---

1. ఊకొట్టుచు వినెడు కథ.

ననుసరించి చిత్రింపబడి యుండుట ఈమె కవితయందలి ఇంకొక విశేషము. ఇందుల కొకటి రెండుదాహరణలు:

1. కంసుడు చెల్లెలి శిశువులను వేలపై గొట్టి చంపినట్లు మూలముననూ, పోతన రచనలోను గలదు[1]. కాని శిశువులను పైకెగురవైచి కత్తి యొడ్డి చంపెనను కథాంశమే అనూచానముగా అబాలగోపాలమున ప్రచారము నందియున్నది. వెంగమాంబ ఈ కథాంశమునే స్వీకరించినది. (చూ: పుట 33).

2. శ్రీకృష్ణుడు జలక్రీడలాడుచున్న గోపికల వస్త్రముల దొంగిలించి చెట్టెక్కిన సమయమున అతనివెంట తక్కిన గోపబాలురుకూడ ఎక్కినట్లు మూలములో నున్నది.[2]పోతనయు అట్లే వర్ణించినాడు.[3] కాని, శ్రీకృష్ణుడొక్కడే చెట్టెక్కినట్లు లోకప్రసిద్ధి. దీనిననుసరించియే ఈ కవయిత్రి తన రచనలో తక్కిన గోపకుల నందరిని సడిచప్పుడు గావింప కుండునట్లు సమయోచితముగా, దూరముగ నిల్పి, ఔచిత్యమును పోషించినది. పైగా, మూలములో, పోతనకృతిలో కృష్ణు డెక్కినది నీపము (కడిమిచెట్టు) కాగా, దేశీయ కథానుసార మిందది పొన్నతరువుగా మారినది. (చూ: పుట 150)

ఇట్లే, ఆ యా పాత్రల స్వరూపములను వ్యక్తీకరించుట యందును, చిత్తవృత్తులను చిత్రించుటయందును, సన్నివేశములను మిగుల స్వాభావికములుగా, రసార్ద్రములుగా మలిచి రంజింపజేయుట యందును ఈ రచయిత్రి సిద్ధహస్తయను సత్యమును ఇందలి ప్రత్యంశము చాటుచున్నది.

---

1. చూ. i) "శ్లో. తాం గృహీత్వాచరణయోః " అను శ్లోకము.
- 10 స్కం., 4 అధ్యా., 8శ్లో.
ii) "వ. అని పద్యుర్దుఃఖక్క వలవరించుకొనుచు" అను వచనము.
- 10 స్కం., 153 వచనము.

2. చూ. శ్లో. తాసాం వాసాం స్యుపాదాయ" అను శ్లోకము.
- 10స్కం., 22 అధ్యా., 10శ్లో.

3. చూ. "శా. ఉద్యద్గంధగజేంద్రగౌరవముతో" అను పద్యము.
-10స్కం., 820ప.

**4. నాటకీయత:**

వెంగమాంబ యక్షగానములు నాటకీయతకు పెట్టినది పేరు.[1] సంవా దాత్మకశైలిలో సాగెడు దరువులు, ఏలలు, చిన్న చిన్న పద్యములు, అనతి విస్తృతములై చకచక సాగిపోవు సన్నివేశములు-మున్నగునవి ఈ యక్షగానము యొక్క నాటకీయతా గుణమును చాటుచున్నవి. అచ్చటచ్చట గల సుదీర్ఘ వచనములు, వర్ణనలు మొదలగునవి శ్రవ్యకావ్యలక్షణమువైపే మొగ్గుచూపుచున్నను, ఇందు ప్రదర్శనానుకూలత సమృద్ధిగా కలదనుటలో సందియములేదు. మొత్తముపై నిది కవయిత్రిచే శ్రవ్య,దృశ్య - ఉభయ ప్రయోజనాత్మకముగా సృజింప బడినదని చెప్పదగును. "విరివిగా వినవచ్చె విఘ్నేశ్వరుండు" (పుట 3), "కలికి కృష్ణుడిచట నాటకంబు సల్పవచ్చె విఘ్నకారులారా!" (పుట 6) ఇత్యాది వాక్యము లీ యభిప్రాయమును బలపరుచుచున్నవి.

ఈ యక్షగాన రచనా స్వరూపమందలి కొన్ని ప్రత్యేకత లీ సందర్భమున పరికింప దగియున్నవి.

1. ఈ యక్షగానము ఈ కవయిత్రి యిష్టదైవమగు తరిగొండ లక్ష్మీ నృసింహస్వామికి అంకితము. ఆ దేవునకు, శ్రీవేంకటేశ్వరునకు, అట్లే ఈ కథానాయకుడగు శ్రీకృష్ణునకు అభేదభావమును వెంగమ్మ ఈ నాటకమున పాదుకొల్పినది. ఆ భావనతోనే ఆ యిలవేల్పును ప్రతిదరువులోను సందర్భో చితముగా స్మరించినది. ఇట్లు ఈ రచన అంతట 'తరిగొండహరి పదాంకితమై' పరగుట ఇందలి ప్రత్యేకత.

---

1) i) " All the above works of Vengamamba strictly adhere to the technique of Yaksagana ............The style and the nature of conversations employed by the poetess reveal her mastery over Telugu language"
_ "Literarv and philosophical Works of Tarigonda Vengamamba, A Woman Saint"

_ N. Venkata Rao

See: The Madras University Journal, Vol. XXX, No 1,p.24.

" వెంగమాంబ యక్షగాన కృతులన్నియు మంచినాటకపు వాటము గల్గియుండును".
చూ. ఆంధ్రయక్షగానవాఙ్మయ చరిత్ర, ద్వితీయ భాగము, పుట 115.
- డా. యస్వీ జోగారావు, ఎమ్.ఏ., పిహెచ్.డి.

2. ఈ కృత్యాదిని గల మొదటి రెండు దరువులు, దక్షిణదేశమున "తోడయమంగళం"[1] అని ప్రశస్తి వడసిన కీర్తనలకు అనుకృతులని పరిశీలనవలన తెలియుచున్నది.

| *తోడయ మంగళము | జలక్రీడావిలాసము |
| --- | --- |
| 1. నాటరాగము, జంపె తాళము | 1.నాటరాగము, జంపెతాళము |
| జయ జానకీరమణ! | శ్రీరుక్మిణిలోల! |
| జయ విభీషణ శరణ! | శృంగార సుఖలీల! |
| 2. మధ్యమావతిరాగము, ఆదితాళము | 2. మధ్యమావతిరాగము, ఆదితాళము |
| ** నారాయణ! తే నమో నమో | నందనందన! తే నమోనమో |
| నారదసన్నుత! నమో నమో | సా, నందహృదయ! తేనమోనమో |

పై రీతిని వెంగమాంబ 'తోడయమంగళ' మందలి కీర్తనలను అనుకరించుటలో, సంకీర్తనాచార్యులగు తాళ్లపాక కవుల కవితయెడల ఈమెకు గల భక్తి, గౌరవములే కారణములు.

---

1. 'తోడయమంగళం' (తొలిమంగళము) అను పేర దక్షిణాదిని మిగుల వ్యాప్తిలోనున్న కీర్తనలు ఐదు. ఇవి తాళ్లపాక కవులు రచించినవి.
చూ. ఆం.యగా.వా. చరిత్ర, అనుబంధము, పుట 339.

* 'తోడయమంగళ' మందలి కీర్తనలకు అనుకరణలు శహాజీ, గిరిరాజకవి, మాతృభూతకవి, మేరత్తూరు వేంకటరామశాస్త్రి మున్నగు అనేక దక్షిణాంధ్ర యక్షగాన కవుల రచనలయందు కొల్లలుగా కానవచ్చుచున్నవి.

** ఈ కీర్తన తాళ్లపాక అన్నమాచార్యుని అధ్యాత్మ సంకీర్తనలలో ఉన్నది.
చూ. అధ్యాత్మ సంకీర్తనలు వాల్యుం 11, తి.తి.దేవస్థాన ప్రచురణ (1955), పుటలు 183 -184.
ఇదే కీర్తన 'పురందరవిఠల! తే నమో నమో' అను చివరి పాదముతో కన్నడ దేశమున మిగుల ప్రచారములో నున్నట్లు 11వ సంపుట పరిష్కర్తలైన కీ.శే. రాళ్లపల్లి అనంత కృష్ణ శర్మగారు పేర్కొనిరి. చూ. వాల్యుం11,పీఠిక,పుట2.

2. ఈ నాటకారంభమున విఘ్నేశ్వర పాత్రకు ప్రవేశము కల్పింపబడి యుండుట ఇంకొక ప్రత్యేకత. విఘ్నేశ్వరుడు నటింపుచు వచ్చి గ్రంథకర్తచే స్తుతింపబడి, తత్రత్యులచే పూజితుడై, తన వృత్తాంతమును దెల్పును. విఘ్న కారులనెల్ల నాటకమునకు దూరముగా జనుడని ఆజ్ఞాపించును. ఇది యీ పాత్రప్రవేశమునకుగల ప్రధాన ప్రయోజనము. ఈ పద్ధతి శహజీ మున్నగు దక్షిణాంధ్ర యక్షగాన కవుల రచనలందు తరచు కానవచ్చును. వెంగమ యీ సంప్రదాయమును అటనుండియే స్వీకరించియుండును.

3. ఇందలి దరువులలో పెక్కింట పల్లవి, ఉపపల్లవి, చరణముల విభజనము కానవచ్చుచుండుట మరొక ప్రత్యేకత. సంకీర్తనలకు సహజమైన ఈ లక్షణమును దరువులలో ప్రవేశపెట్టుటలో ఈ కవయిత్రి స్వతంత్రత వ్యక్తమగుచున్నది.

4. ఈ నాటకము నందలి దేశీయరచనా విశేషములతో ఆ యా సందర్భముల కనువైన విభిన్నగతులు గల దరువులు, ఏలలతోపాటు, జంపె రేకు, జావిడి, ధ్రువపదము, లాలి, కందదర్వు, కోలాట దర్వు మొదలగునవి పేర్కొనదగియున్నవి. కథాసూత్రము నంటిపెట్టుకొని, నాటకోచితముగా, సుకుమార భావ సంపద వెదజల్లుచున్న ఈ వివిధ గేయముల సమష్టి, పాఠకుని హృదయముపై చెరగని ముద్ర వేయుచున్నది.

భాష:

ఈ కృతి యందలి భాష శిష్టము, సరళము, సుందరము. మెత్తని తత్సమములు మేళవించిన తెలుగు పలుకుల సొంపు ఇందలి భాషకు సహజాలంకారమై ఒప్పుచున్నది. గంజరము, కరుకు, నిర్వాణులు, బాధ్యము, భూతకి, సళుకు, నిండా, సుళ్లమాటలు, చులుకు - వంటి మాండలిక ప్రయోగములు, కుసిలించు, దిండీడు, కప్పురపాటు, ఉడ్డుగుడుచు, కరకరి, తీడుకొను, గారడము - వంటి ప్రౌఢ ప్రయోగములు, బహుమంది, పరబిడ్డలు, ఘనపట్టుచీర - వంటి స్వాభావిక సమాసములు, పాదిలించు, బెళికించు, ఫాలార్ధాబ్జుడు - వంటి

విన్నూత ప్రయోగములు, మొగమొగంబులు జూచుకొనుట, సిగపట్ల బేరము, బ్రతుకులు బంగారమై పోవుట, తాళిన గోవులు తేటనీరు గ్రోలును - వంటి లోకోక్తులు ఈ యక్షగానమున ఆ యా చోట్ల అన్వర్థములై అందగించియున్నవి.

వెంగమాంబ ఈ నాటకమున భాషావిషయమ్మై కావించిన నూత్నప్రయోగ మొకటి ఇట ప్రస్తావింపదగియున్నది. ఆ యా పాత్రలకు ప్రయుక్తమైన వ్యావహారిక భాషలో ఈ కవయిత్రి ఇందు పాత్రోచితమగు వైవిధ్యమునేగాక, వయోనుగుణమైన వైచిత్రిని సైతము ప్రదర్శించినది. 'అమృతం బాలభాషితం' అను సూక్తి ననుసరించి బలరామకృష్ణులను మురిపము లొలికెడి 'బాలభాష' (ముద్దు మాటలు) లో మాటాడించి, ఆటపాటలలో, హావభావములలో వారిని అచ్చపు తెలుగు బాలకులుగా తీర్చిదిద్దినది. (చూ: పుటలు 55 - 59, 97 - 100, 114 - 116, 124 - 128, 131 - 133).

ఇక, ఇందలి పాత్రోచిత వ్యావహారికమునకు పురోహితుని మాటలు చక్కని యుదాహరణములు. నందగోపునకు కుమారుని జాతక ఫలమును వివరించు ఆ ఘట్టములో పురోహితుడు " జననీ జన్మసౌఖ్యానాం" అను శ్లోకమును చదివి, ఆ శ్లోకమునకు వివరణగా వక్కాణించిన " యిషనేని సిద్ధాతం వుంచున్నది గనుక, జన్మసౌఖ్యాలకున్ను, కుల సంపద వర్థమానం అయ్యేటందుకున్ను, పూర్వజన్మ పుణ్యవిశేషములు తెలియుటకున్ను మాకు తోచినట్లు లెస్సగా విచారించి చెప్పినామూ" ఇత్యాది వాక్యములు ఈ కవయిత్రికి గల వ్యాఖ్యాన కౌశలమును చూచాయగా సూచించుచున్నవి. (చూ: పుట40-41)

ఇందువలన, వెంగమాంబ వాసిష్ఠ రామాయణము వంటి వేదాంత గ్రంథమునకు వ్యాఖ్యను వ్రాయదలపెట్టియుండినచో అది తాళ్లపాక పెదతిరుమలాచార్యుల 'భగవద్గీతావ్యాఖ్య' వలె అహ్లాదకారియై వెలసియుండె డిదని భావింపవచ్చును.

ఈ కృతియందలి కొన్ని ఘట్టములలో స్తుతి సుందరములైన సంస్కృత శ్లోకములు, చూర్ణికలు మొదలైనవి రచింపబడియుండుట

భాషాగతమగు మరియొక విశేషము. ఇట్టి భాషావైచిత్రివలనను, పెక్కురీతుల ఛందోవైవిధ్యము చేతను ఈ యక్షగాన శైలి భావస్ఫోరకమై, రసానుగుణముగా నినదించుచున్నది.

## 5. కృతివైశిష్ట్యము:

"కావ్యేషు నాటకం రమ్యం; నాటకేషు శకుంతలా" అన్నట్లు, దేశీయరచనా విశేషములలో యక్షగానము రమ్యము; యక్షగానములలో నెల్ల రమ్యతరములు ఈ 'కవితా తపస్విని' కృతులు.[1] ఆ కృతులలో మిగుల కమనీయమైనది ఈ జలక్రీడావిలాసము.

ఈ యితివృత్తమును గైకొని, తెనుగున యక్షగాన రచన చేసిన వారిలో 'అక్కయ ప్రధానుడు' ఆద్యుడుగా గనబడుచున్నాడు. (చూ: అనుబంధము ii ).

ఆతనికి తరువాత అట్టి రచనలు చేసిన కవులలో శహాజీ మున్నగువా రొకరిద్దరు వెంగమాంబకంటె పూర్వులు; భారతి రామరాజుమొదలగువా రొకరిద్ద రామెకు సమకాలికులు. తక్కినవారెల్ల తరువాతివారు. ఈ యందరి కవుల రచనలలో ఏకైక 'కవయిత్రీ కృతి'గా ఈ యక్షగానమునకు అద్వితీయ స్థానము కలదు.

వెంగమాంబయొక్క పరిణత కవితా ప్రజ్ఞ, పండిన లోకానుభవము, పరినిష్ఠిత మధుర భక్తి భావన రాశీభూతములై ఈ కృతిగా అవతరించినవి.

---

i) " In this branch of literature Vengamamba occupies a prominent place No doubt there are some poets and poetesses who composed Yaksaganas. But nobody has written half-a-dozen Yakshaganas as Vengamamba. These works reveal not only her proficiency in Sahitya, but in Sangita also, as yakshgana is a combination of the two arts"

– N. Venkata Rao.

See: The Madras University Journal, Vol. XXX, No. I, Page 24.

ii) " ఆమెవలె విన్ని యక్షగానము లింత సమర్థముగా రచించిన కవయిత్రులు లేరు. సరికదా కవులు నరుదు".

-ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, ద్వితీయ భాగము, పుట 116.

-డా. యస్వీ జోగారావు, ఎమ్. ఏ. పి. హెచ్‌డి.

ఇందులకు, ఇష్టదేవతా ప్రార్థన మొదలుకొని గ్రంథాంత ద్విపద వరకు గల ఈ రచనయంతయు ఉదాహరణమే! వేయేల? గురు శేషగిరివాసుని కోమల దరహాసమే స్ఫూర్తి కేంద్రముగా వెల్లివిరిసిన ఈ కవయిత్రి సారస్వతములో నిసర్గదేశికవితా సౌందర్యముచే ఈ యక్షగాన నాటకము అడుగడుగున అభినందనీయమై అలరుచున్నది.

## 4. పరిష్కరణ

ఈ గ్రంథ ప్రచురణకు ఆధారమైనది ఇంతకుముందు పేర్కొనిన 7627 సంఖ్యగల తాళపత్రప్రతి. ఇట్లు ఒకే యొకప్రతి అధారమైనందున ఇందు పాఠభేదముల కవకాశము లేకపోయినప్పటికిని, తక్కిన విషయములలో ఇది చక్కగా పరిష్కరింప నర్హమై కన్పట్టినది. ఈ వ్రాతప్రతిని పరిష్కరించుటలో అనుసరించిన పద్ధతులు సంగ్రహముగా ఇవి:

### 1. యథావద్గ్రహణ:

ఈ కవయిత్రి లేఖిని నుండి వెలువడిన ఈ 'దేశి రచనా స్వరూపము'ను యథాతథముగ ప్రదర్శించు పూనికతో (లేఖక దోషములు తప్ప) వ్రాతప్రతియందలి గ్రంథము వీలైనంత వరకు ఉన్నది యున్నట్లుగా గ్రహింపబడినది. ఈ యుద్దేశముతోనే క్రొత్తగా సంధులను చేయుటగాని, ఉన్న సంధి రూపములను మార్చుట గాని చేయలేదు. అట్లే , శకటరేఫను, దంత్యచ, జ -లను ద్విపదలు, పద్యములు మున్నగువానిలో సైతము ప్రవేశపెట్టలేదు.

ముఖ్యముగా ఇందలి వ్యావహారికభాష పాత్రోచితమగు పలు తెరగుల వైవిధ్యముతో విలసిల్లుచున్నందున, దాని స్వరూపావగతికి ఆటంకములేని తీరున పరిష్కరణ కార్యము నిర్వహింపబడినది.

### 2. సవరణలు:

ఇందు సవరింపబడిన వానిలో మొదటివి వ్రాత దోషములు. ఇవి లేఖకుని భ్రాంతిచేతనో, ఏమరుపాటుననో, అజ్ఞత వలననో ప్రతిలో

చోటుచేసికొనినవి. వీటిలో అధికాక్షరములు, అక్షర లోపము, ఒకదాని కింకొకటి వ్రాయుట, గుణితమునకు సంబంధించిన దోషములు, పునరుక్తులు, ఒక పద్యమును మరొక పద్యముగా పేర్కొనుట, ఒక పద్యముతో, దరువుతో ఇంకొక పద్యమును కలిపి వ్రాయుట - మున్నగు రకములుగా నున్నవి. ఇట్టివి సముచిత రీతిని సవరింప బడినవి.

ప్రాచీన లేఖన సంప్రదాయమునకు చెందిన వలపలగిలక నిండు సున్నకు తరువాతి హల్లు ద్విత్వమునొందియుండుట, (అంన్న, అంమ్మ -ఇత్యాదులలో వలె) అనునాసిక ద్విత్వములకు, (మంన్మథుడు, బ్రంహ్మ చింన్నము -ఇత్యాదులలో వలె) అనునాసిక సంయుక్తములకు పూర్వమున పూర్ణబిందువు వ్రాయుట - మొదలైనవి రెండవ తెగకు చేరును. ఇవి నేటి వ్రాతపద్ధతి కనుగుణముగా సవరింపబడినవి.

ఈ యక్షగాన పరిమితిలో ప్రధానమగు గేయభాగముగాక, తక్కిన దానియందు ఎక్కువగా ద్విపద, ఎడనెడ కందము, తేటగీతి, ఆటవెలది, అరుదుగా సీసము, చంపకమాల, మత్తేభము వంటి పద్యములు నెలకొనియున్నవి. ఒకే లేఖిని నుండి వెలువడినను పద్యములందలి భాష గేయముల యందలి భాషకన్న ఎక్కువగా యతి, గణ, ప్రాసాది ఛందోనియమములకు ఒదిగి యుండుట వలన ఆ రెండింటి భాషా స్వరూపములో ఇంచుక తేడా గోచరించుట సహజము. ఈ సహజత్వమును మననున నిడుకొనియే ఇందు పరిష్కరణ కొనసాగింప బడినది. ఉదాహరణమునకు 'యకారంబును, వు, వూ, వొ, వో లును దెలుఁగు మాటలకు మొదట లేవు"[1] అను లాక్షణిక నియమము పద్యభాగమున కన్వయించు నట్లు, వ్యావహారిక భాషా ప్రచురమగు గేయభాగమునకు అనువు పడదు. అందువలన 'వున్న, వూరు, వొకడు, వోరి'వంటి మాటలు గేయభాగమున యథా తథముగా చూపబడినవి. ఇక, 'చంతకు, జప్పవమ్మ, జారనీక, జాతామే' - వంటివి అర్థదృష్టితో 'చెంతకు, జెప్పవమ్మ, జేరనీక, జేతామే' - ఇత్యాదిగా సవరింపబడినవి.

---

1. చూ. బాలవ్యాకరణము, సంజ్ఞాపరిచ్ఛేదము, సూ. 17.

ఇచ్చట ఈ గేయ భాగమును గూర్చి చెప్పదగిన ముఖ్యాంశ మింకొకటి కలదు. ఇందలి దర్వులు, ఏలలు మొదలగునవి చాలవరకు దీర్ఘాక్షరములతో తీగెసాగిన తీరున లిఖింపబడినవి. అట్టి దీర్ఘములచే కొన్ని యెడల శబ్ద స్వరూపము మారి, అర్థస్ఫూర్తి క్లిష్టత నొందినది. అందుచే అట్టి దీర్ఘములు అర్థావగతికి అనుకూలించునంతమేర, ఆ గేయపు నడకకు అనుగుణముగా సవరింపబడినవి. మొత్తము మీద ఇట్టి స్వల్ప సవరణలు ఈ కవయిత్రి ప్రయోగించిన వ్యావహారిక భాషా స్వరూపపు పరిధి నతిక్రమింపక, కడు మెలకువతో కావింపబడినవి.

**3. పూరణలు:**

తాళపత్ర ప్రతిలో అచ్చటచ్చట కొన్ని శిథిల భాగములు కలవు. అట్టి శిథిల భాగములలో, వాటి ముందు వెనుకల ఉన్న పదముల సందర్భ బలమునుబట్టి పూరింప వీలయినవి మాత్రము పరిష్కర్తచే పూరింపబడినవి. అట్లు పూరించిన ఆ భాగములు చదరపుకుండలీకరణములలో నిర్దేశింపబడినవి. శైథిల్యము లేకున్నను, లేఖకుని ఏమరుపాటువలననో, లేక అతని కాధారమైయుండిన అసలు మాతృకలో ఆ చోట్లు శిథిలమై యుండినందుననో, మరే కారణము చేతనో ఈ ప్రతిలో అక్కడక్కడ కొన్ని అక్షరములు, పదములు, సంధివచనములు లోపించిన చోటులు కన్పట్టుచున్నవి. కాని, అట్టివి సకృత్తుగా నున్నవి. అట్టి స్థలములు కూడ పరిష్కర్తచే పూరింపబడినవి. అవి కేవలపూరణములు. అట్టి చోటుల పూరితభాగములకు మామూలు కుండలీకరణము లుంచబడినవి. కావున, అవి శిథిల భాగములు కావని గ్రహింపవలెను. అట్లే ఈ గ్రంథము నందలి 'ఇష్టదేవతా ప్రార్థన' వంటి ఉపశీర్షికలను (sub-headings) పరిష్కర్త చేర్చినవిగా భావింపవలెను.

అటుపిమ్మట పేర్కొనవలసినవి విరామ చిహ్నములు. తాళపత్ర లేఖనమున నిలువు గీతయే విరామ చిహ్నము. ప్రకృత పరిష్కరణలో కామా, సెమికోలను, తలక్రిందు కామాలు, అడ్డగీత (hyphen), ఆశ్చర్యార్థక చిహ్నము మొదలైనవి అవశ్యకమైన చోటుల గుర్తింపబడియున్నవి. ప్రధానముగా ఇది నాటకముగాన "అనియె, పలికె, అనుచున్నాడు, పలికిరి" - ఇత్యాది వచ్యర్థక క్రియలు వచ్చినచోటు లన్నింట స్పష్టప్రతీతికై 'కోలను' తరుచుగా వాడబడినది.

## 4. వివరణలు:

ఈ యక్షగానమందలి కొన్ని పదప్రయోగములు, అర్థవిశేషములు వివరణార్హములై యున్నందున, వాటికి ఆ యా పుటలలో అధోజ్ఞాపికల (Foot notes) రూపమున సముచిత రీతిని వివరణలు సమకూర్చబడినవి. అవసరమైన చోట్ల ఆ వివరణములకు నిఘంటువులు మొదలగు ఆకరములు సైత మీయబడినవి.

## 5. ప్రత్యంతరము:

ఈ నాటక మీ విధమున పరిష్కరింపబడి, దీని ముద్రణ సగపాలు పూర్తియై, కొనసాగుచుండిన సమయమున ఈ గ్రంథమునకు మరియొక తాళపత్రప్రతి లభించినది. ఇది కర్నూలు యస్. టి. బి. సి. కళాశాల ఆంధ్రోపన్యాసకుడైన శ్రీయుత పైడిపాటి జయరామరెడ్డి ఎమ్.ఏ., గారు సేకరించిన తాళపత్రగ్రంథ సంచయమున "జలక్రీడలు" - అను పేరుతో నున్నది. ఇది చిత్తూరు మండల మందలి యొకానొక గ్రామమున సేకరింపబడినది. దీనికి 'P ప్రతి'యను సంకేత ముంచబడినది. ఈ P ప్రతియందును వ్రాయసకాని వక్కణ (లేఖకుడు, కాలము, మున్నగు వివరములు) గల చివరి యాకు లోపించినది! ఈ ప్రతితో ప్రకృత ప్రతిని సరిపోల్చి చూడగా, రెండిటి యందలి రచనా స్వరూపము (text) - లేఖకుల దోషముల నటుంచి - ఇంచుమించు ఒకే తీరుగా నుండుట గోచరించినది. ఈ P ప్రతిలో లభించిన పాఠాంతరములు, శిథిలభాగ పరిపూరకములగు పాఠములు ఈ గ్రంథము చివరి (i) వ అనుబంధమున నీయబడినవి. ఈ యెడ తమ ప్రతిని పరిశీలింప నొసంగిన సహృదయ మిత్రుడు శ్రీ జయరామరెడ్డి గారికి పరిష్కర్త మిగుల కృతజ్ఞుడగుచున్నాడు.

శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధన సంస్థ ప్రచురించిన తరిగొండ వెంగమాంబ కృతులలో ఈ జలక్రీడా విలాసము మూడవది. మొదటిది శ్రీ తరిగొండ నృసింహశతకము. కీ.శే. మానవల్లి రామకృష్ణ కవిగారు సంపాదించి ప్రకటించినది.[1] రెండవది కీ.శే. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు పరిష్కరించిన రమా పరిణయము (ద్విపద కావ్యము).[2] 'ఆ పరితోషా

1. చూ. Journal of Sri Venkateswara Oriental Institute, Vol. V, Part II (1944), పుటలు 1-16.
2. చూ. శ్రీ వేంకటేశ్వర లఘు కృతులు (1948)., పుటలు 159-191.

ద్విదుషాం' అన్నట్లు, ఈ పరిష్కరణ కార్యమునకు చరితార్థతను ప్రసాదించునది సహృదయులగు ప్రాజ్ఞుల ఆమోదమే.

**6. కృతజ్ఞతలు:**

ఈ మధురకవితాకృతిని పరిష్కరించుటలో ప్రధాన ప్రోత్సాహకులైన సహృదయులు ఆచార్య జీరెడ్డి చెన్నారెడ్డి ఎమ్.ఏ.పి.హెచ్.డి. (Ex - Director S.V.U.O.R.Institute) గారికి నా కృతజ్ఞతాభివందనములు. ఈ యక్షగానము నందలి భాషావిశేషములను గూర్చి, పెక్కు మాండలిక పదముల అర్థములను గూర్చి తెలియజేసిన సహృదయ వతంసులు ఆచార్య జి.యస్. రెడ్డి. ఎమ్.ఏ., ఎమ్, లిట్., పిహెచ్. డి.(Professor & Head, Dept. of Telugu Studies, S.V.University) గారికి నా కృతజ్ఞ తాపూర్వక నమోవాకములు. ఈ గ్రంథ మీ రీతిగా వెలుగు చూచుటలో ముఖ్య కారణులైన సహృదయులు ఆచార్య యస్. శంకరనారాయణన్ ఎమ్.ఏ. పి.హెచ్.డి. (Director, S.V.U.O.R.Institute) గారికి నా కృతజ్ఞతాభివాదములు.

ఈ గ్రంథప్రచురణ కనుమతించిన శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాల యాధికారులకు, దీని నిట్లు ముచ్చటగా ముద్రింపజేసిన యస్.వి. యూనివర్సిటి ప్రెస్ ఉద్యోగులు శ్రీ కె.వి.ఎన్. రాజు(Foreman), శ్రీ. వి.ఆర్. సోమశేఖర్ (Deputy Foreman) గార్లకు, తదితర సిబ్బందికి నా ధన్యవాదములు.

సిద్ధార్థి శ్రీకృష్ణజయంతి

తిరుపతి, కె.జె. కృష్ణమూర్తి

15 - 8 - 1979

# కృతజ్ఞతాంజలి

మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ వాఙ్మయ పరిష్కరణ ప్రాజెక్టును నెలకొల్పటంలోనూ, దానికి శాశ్వత స్థితిని ప్రసాదించటంలోనూ ఆదినుండీ మూలవిరాట్టుగా విలసిల్లుతూవున్న శ్రీవారి ప్రతినిధులు,సహృదయ వతంసులు, సుగృహీత నామధేయులు, పరిపాలనా దక్షులు, తిరుమల తిరుపతి దేవస్థాన పాలకమండలి అధ్యక్షవర్యులు శ్రీభూమన కరుణాకరరెడ్డి మహోదయులకు, తిరుమల తిరుపతి దేవస్థాన పాలకమండలి సభ్యు లెల్లరకు నా అనేక ధన్యవాదములు.

శ్రీవారిప్రతినిధులు స్మితపూర్వభాషులు, మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ వాఙ్మయ పరిష్కరణ ప్రాజెక్టుకు చిరస్థాయి యయిన అభ్యుదయాన్ని, సమగ్రతను ప్రసాదిస్తూవున్న సహృదయతంసులు తి.తి.దే. శ్రీకార్యనిర్వహణాధికారివర్యులు, పరిపాలనాదక్షులు, సుగృహీత నామధేయులు శ్రీ కె.వి. రమణాచారి, ఐ.ఏ. యస్., మహోదయులకు నా అనేక ధన్యవాదములు.

తి.తి.దే. సంయుక్త కార్యనిర్వహణాధికారి, సౌజన్యహృదయులు శ్రీ ఎ.వి. ధర్మారెడ్డి గారికి నా అనేక ధన్యవాదములు.

మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ వాఙ్మయ పరిష్కరణ ప్రాజెక్టుయొక్క సర్వతోముఖమైన వికాసానికి తమ వ్యక్తిత్వ లక్షణమైన ఉద్యమస్ఫూర్తిని సమన్వయించి ఉత్సాహ, ప్రభు, మంత్రశక్తి పూరితమైన దక్షతతో ముందుకు నడిపిస్తూ వున్న తి.తి.దే. "శ్వేత" సంచాలకులు, "భూమన్"గా సుగృహీతనామధేయులైన శ్రీ భూమన్ సుబ్రహ్మణ్యం రెడ్డి మహోదయులకు నా అనేక హృదయపూర్వక ధన్యవాదములు.

తి.తి.దే. పౌరసంబంధాధికారివర్యులు, సరసహృదయులు శ్రీయుతులు కె. రామ్‌పుల్లారెడ్డిగారికి నా అనేక కృతజ్ఞతాభివాదములు.

సహృదయులు మాతృశ్రీతరిగొండ వెంగమాంబ వాఙ్మయప్రాజెక్టు సమన్వయకర్త ఇన్‌ఛార్జ్ విద్వాన్ డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య గారికి హార్దమైన నా కృతజ్ఞతాభినందనములు.

"శ్వేత" కేంద్రగ్రంథాలయం లైబ్రేరియన్ సోదరీమణి శ్రీమతి ఎన్. లీలావతి గారికి, వారి సహోయోద్యోగులయిన మిత్రబృంద మందరికీ - "శ్వేత" సంస్థ కార్యాలయం సూపరిండెండెంట్ శ్రీ వి. దామోదరంగారికి, శ్రీదీనదయాళ్(యు.డి.సి.)గారికి వారి సహెూద్యోగబృందమందరికీ, నా అనేక కృతజ్ఞతాభినందనములు.

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధన సంస్థ డైరెక్టర్ ఆచార్య వి. వేంకటరమణారెడ్డి గారికి, వారి సహెూద్యోగులకు అనేక హార్ద కృతజ్ఞతాభినందనములు.

ఈ పుస్తకమును అనతికాలములో ముచ్చటగా ముద్రింపజేసిన తిరుమల తిరుపతి దేవస్థాన ముద్రణాలయ మేనేజరు శ్రీయుతులు వి.సాంబశివరావుగారికి, వారి సహెూద్యోగుల లెల్లరకునా అనేక కృతజ్ఞతాభి వాదములు.

మాతృశ్రీ తరిగొండ వెంగమాంబా మహాకవయిత్రియొక్క ఆరాధ్యదైవమయిన "శ్రీ తరిగొండ శేషకుధరాధ్యక్షు"నకు నా భక్తి పూర్వక ప్రసూనాంజలి.

కె. జె. కృష్ణమూర్తి

# జలక్రీడావిలాసము
## విషయ సూచిక

| విషయము | పుట |
|---|---|

## జలక్రీడా విలాసము

## యక్షగానము

## *ఇష్టదేవతా ప్రార్థన*

ఉ. శ్రీ రమణీ మనోరమణ! చిన్మయ! విశ్వశరీర! ఘోరసం
సారలతాలవిత్ర! నవసారసనేత్ర; పవిత్ర! భక్తమం
దార! కృపాంతరంగ! పరతత్త్వము నీవని నమ్మి, ముక్తికై
కోరి భజింతు నిన్ను తరిగొండ నృసింహా! దయాపయోనిధీ! 1

### దర్వు, నాట రాగం, జంపె తాళం

శ్రీరుక్మిణీలోల ! - శృంగార సుఖలీల!
కారుణ్య రసమూల! - కనకరుచి చేలా!
సూరిజన నుతశీల ! - సురుచిర గుణజాల!
ఘోరదనుజవిఫాల! - గోపాల బాలా! ॥జయ జయా॥ ౧

పరిపూర్ణ విజ్ఞాన! - భావదివ్యధ్యాన!
పరవశాత్మాధీన! - భక్త సంతానా!
సురమునీంద్ర నిధాన ! - శోభితాహిశయాన!
పరమాంబరస్థాన! - బ్రహ్మాభిధానా! ॥జయ జయా॥ ౨

వరద! తరిగొండపుర - వాస! శేషగిరీశ!
వరనీల సంకాశ! - వనధిజాధీశా!
సరసాత్మ! జగదీశ! - [సాధుహృ][1] దయనివేశ!
ద్విరదరిపు మదనాశ! - దేవదేవేశా! ॥జయ జయా॥ ౩

---

1. ఈ శిథిలపూరణ ఈ కవయిత్రి రచించిన 'విష్ణుపారిజాత' యక్షగానమునందలి ఇదే దరువు ననుసరించి చేయబడినది.

## మధ్యమావతి రాగం, ఆది తాళం

నందనందన! తే నమో నమో ॥పల్లవి॥

సా, నందహృదయ! తే నమో నమో

నందనందన! తే నమో నమో ॥నందనందన॥ ॥ఉ.ప॥*

నా[రాయణ!][1] పూర్ణ సుధాకర (వద)[2]

నా! మాధవ! తే నమో నమో

నారద సనకసనందన నుతపద్మ

నలినయుగళ! తే నమో నమో ॥నందనందన!॥ ౧

సమర విభీషణ! సజ్జన పోషణ!

విమలచరిత! తే నమో నమో

కమనీయాం [గ! వికా][3] ర విరహిత! వి

నమదుద్ధర! తే నమో నమో ॥నందనందన!॥ ౨

వర తరిగొండ నివాస! పరాత్పర!

నరమృగవర! తే నమో నమో!

గురుతర పన్నగ గిరినాయక! బహు

నరపూజిత! తే నమో నమో! ॥నందనందన!॥ 3

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబుఁజేసిన తదనంతరంబున. 2

---

*ఉ.ప. అనగా ఉపపల్లవి.

1,3. శిథిలపూరణలు. 2. కేవల పూరణము.

ఈ మూడును 'విష్ణుపారిజాతము' నందు గల ఇదే గేయము ననుసరించి పూరింప బడినవి.

## *విఘ్నేశ్వరుని రాక*

ద్విపద.శ్రీ పార్వతీ గర్భ - సింధు చంద్రుండు
పాప విముక్తుండు - భక్తావనుండు

సకల విఘ్నహరుండు - సామజాస్యుండు
ప్రకట విజ్ఞాన సం - పన్నుడై, విమల

నాగోపవీతంబు - నవ్యమౌంజి [యును]
బాగొప్ప ధరియించి - ప్రబల మూషకము

పై నెక్కి మురియుచు - పాలాశదండ
మూనికెగాఁబట్టి - యుదరంబు మీఁద

తుండ మల్లాడ, కాం - తుల నొప్పు చంద్ర
ఖండంబు శిరము పై - కర మొప్పుచుండ

సలలిత పాశాంకు - శములు ధరించి
యలరారఁ దరిగొం[ ద - హరియైన ] శేష

గిరివాసుఁడగు బాల - కృష్ణులీలలను
విరివిగా వినవచ్చె - విఘ్నేశ్వరుండు.

### అట తాళం

గణనాయకుఁడు వచ్చెనూ; నటింపుచు
గణనాయకుఁడు వచ్చెనూ ॥పల్లవి॥

గణనాయకుఁడు వచ్చె - గజ్జె లందెలు మ్రోయ
ఘణఘణామని మొల - ఘంటలు గదలఁగ ॥గణనా॥ఉ.ప॥

ముజ్జగముల కాది - మూలము తానని
బొజ్జల్లాడింపుచు - భూరితేజముతోడ ॥గణనా॥ ౧

వేడుకగా జల - క్రీడా విలాసము
నాడాడ వృద్ధి జే - య(దలంచి ముదముతో ॥గణనా॥ ౨
వర తరిగొండ ని - వాసు(డు వేంకట
గిరివాసు(డగు బాల - కృష్ణు చర్యలు జూడ ॥గణనా॥ ౩

వ. ఇట్లు వచ్చిన గణేశ్వరునకు నమస్కరించి, స్తోత్రంబు( జేసెద. 3

## * గణనాయక స్తుతి *

## దర్బ్వా, అట తాళం

గణనాయ[కా శరణు; గణనా] యకా శరణు
గణనాయకా శరణు; గణనాయకా! ॥పల్లవి॥
శ్రీ శివవరపుత్ర! -చిరతర ఘనచిత్ర్వ
కాశ! మమ్మేలు శ్రీ - గణనాయకా! ॥గణ॥ ౧
భవరోగ సంహార! - భక్త చిత్త విహార!
కవిజన మందార! - గణనాయకా! ॥గణ॥ ౨
మునిజనపా[లన ! - మూషక వాహన!]
ఘన సుగుణసంతాన! - గణనాయకా! ॥గణ॥ ౩
నీరధి గంభీర! - నిగమ గోచర! విశ్వ
కారణ విగ్రహా! - గణనాయకా! ॥గణ॥ ౪
అలరార నిను నమ్మి - నటువంటి మాపాల
కలిగియుండుము నీవు - గణనాయకా! ॥గణ॥ ౫
తాపత్రయంబును - తల( గించి మము( [బ్రోచి]
కాపాడవయ్య! శ్రీ - గణనాయకా! ॥గణ॥ ౬
తల( గక విఘ్నకా - రుల( ద్రుంచి, బ్రహ్మా న
త్కళలో నన్నుంచు శ్రీ - గణనాయకా! ॥గణ॥ ౭

అరూఢిఁ దరిగొండ - హరికి సోదరియైన
గౌరి కుమార! శ్రీ - గణనాయకా! ॥గణ॥ ౮

వ. అని ప్రార్థింపుచున్న సమయంబున మతిన్ని కొందఱు వచ్చి, 'స్వామీ! నీ వెవ్వరు? నీ యభిధానం బెయ్యది? జననీ జనక సహోదరాదు లెవ్వ?' రనిన విఘ్నేశ్వరుం డిట్లనుచున్నాఁడు: 4

సీ. అమలసుశాంతాత్ముఁడగు హిమనగరాజు
గన్న కూతురు నన్నుఁగన్న తల్లి,
గుణిగాకనే యుండి గుణగణాకర శక్తి
కలితుఁడై నట్టి శంకరుఁడు తండ్రి,
పరఁగ షణ్ముఖ వీరభద్రు లిద్దఱు సహో
దరులు; జాహ్నవి [1]మాఱుతల్లి మాకు,
మైనాకుఁడొకమేనమామ; శ్రీ తరిగొండ
హరి యొక్క మేనమామయ్యె; నిట్టి

తే.గీ. వరుస లేమన్న, మా తల్లి వరుసచేత
నతఁడు మామయ్యె; నొకతల్లి యైన గంగ
వరుసచేతను తరిగొండ నరమృగేంద్రుఁ
డమర మాతాత యయ్యె నో యనఘులార! 5

తే.గీ. అజుఁడు మును సృష్టిఁ బుట్టించునపుడు నన్ను
పూజగావింపఁగా వృద్ధినొందె సృష్టి
గాన, పూజించువారి విఘ్నముల నణఁతు
నందుచేతను విఘ్నేశుఁడండ్రు నన్ను. 6

వ. అనిన విని వారు [2] సంతసించి విఘ్నేశ్వరునకు షోడశోపచార పూజలు సమర్పించి మ్రొక్కి, హే లంబోదరా! శ్రీమన్ నృసింహార్పితంబుగా

1. పినతల్లి మాకు - P
2. సంతసించి; రంత విఘ్నేశ్వరునకు - P

నా యొనర్పం బూనిన[1] జలక్రీడా విలాసంబను కృతి నుద్ధరింప వలయునని ప్రార్థించిన, సమ్మతించి విఘ్నేశ్వరుండు సకల విఘ్నకారుల నుద్దేశించి యిట్లనుచున్నాఁడు:

## * గణేశ్వరుని ఆజ్ఞ *

## దర్వు ఆది తాళం

చేరరాకుఁడిందు విఘ్నకారులారా!
నే నా, ధారమైతి కృతికి విఘ్నకారులారా! ॥పల్లవి॥

మీరెల్ల నాయాజ్ఞ విఘ్నకారులారా!
యింక, మీతేరు హెచ్చరికె విఘ్నకారులారా ॥చేర॥ ౧

క్రూరములు విడిచి విఘ్నకారులారా!
దూరమునఁ జనుఁడీ విఘ్నకారులారా! ॥చేర॥ ౨

కలికికృష్ణుఁ[2] డిచట విఘ్నకారులారా!
నాటకంబు సలుప వచ్చు విఘ్నకారులారా! ॥చేర॥ ౩

ఘనతరిగొండాధిపుడు[3] విఘ్నకారులారా!
వింతగా నిందె జూచి విఘ్నకారులారా! ॥చేర॥ ౪

వ. అని యిట్లు విఘ్నకారుల నియమించి, యీ కృతి రచియింపుమని గణేశ్వరుండాజ్ఞాపించిన, మహాప్రసాదంబని తదనంతరంబున గోపాల ప్రార్థనంబు చేసెద. 8

---

1. 'ఇంజేటి వెంగమాంబ యొనర్పంబూనిన' - అని గ్రహింపదగినది.
2. 'మనోజ్ఞుడగు కృష్ణుడు' అని భావము. 'కలికి' అను విశేషణమునకు 'మనోజ్ఞమైన' అని యర్థము. (చూ. శబ్దరత్నాకరము, పుట 159).
3. 'ఘనతరిగొండాధిపుని' అని ద్వితీయావిభక్త్యంతముగా ఉండదగును.

## * బాలగోపాల స్మరణము *

### దర్వు

బాలగోపాలం భజేం, హే మానస!

బాలగోపాల భజే ॥పల్లవి॥

బాలగోపాలం - భర్మసుచేలం ॥బాలగో॥ ॥అ.ప॥

శ్రీనతిలోలం - భాసురచేలం ॥బాలగో॥ ౧

మన్మథాకారం - మందరోద్ధారం ॥బాలగో॥ ౨

నిగమసంచారం - నిర్జరాధారం ॥బాలగో॥ ౩

కౌస్తుభాభరణం - కంససంహరణం ॥బాలగో॥ ౪

తరిగొండాధీశం - తరణి సంకాశం ॥బాలగో॥ ౫

వ. అని యిట్లు బాలగోపాల స్మరణంబుఁ జేసి, యీ కృతి రచియించెద. 9

## * రచనాసంకల్పము *

ద్విపద. శ్రీ విఘ్ననాథుని - క్షేత్రపాలకుని
ఆ వనందుర్గను - హరుని, సద్గురునిఁ

దలఁచుచు, మాయిష్ట - దైవతంబునఁగ
నలర మమ్మేలు చౌ - డాంబను గొలిచి,

ఆ వరాహస్వామి - నా హయాననుని
శ్రీవాణి నా విరిం - చిని, శ్రీనివాసు

నలమేలు మంగమ్మ - నలర నుతించి,
లలి జలక్రీడావి - లాస సత్కృతిని

శృంగారముగ విర - చించి యింజేటి
వెంగమాంబిక భక్తి - విశ్వాస మొదవ

శ్రీ తరిగొండ నృ - సింహుండనంగ
ఖ్యాతిగా వెలయు వేం - కట గిరీంద్రునకుఁ
దనియ సమర్పింపఁ -దలఁచెఁ దత్క్రమము
జనులెల్ల వినుఁడతి - సంతోషముగను.

* కథాప్రారంభము *

చిరమతియగు పరీ - క్షిన్నరేంద్రుండు
సురుచిరాత్మకుఁడైన - శుకునకు మ్రొక్కి
పరఁగ శ్రీ కృష్ణుని - బాల్యలీలలను
తిరమైన దయతోడఁ - దెలుపవే! యనిన
నా పార్థివేంద్రున - కా శుకుం డనియె:
భూపాల! వినుమది - భూరి రాక్షసులు
జననాథులై పుట్టి - సాధు బాధలను
పనిఁబూని చేయ, న - ప్పాప కర్మలను
భరియింపలేక భూ - భామ చింతించి
సరసిజ భవున కా - చందంబుఁ దెలుప,
విని బ్రహ్మదేవుండు - విష్ణుదేవునకు
వినిపింప, నజున కా - విష్ణుఁడిట్లనియె:
'అనిమిషులను గోప - కావళిగాను
ఘనమునీంద్రులను గో - గణములుగాను
సురకాంతలను గోప - సుదతులుగాను
ధరణి పైఁ బుట్టించు! - తదనంతరమున
వారిలో ఘనుఁడైన - వసుదేవునకును
కూరిమితో నేను - కొడుకునై పుట్టి

అజుఁడ! భూభారంబు - నణఁతు పొ,మ్మనిన
త్రిజగంబులకు మేలు - దీపించె ననుచు
దేవతలను, మఱి - దేవతాంగనల
పావనులైన తా - పసుల నిద్ధరను
అరసి గోపకులు, గో - పాంగనల్ గాను,
కరమర్థి వెలయ గో - గణములు గాను
భూరి సాహసమునఁ - బుట్టించె నజుఁడు.
వారిలోఁగా యదు - వల్లభుండైన
శూరసేనుండను -సుస్థిరాత్మునకు
ధీరాత్ముఁడగు వసు - దేవుండు పుట్టి
మఱికొన్నినాళ్లకు - మధురాపురమున
వరకన్యయైన దే - వకిఁబెండ్లి యాడి,
ముదమొప్ప రథమెక్కి - ముదితయుఁ దాను
కదలిపోవుచు నుండఁ - గాను కంసుండు
వసుదేవుఁడుండిన - వరరథం బెక్కి
పసమించు వేడ్కతోఁ - బలికె నిట్లనుచు:

*** కంసుఁడు రథము నడుపుట ***

**దరువు, ఆది తాళం**

నా చెల్లెలి కో వసుదేవా!
ఆ, నందముగా నో వసుదేవా!
రహిమీఱఁగ నో వసుదేవా!
సా, రథ్యముఁజే సెద వసుదేవా!

తరిగొండేశుఁడు వసుదేవా!
నాకు, దయఁబుట్టించెను వసుదేవా! 3

తే.గీ. అనుచుఁగంసుఁడు పల్కఁగా విని ముదమున
పరఁగ వసుదేవుఁడిట్లనె: బావ! నీవు
రాజవై యుండి నాకు సారథ్య మిపుడు
చేయఁదగదన్న, కంసుఁడు చెలఁగి పలికె: 10

తే.గీ. నా సహోదరిపైఁబ్రేమ నాకుఁజాల
కలిగియున్నది గనుక, వేడ్కను రయమున
మీకు సారథ్య మొనరించి మేలువాఁడ
నగుదు; నరమర నీకేల? అమల చరిత! 11

ద్విపద. అని పూర్వసారథి - నావలఁద్రోసి,
కని వాని చేతి ప - గ్గంబు లందికొని

మొనకోలఁ జేపట్టి - మొనసి గుఱ్ఱముల
పనిఁబూని రొప్పుచుఁ - బట్టు తీవ్రగతిని

తరిగొండ హరి మెచ్చఁ - (ద)న నేర్పులన్ని
నరులెన్న వసుదేవు - నకును జూపుచును.

## దర్వు, అది తాళం

నడిపెను కంసుఁడు - నవ్వుచు రథమును ॥పల్లవి॥
కడువడిగాఁదుర -గములఁదఱుముచును ॥నడిపెను॥ ॥అ.ప॥

సరవిని చెలియలు - సంతోషింపను
మఱఁదికి వేడుక - మల్లడి గొనఁగను[1] ॥నడిపెను॥ ౧

1. 'పెనగొనగా'. (చూ. శ. ర. 608).

రాజసమతిఁ దూ - ర్ణముగా నురుకఁగ
పూజిత సాత్త్విక - బుద్ధి చెలంగఁగ ॥నడిపెను॥ ౨
తరిగొండన్నృకే - సరి తను మ్రింగుట
యతి ముతి[1] నెఱుఁగక యలరుచు నచ్చట ॥నడిపెను॥ ౩

క. ఈ రీతిఁ జెలఁగి కంసుఁడు
సారథ్యముఁ జేయుచున్న సమయమునందే
కారణమును భావింపుచు
వారక యావేళ గగనవా ణిట్లనియెన్: 12

## * అశరీరి పల్కులు *
## ఏలలు

ఓరీ వోరీ! నీకూ చేటు - మీఁతీ వచ్చే దెఱుగలేకా
తేరూ దోలూచున్నావేమిరా? వోకంసాభూపా!
-తెలివి నీవూ గలిగీ బ్రతుకూరా! ౧

యిలలో నీ దేవకి గన్నా - యెనిమిదోవాఁడూ, నీ ప్రాణ
ములనూ వేగా నపహారించురా! వోకంసాభూపా!
-ముచ్చాట నీ కింకా నేలారా? ౨

చెలఁగీ తారిగొండావారా - సింహంతోడె నే దబ్బాణా
పలుకాలే దీ మాటా నిజమేరా! వోకంసాభూపా!
-[2] బ్రతుకూ నీ కీమీఁదా లేదురా! 3

తే.గీ. అనుచు నశరీరి తన కపు డాప్తముగను
పలుకఁగా విని కంసభూపతి భయంబు

1. 'తొందరపాటువలన' అని యర్థము. (చూ. ఆంధ్రవాచస్పత్యము, ప్రథమ భాగము, పుట. 127).
2. బ్రతుకు మీఁదా జోలీ విడువారా! - P

నొంది, దేవకి విరికొప్పు నొడిసి పట్టి
కత్తి ఝుళిపించి గొంతుపైఁ గదియనుంచె. 13

వ. అప్పుడు గడగడ వడంకుచున్న దేవకికి వసుదేవుఁడడ్డంబు వచ్చి,
కంసుని చేతి కత్తి బిగఁబట్టి యిట్లనుచున్నాడు: 14

## దర్వు, ఆది తాళం

ఇది నీ చెల్లెలు భోజేంద్రా!
నీ, విటు జంపుదువే భోజేంద్రా? ౧

నీ క్షేమమునే భోజేంద్రా!
యిది, నిరతము గోరును భోజేంద్రా! ౨

తరిగొండేశుఁడు భోజేంద్రా!
యీ, తగవును మెచ్చఁడు భోజేంద్రా! 3

ద్విపద. ఓ కంసభూప! నే - నొక్క సామెతను
నీకుఁ జెప్పెద విను - నీ, వదెట్లనిన
కాకోదరాస్యల - గ్నంబైన కప్ప
ఆకలిచేఁ జెంత - నరిగెడు తుట్టె
పులుఁగును[1]దా మ్రింగఁ - బోయెడు వేళ
బలిమిచేతను పాము - పట్టి మ్రింగినను
తానందె మృతినొంది -తర్లిన మాడ్కి
మానవుఁడత్యంత - మదయుక్తుఁడగుచు
తనకన్న బలమందుఁ - దక్కువ యైన
మనుజునిఁ ద్రుంచి తా - మనియెద ననెడి

1. గుంపుగా కూడియుండు, రెక్కలుగల చిన్నపురుగులలో నొకటి.

సన్నాహ మొనరించు - సమయంబునందె
తన్నె మ్రింగును కాల - దందశూకంబు;

కావున  నీ కాల - గతిఁగానరాదు.
వావి చెల్లెలు; బిడ్డ - వలెనుండు నబల

నీ మేలునే కోరు - నీ కీడు గోర,
దీ ముగ్ధ నిపుడు నీ - వేల త్రుంచెదవు?

ఈ కామినీ మణి -  యెనిమిదో చూలు
నీకు మృత్యువటంచు - నీవు భీతిలకు,

మిలమీఁద నిది గన్న - యెనిమిదో సుతుని
నలుక కిచ్చెద పుట్టి - నప్పుడె ద్రుంపు!

మదరారఁ దరిగొంద - హరితోడె! భీతి
పడుచున్న దీనిఁ ద్రుం - పకుము భోజేంద్ర!

(వ. అనిన విని వసుదేవునితోఁ గంసుడిట్లు పల్కుచున్నాడు:) 15

క. విను  వసుదేవుఁడ! దీనికి
జనియించిన సుతులనెల్లఁ జంపుటకై, పు
ట్టిన యప్పుడె నా కిచ్చెద
నని చెప్పిన దీని విడుతు ననఘచరిత్రా! 16

(వ. అనిన విని వసుదేవుఁడిట్లను చున్నాఁడు:) 17

తే. గీ. పుట్టినటువంటి బిడ్డలఁ బురిటిలోనె
నేను నీచేతి కిచ్చెద: నేఁడు దీని
విడువుమన్నను, దేవకిన్ విడిచి కంస
భూవరుం డేగె; సతిఁ గూడి పోయె శౌరి. 18

## * దేవకీవసుదేవుల చెఱ *

ద్విపద. పూని కొన్నాళ్ల కా - భోజకులేంద్రుఁ
డానక దుందుభి - నదర దేవకిని

మఱచి తా నుండక - మధురాపురమున
చెఱఁ బెట్టి యుండె మ - చ్చికఁదలంపకను;

ఆ మీఁద దేవకి - కార్గురు సుతులు
భూమిపై వరుసగాఁ - బుట్టిన యపుడె

గని వసుదేవుండు - కంసభూపతికి
మొనసి యిచ్చిన, వాఁడు - మూర్ఖుఁడై త్రుంచె.

అనఘ సప్తమగర్భ - మందు శేషుండు

మొనసి దేవకియందు - ముదమొందు తఱిని

చెదరని హరి యాజ్ఞ - చే యోగమాయ
కదిసి యా దేవకి - గర్భస్థమైన

ఘనతరతేజముఁ - గైకొని పోయి
మొనసి రోహిణి గర్భ - మున నుంతుఁగాక!

యని నిశ్చయింపుచు - నద్భుతంబుగను
మనము రంజిల మహీ - మండలంబునకు.

### దరువు

మాయ వచ్చెనూ; విష్ణు - మాయ వచ్చెనూ ॥పల్లవి॥
ఘనతోయజనా - భుని యాజ్ఞ తొలఁగక
శిరసావహించి ॥మాయ వచ్చెనూ॥ ॥ఉ.వ.॥

దేవకి గర్భమునందు - దీపించే శేషుని తేజ
మావేళ రోహిణిగర్భ - మందుంచెదనంచు పొంచి ॥మాయ॥ ౧

శివము, నద్వైతము, నిర్వి - శేషమైన బ్రహ్మమందు
సంతోషాశ్చర్యమును[1] వి - స్తారముగాఁ గల్పించిన ॥మాయ॥ ౨

పన్నగాద్రిమీఁద నిల్చి - ప్రజలనెల్ల రక్షింపుచు
నన్నేలిన తరిగొండ - నరహరి కధీన యగుచు ॥మాయ॥ 3

తే. గీ. వెలయ నీరీతి వచ్చిన విష్ణుమాయ
దేవకీ గర్భమందున్న తేజ మొడిసి
పట్టి, రోహిణికుక్షిలోఁ బెట్టి చనియె,
కడుపు బలువైన రోహిణి జడిసి భ్రమసె. 19

ద్విపద. అప్పుడా రోహిణి - యాశ్చర్యమంది,
తెప్పున పిండంబు - తేరకు వచ్చె

నేఁడు నా కడుపులో - నిలుచుటే?మనుచు
చేడెలనెల్ల నీ - చిత్రంబు నడిగి

తెలిసికోవలెనంచు - దిగులుతో లేచి
చెలి నొక్క దానినిఁ జీరి యిట్లనియె:

## దర్బు, ఆది తాళం

ఈ వింతలేమె? వోయమ్మా!
నాకు, నీవైనఁ దెల్పు మోయమ్మా! ॥పల్లవి॥

పురుషుఁడు మధురా - పురమున నుండఁగ
గరిమను తేరకు - గర్భము నిలిచిన ॥దీ వింత॥ ౧

---

1. సంతోషముతో గూడిన ఆశ్చర్యము.

పరఁగఁ గడుపులోఁ - బర్వత ముండిన
కరణి నున్న దిదె - క్కడి గర్భంబిది! ॥ఈ వింత॥ ౨

తరిగొండ నృకే - సరియగు వేంకట
గిరిపతి నాకెటు - కీర్తి నొసఁగునొ? ॥ఈ వింత॥ 3

క. అన విని యాచెలి యిట్లనె:
ననఘపతివ్రతవటంచు నందఱు ధరలో
నిను మెచ్చుదు; రటుకేలను?
తనయుని నీ కిచ్చెనేమొ దైవము తరుణీ! 20

## ★ బలరాముని జననము ★

ద్విపద. అని యిట్లు చెలి పల్కె; - నవల వింతగను
ఘనతరధావళ్య - కాంతులతోడ

బలముతోఁదగు దీర్ఘ -బాహంలతోడ
వలనైన సుందర - వదనంబుతోడ

కళల నొప్పెడి గొప్ప - కన్నులతోడ
తళుకైన నీలకుం - తలపంక్తి తోడ

సుతుఁడుదయించినఁ - జూచి యా భామ
హితమొప్పఁ జేతుల - నెత్తి, సంతోష

కలితాత్మయగుచు వేం - కట గిరీశ్వరునిఁ
దలఁచి, యా తరిగొండ - ధాముని మదిని

భావించి మ్రొక్కి, నా - పట్టిని మీరు
ప్రోవరే! యని భక్తి - పొసఁగ నిట్లనియె:

## దర్వు, ఆది తాళం

గొడ్డురాలనగుచు నేను - గోడు గుడుచుచుండఁగాను
బిడ్డను నా కిచ్చినాఁడు - బిసరుహాక్షుఁడూ ౧

దేవళ్లంద ఱిటకు వచ్చి - దీర్ఘాయువు గలిగి సుతుఁడు
జీవింపుచు నుండుట కా - శీర్వదింపుఁడీ! ౨

తరిగొండ నివేశ! శేష - గిరివాసా ! నా కొడుకును మీ
రరమరఁజేయక కావుఁ -డయ్య! మ్రొక్కేనూ. 3

తే.గీ. అనుచు దేవళ్ల బ్రార్థించి, యాదరించి
యొనర రోహిణి సుతు సాకుచుండె; నంత
విష్ణుతేజంబు దేవకీ విమలగర్భ
గోళమునఁజేరె కంసునిఁ గూల్పఁ దలఁచి. 21

## ✱ దేవకి గర్భచిహ్నములు ✱

ద్విపద. ఆ రీతి దేవకి - యమల గర్భమున
నారాయణస్వామి - నవ్యతేజంబు

వలనుగా నిల్చె; దే - వకి కటు మీద
తలకొని యోకిలిం - తలు పుట్ట సాగె,

వరముఖాబ్జము పాండు - వర్ణమై యొప్పె,
దరనిభ కంఠమం - తయు సన్నమయ్యె,

మును కొని కుచకుంభ - ములు పొదిలించె[1]
మొనసి యంతఁ దదగ్ర - ముల నల్పు మించె,

---

1. ఇది 'పొదలించెన్' అను క్రియయొక్క వ్యావహారిక రూపము. 'వర్ధిల్లెను' అని దీని భావము. (చూ. శ. ర. పుట. 526)

తను మధ్య మంతకం - తకు స్థూలమయ్యె,
పెనుపొందు వాళి గం - భీరమై మెఱపె,

చాల కటిప్రదే - శము వృద్ధిఁ బొందె,
ప్రాలుమాలిక పుట్టె - పరఁగ నానాట

నిదురయందును రక్తి - విరతంబు గల్గె,
నదిగాక మృద్భక్ష - ణావక్తి చెలఁగె,

అన్నోదకము లన - హ్యంబులై తోఁచె,
పన్నుగాఁ గనులలో - బడలికె విలిచె

ఆతతంబుగఁ గోర్కె - లధికంబులయ్యె,
నూతన కాంతి మే - నున నిండియుండె;

కరమొప్ప నిటువంటి - గర్భచిహ్నంబు
లరసి దేవకి మది - నచ్చెరువంది

లోఁగుచు చెఱసాల - లో నుండి వచ్చి
వేగ నీవల చెలిన్ - వీక్షించి పలికె:

## దర్వు, ఆది తాళం

ఓయమ్మలార యేమమ్మ? ॥పల్లవి॥
విను డీయద్భుతంబు నేమమ్మ? ॥వోయమ్మ॥ ॥ఉ.ప.॥

కాంతిగ సప్తమ - గర్భము నిలిచెను
వింతగ మాయై - వెడలి చనియె మును ॥వోయమ్మ॥ ౧

అలరారగ నిపు - డష్టమ గర్భము
నిలిచెను; కంసుఁడు - నిగుడెటు చేసునో?[1] ॥వోయమ్మ॥ ౨

1. 'నిగుడి + ఎటుజేసునో?' అని విభజనము.

గురుతర వేంకట - గిరి నిలయుండగు
తరిగొండాధీ -శ్వరుఁడెటు బ్రోచునొ? ॥వోయమ్మ॥ 3

క. అని దేవకి చింతింపఁగ
వనజజ శంకర మునీంద్ర వాసవముఖ్యుల్
చనుదెంచి, దేవకీ సతి
ఘనగర్భమునందు వెల్గు కమలదళాక్షున్. 22

వ. తమ మానసంబుల భావించి మ్రొక్కి, అనేక ప్రకారంబుల వినుతించి మతిన్నిట్లనుచున్నారు: 23

### ★ బ్రహ్మాదుల ప్రార్థన ★

శ్లో॥ సత్యం జ్ఞాన మఖండరూప మమలం చక్రాయుధం శ్రీకరం
నిత్యం నిర్గుణ మవ్యయం నిరుపమం నిర్వాణబోధప్రధమ్।
ప్రత్యక్షానుభవామృతం సుఖకరం పాపాద్రివజ్రాయుధం
దైత్యారిం తరిగొండశేషకుధరాధ్యక్షం భజే ఽహం సదా॥ 24

తే.గీ. దేవకీదేవి గర్భమందే ముదమున
నొదిఁగియుండఁగనేలనే?[1] యుర్విమీఁద
నీవు జనియించి మముఁ బ్రోవు నీరజాక్ష!
యనుచుఁ బ్రార్థించి, దేవకి నాదరించి. 25

### జంపె

పలికి రిట్లనుచు: నో - భామ దేవకి! నీవు
కలఁగ నేమిటికి? నీ - గర్భంబునందూ ౧

1. ఈ సంబోధనము ఆప్యాయతను సూచించును. త్యాగరాజు ఇష్టదైవమగు శ్రీరాముని ఒకానొక కీర్తనలో "మఱచితే ఏమిసేతునే? ఓ రాఘవ!" అని ఇట్లే చనువుతో సంబోధించియున్నాడు. (చూ. 'త్యాగరాజకీర్తనలు', మొదటి కూర్పు, పుట 25, సంపాదకుడు - విస్సా అప్పారావు.

విశ్వగర్భుఁడు చేరి - వృద్ధి యగుచున్నాఁడు
శాశ్వతుండై యెల్లి - జనియించు నతఁడూ ౨
తరిగొండహరి మిమ్ము - దయను రక్షించు నిఁక
వెరువవద్దని వారు - వీడుకొని చనిరీ. 3

## * శ్రీకృష్ణజననము *

ద్విపద. అపుడు పరబ్రహ్మ - మైన విష్ణుండు
కపట రాక్షస గజ - కంఠీరవుండు
శ్రీ పన్నగాచల - శిఖరవాసుండు
నాపాలి తరిగొండ - నారసింహుండు
గణనాథిక ప్రభా - కలితమై, దివ్య
మణిమయంబగు హేమ - మకుటంబుతోడ
అలకల నొప్పు ఫా - లార్ధాబ్జతోడ[1]
తళుకైన భ్రూలతో - ద్వంద్వంబు తోడ
విమలావృత కటాక్ష - వీక్షలతోడ
కమనీయమగు టెక్కు - గల నాసతోడ
దళమైన కెంజాయఁ - దగు మోవితోడ
ధళధళ వెలిఁగెడి - దంతాళితోడ
అందంబు గులికించు - హాసంబుతోడ
నైందవ బింబోప - మాస్యంబుతోడ
సురురత్న కుండల - యుగళంబుతోడ
సిరుల జొంపము లీను - చెక్కిళ్లతోడ
దర, సుదర్శన, గదా, - తామరసముల
భరియించు పటుచతు - ర్బాహులతోడ

1.. 'ఫాలమనెడు అర్ధచంద్రునితో' అనగా 'అర్ధచంద్రునివలె అందమైన నొసటితో ' వని భావము.

ఘనకౌస్తుభాంచిత - కంఠంబుతోడ
వనమాలికాహార - వారంబుతోడ
వనధిజ కిరవైన - వక్షంబుతోడ
వనద సంకాశమౌ - వర్ణంబుతోడ
అపరిమితాబ్జభ - వాండంబు లొప్ప
నుపమింప సూక్ష్మమౌ - నుదరంబుతోడ
ఘనుఁడైన హాటక - గర్భున కనిశ
మునికియౌ నాభి - పయోజంబుతోడ
నాదిత్య నిభమేఖ - లావృత దివ్య
దేదీప్యమాన దీ - ధితి కటితోడ
భూరి తటిల్లతా - పుంజవిస్ఫూర్తి
వారించు కాంచన - వసనంబుతోడ
మరకత స్తంభ స - మానమై చాల
నొఱపు గల్గిన యూరు - యుగళంబుతోడ
వారిధి కన్యకా - వరహస్తయుగళ
సారోపచరిత స - జ్ఞంఘలతోడ
నార్తరక్షణ బిరు - దాంకంబు లగుచు
స్ఫూర్తితో మ్రోయు నూ - పురములతోడ
నిగమాంత వీథుల - నిరతంబుఁ దిరుగ
దగియున్న పాద ప - ద్మంబులతోడ
మొనసి వామాంగుష్ఠ - మున నంతతంబు
దనరుచున్నట్టి మం - దాకినితోడ
శతకోటి మన్మథ - సౌందర్య ధుర్య
వితతి విభ్రమమూర్తి - విభవంబుతోడ
నారూఢ కోటి చం - ద్రార్కహుతాశ
తారాతటిత్ప్రభా - తతులకు మూల

కారణమైన ప్ర - కాశంబుతోడ
ధీరుఁడై దేవకీ - దేవి గర్భమున
అలర శ్రావణ బహు - ళాష్టమి నాఁడు
నలువొప్ప రోహిణి - నక్షత్రమందు
సగము రాతిరి వేళ - సంపూర్ణ కళల
జగదీశుఁ డుదయించె - జగతీతలమున.

## * దేవతల ఆనందము - ప్రార్థన *

వ. ఆ సమయంబున దేవతలు భేరులు మొరయించి, కుసుమ వర్షంబులు గురియించి, జయ జయ శబ్దంబులు జేసి; రంత దేవతా స్త్రీలు తమలో దామిట్లనుచున్నారు: 26

## దరువు ఆది తాళం

విష్ణుదేవుడు బుట్టెనమ్మా!
వసుదేవు నింట, విష్ణుదేవుడు బుట్టెనమ్మా! ॥పల్లవి॥

జిష్ణు ముఖామర సేవితుడై వ - ర్ధిష్ణుం డగుచును
దేవకి కడుపున, విష్ణు - దేవుడు బుట్టెనమ్మా! ॥ఉ.ప.॥

దర చక్ర గద సారసములూ నాల్గు చేతుల
ధరియించి, మకర కుండలములూ
తరచుగ గండ - స్థలముల వెలుగగ
నురుమణిహారము - లురమున మెరయగ ॥విష్ణు॥

నీల జలద వర్ణముతోనూ, విలసిత కనక
చేలకాంతు లుప్పొంగగానూ
మెలగు మకుటము - మీదట వలగొని
పూల సరంబులు - భుజముల వొరయగ ॥విష్ణు॥

తరిగొండ వారసింహాద్రైన శేషాద్రి విభుడు
చిరతర బ్రహ్మానందమున

దొరకొని కుజనుల - దురుమాడుచు వరునగ
నరవిని సుజనుల - సంరక్షింపను ॥విష్ణు॥

వ. అని యిట్లు దేవతాస్త్రీలు సంతసింపుచున్న సమయంబున దేవతలు ఇట్లనుచున్నారు: 27

## దరువు

విజయీభవా! జయ - విజయీభవా!
జయ విజయీభవా !-దిగ్విజయీభవా! ॥పల్లవి॥

అజ రుద్ర వందిత పా - దారవింద! ముకుంద!
సుజన మందార! స్వామి! - విజయీభవా ॥విజ॥ ౧

కారుణ్యరసపారా - వార! వికారదూర!
వీరశేఖర! స్వామి! - విజయీభవా ॥విజ॥ ౨

నలలిత తరిగొండ - నిలయ! శేషాచలేశ!
విలసిత చరిత! స్వామి! - విజయీభవా ॥విజ॥ 3

## దరువు

బహుపరాకురా! హెచ్చరికె బహుపరాకురా!
హెచ్చరికె బహుపరాకురా! హెచ్చరికె బహుపరాకురా ॥పల్లవి॥

శ్రీలలనాలోల! విశ్వమూల! - కాలాతీత! మమ్ము
పాలించు; హెచ్చరికె స్వామీ! - బహుపరాకురా! ॥బహు॥౧

పరమ సాధువుల గొట్టి - బాధించే కంసుని బట్టి
పరిమార్చు; హెచ్చరికె స్వామీ! - బహుపరాకురా! ॥బహు॥౨

అభయ మిచ్చి, తరిగొండ - హరి! భూభార మణగించి మా
ప్రభ నిల్పు; హెచ్చరికె స్వామీ! - బహుపరాకురా! ॥బహు॥3

వ. అని యిట్లు దేవతలు ప్రార్థింపుచున్న సమయంబున వసుదేవుం డిట్లనుచున్నాడు: 28

## * దేవకీవసుదేవుల వినుతి *

శ్లో॥ శ్రీ నారాయణ మాత్మమూల మనఘం శ్రీవత్సవక్షస్థ్సలం
నానాస్థావర జంగమాత్మక జగన్నాథం ప్రధానాశ్రయం।
ధ్యానధ్యేయ మచింత్య మద్వయపదం ధర్మస్వరూపం, సుపూ
ర్ణానందం తరిగొండ శేషకుధరాధ్యక్షం భజేఽహం సదా॥ 29

వ. అని యిట్లు వసుదేవుడు వినుతింపుచున్న సమయంబున దేవకి యిట్లనుచున్నది: 30

## చూర్ణిక

శ్రీమదఖిలస్థావర జంగమాత్మక ప్రపంచ హేయ గుణవికార
సముదయాతీత స్వయంప్రకాశం, ఘోరతర కలికలుషనాశం ౧

అపరిమిత సుందర సుకుమార నవయౌవనా లంకృత స్వశరీర
విజిత శతకోటి మన్మథ ధనం, సత్య ధర్మక్షాత్ర సదనం ౨

సకల విశ్వ సర్జన కారణ పరాది జ్ఞానేచ్ఛాక్రియాశక్తి ప్రము
ఖానేక ప్రబల శక్తి సమేతం, నిఖిల నిగమాంత నిర్ణీతం 3

బహు విచిత్ర మాయా వినిర్మిత బ్రహ్మాండ భాండ బృంద
భరితానంత శరీరం, సచ్చిదానందసారం ४

అనేక జన్మ పుణ్య పరిపాక జ్ఞాన భక్తి ప్రకాశాతిశయ
పరమ భాగవత జనపరివృత శేషశైలాగ్ర నివేశం, తరిగొండ
పురవరాధీశం లక్ష్మీనృగేశం భజేఽహం, భజేఽహం, భజేఽహం. ౫

శ్లో॥ సంతాపాంబుధిబాడబం సురుచిరస్వాంతం జగత్కారణం
శాంతం స్వచ్ఛ మమేయ మాద్య మమలం జాంబూన దాభాంబరం।
క్లాంతం భవ్యసుఖాశ్రయం శుభకరం సంసారభూజచ్ఛిదం
దాంతం శ్రీ తరిగొండ శేషకుధరాధ్యక్షం భజేఽహం సదా॥ 31

వ. అని దేవకీ వసుదేవులు మరిన్నిట్లనుచున్నారు: 32

ద్విపద. శ్రీ కమలాలోల! - జితదైత్యజాల!
వీకతో వినుము మా - విన్నపం బొకటి
యాకాశవాణి నా - డాడిన మాట
కా కంసు డులికి, క్రూ - రాత్ముడై మమ్ము
చెరబెట్టి, పుట్టిన - చిన్న బిడ్డలను
పొరిగొనె; నందుచే - పుత్రశోకమున
పొరలుచుండగ, మాకు - పుత్రుండవగుచు
హరి నీవు బుట్టితి - వానంద మొదవ
కంసు నిప్పుడు బట్టి - ఖండించి మాకు
హింస దప్పింపవే - యిందిరాధీశ!
యన విని తరిగొండ - హరి వారి గాంచి
యెనసిన దయతోడ - నిట్లని పలికె:

* ఊరడింపు *

తలిదండ్రులార! యో - ధన్యాత్ములార!
విలసితమతులార! - వినుడొక్కమాట
మగటిమి మీర నా - మహిమంబు జూప
తగదిపు డెట్లన్న - తప్పక వినుడి!
ఈ కంసుడను నీచు - నిలమీద గూల్ప
నాకు కాలముగాదు; - నాటనుండియును

చెరవెట్టి మమ్ము హిం - సించిన కంసు
దరిమురి తెగు కాల - మతివేగ మొదవు,

దనర నందాక వే - తాళక యిపుడె
చెనకిన, కార్యంబు - చెడిపోవు గనుక

ఇన్నినా ళ్లోర్చితి; - రిక కొన్నివాళ్లు
పన్నుగా నోర్చుడీ! - పదర[1] వేమిటికి?

తక్కక నను పర - స్థలమందు జేర్చి
యిక్కడ మీరుండు; - డిక కొన్నినాళ్లు

జరిగిన వెనుక ని - చ్చటికి వచ్చెదను;
వెరువవద్దనుచు శ్రీ - వేంకటశైల

పతియైన తరిగొండ - పట్టణాధిపుడు
హితము జెప్పుచు మరి - న్నిట్లని పలికె:

## దర్వు, ఆది తాళం

తల్లడింపవద్దు తల్లి - దండ్రులారా!
నాకు, దయ మీ యందు గద్దు - తల్లి దండ్రులారా! ౧

ధరలో కంసు నణతు - తల్లి దండ్రులారా!
నే మీ, తాపము వారింతు - తల్లి దండ్రులారా! ౨

తరిగొండ నరహరిని - తల్లి దండ్రులారా!
నే మీ, తపము బండించేను - తల్లి దండ్రులారా! 3

ద్విపద. అని పల్కి దేవకి - నపు డాదరించి
వనజాక్షు డనియె: న - వ్వా! పూర్వమందు

మలయు స్వాయంభువ - మన్వంతరమున
తెలియ పృశ్నియనే ప - తివ్రత వీవు,

---

1. పదరు=త్వరపడు. ( చూ. శ. ర. పుట. 463)

శౌరియు నుతపద్మ - జానతి ; యపుడు
మీరిద్దరును నియ - మించి తపంబు

గావింప, నే వచ్చి - కరుణతో మెచ్చి
'కావలసినదేమి? - కామింపు' డనిన

అపుడు మదీయ మా - యావిష్టు లగుచు
నపవర్గ మార్గమం - దాసక్తి విడిచి,

దనర నాయంత పు - త్రకు నియ్యుమనుచు
కినిసి[1] మీరపు డడి - గితి; రందుచేత

నెరయ నాపరివాడు - నేనె గావునను
కర మర్థితో పృశ్ని - గర్భు డనంగ

నాకాలమందు మీ - యందు బుట్టితిని.
అకట[2] కశ్యపు - డదితి యనంగ

మేదినీ తలమున - మీరు జనింప
నాదరం బెసగ నే - నప్పుడు - మీకు

వసుధపై బుట్టితి - వామనుండనగ,
ననదృశ లీలతో - నది నా ద్వితీయ

జననంబు; మూడవ - సారి మీ కిచట
తనయుడనైతి; తొ - ల్తను మూడుమార్లు

కొడుకు నిమ్మని మీరు - కోరి పల్కితిరి,
పుడమి తత్కారణం - బున మూడు మార్లు

---

1. 'సమీపించి' అని యర్థము. (చూ. శ. ర. పుట. 175).
2. 'అకట' అను దానికి వ్యావహారికరూపము. 'అటు పిమ్మట' అను అర్థమున ప్రయోగింపబడినది.

నెనరుతో మీయందు - నేను బుట్టితిని.
ఎనసి తద్వృత్తాంత - మిప్పుడు మీరు
నెరుగ జెప్పితి; బుట్ట - నింక నెన్నటికి.
నరుదుగా తరిగొండ - హరినైన నన్ను
తనయుండనుచు మీరు - దలపుచునుండి
ఘనతరమైన మో - క్షము బొందు డనిన
విని దేవకీదేవి - వెరగు నొందుచును
దనుజారి వీక్షించి - తగ నిట్టు లనియె:

తే. గీ. పరగ బ్రహ్మాండ తతుల గర్భమున దాచి,
బ్రహ్మలను గాంచి పెంచి, ప్రపంచమెల్ల
పాలనము జేయుచుండెడి పరమపురుష!
యొదిగి నాగర్భమం దెట్టులుంటి వీశ? 33

వ. అని దేవకీ (దేవి) వెరగు నొందుచున్న సమయంబునవసుదేవుం
డిట్లనుచున్నాడు: 34

క. ఆకాశవాణి మాటల
కా కంసుం డులికి, పుట్టినప్పుడె నిను దా
జేకొని శిక్షించెదనను
నీ కష్టము బాయుటెట్టు? లీశ్వర! చెపుమా. 35

వ. (అని చింతించుచున్న తండ్రితో శ్రీకృష్ణుండిట్లనుచున్నాడు:) 36

## *ఉపాయము*

ఆ.వె. వినుము తండ్రి! యొక్క వెరవు జెప్పెద మంద[1]
యందు నందుభామ యాడు శిశువు
నొనర గాంచు; నచటి కుపమగా[2] నను జేర్చి
యచటి యాడు శిశువు నిచట జేర్చు. 37

1. 'మంద' యనగా వ్రేపల్లె. ఆవులమంద లుండు చోటు గావున 'మంద' యనబడినది. 'వ్రజము' అనునది దీనికి సమానమైన సాంస్కృతికరూపము.

2. ఉపమ=ఉపాయము. (చూ. శ. ర. పుట. 90).

ద్విపద. అని విని వసుదేవు - డంగీకరించె,
ననువంద దేవకి - హరి కిట్టులనియె:
వనజాక్ష! నిన్ను స - ర్వముని ప్రముఖులు
కనుగొంటిమందురు - గాని, యీదివ్య
తనువు గానగలేరు - తన్మూర్తి నిపుడు
కనుగొంటి; మాంసనం - కలితదృష్టులను
కనజాల నిక, కృపా - కంధివై యిచట
నొనరిన నీ మూర్తి - నుపసంహరించి
మనుజ బాలకుడవై - మమ్మొద్ధరింపు
మన విని తరిగొంద - హరి వేడ్క నపుడు.

**దర్వు, ఆది తాళం**

శ్రీనారాయణుడు తిరో - ధాన మొందెనూ ॥పల్లవి॥
పూని తల్లిదండ్రు లపుడు - పులుకు పులుకున[1]జూడగా
శ్రీనారాయణుడు తిరో - ధాన మొందెనూ ॥ఉప॥
తల్లిదండ్రులకు బాగ - నుల్లానముజేసి వేగ ॥శ్రీనారా॥ ౧
తక్కక నందుండి లేచి - తన దివ్యరూపము దాచి॥శ్రీనారా॥ ౨
తరిగొండ నరకేసరి - వరశేషాచలవిహారి ॥శ్రీనారా॥ 3

తే.గీ. ఇటు తిరోధానమొంది లక్ష్మీశ్వరుండు
చిన్ని ముద్దుల పాపడై చేతు లెత్తి
తన్ను గానక చింతించు తల్లిదండ్రి
ముందరను నేల వ్రాలి సమ్మోద మొదవ. 38

తే. గీ. కావు కావున నేడ్చుచు కనులు దెరచి
చూడ, దేవకి సుతుమోము జూచి వగచి

---

1. 'కనురెప్పలను పలుమారు త్వరత్వరగా మూసి తెరచుచు' అని భావము.

మంద కంపింపజాలక తుంది, శిశువు
వెత్తికొని ముద్దులాడుచు విట్టు లనియె: 39

### దర్వు, ఆది తాళం

నిన్ను మంద కెట్లంపింతు - నీలవర్ణా!
యీ, చన్నుబా లెవ్వారికిత్తు - సత్యపూర్ణా! ౧

అరుగురు సుతుల కంసు - దఱచె నన్నా!
వి, న్నారకె కన్నుల జూచు - చుండె నన్నా! ౨

తరిగొండ నారసింహుని - దయతో నన్నా!
నీవు, తిరముగా భూమిపై వ - ర్ధిల్లుమన్నా! 3

క. అని కొడుకును దీవింపుచు
తన పెనిమిటి చేతి కిచ్చి 'తడయక చను నీ'
వనగా, వసుదేవుండా
తనయుని చేపట్టి జరుగుతరి ముదమొప్పన్. 40

ఆ.వె. మందలో యశోద మగువను గని మేను
మరచియుండె యోగమాయచేత,
నట్టి సగము రాత్రి నానకదుందుభి
జరిగి జరిగి పోవు సమయమందు. 41

ద్విపద. సరగున వసుదేవు - సంకెల లూడె,
మరి చన యమున దా - మార్గంబు నిచ్చె;

నందున వసుదేవు - డా ముద్దు సుతుని
మందకు గొనిపోయి - మాయగా నందు

కొమ్మముందర తన - కొడుకును బెట్టి
యమ్మాయ యను బాల - నపుడు గ్రహించి,

క్రమ్మర మధురకు - గ్రక్కున వచ్చి
నమ్మతిగా తన - పతి చేతి కొనర
ప్రేమతో నయ్యాడు - బిడ్డ నందించె.
వామీద నచ్చట - నయ్యాడు శిశువు
కావు కావున నేడ్వ - గా వేగ లేచి
కావలివారలా - కంస భూపతికి
చెప్పిన, భీతిల్లి - చెచ్చెర లేచి
కప్పరపాటున[1] - ఖడ్గంబు బెరికి,
సరభసంబున మించి - ఝళిపించికొనుచు
పరగ దేవకి యున్న - భవనంబునకును.

*కాలకంసుడు *

దర్వు, ఆది తాళం

కంసుడు వచ్చెనూ, కాలా - కంసుడు వచ్చెనూ ॥పల్లవి॥
జీవహింస జేయుటకు మదిలో - నించుక
వెరువక యుండే ॥కంసుడు వచ్చెనూ॥ ॥ఉ.ప॥

కోరమీసము దీడుకుంట[2] - గుడ్లు బిక్కరించుకుంట[3]
శూరుడై దేవకియున్న - సూతికా గృహములోకి ॥కంసుడు॥ ౧

తల విరియ బోసుకూని - దాక్షిణ్యమంతయు మాని
చెలియలి బిడ్డను పూని - శిక్షించేను విడువనాని ॥కంసుడు॥ ౨

---

1. కప్పరపాటు - సంభ్రమము. (చూ. శ. ర. పుట. 149).
2. ఇది 'తీడుకొనుచు' అను అసమాపకక్రియయొక్క వ్యావహారిక రూపము. తీడు=వాడిచేయు. (చూ. శ. ర. పుట. 350)
3. ఇది 'బిక్కరించుకొనుచు' అను అసమాపకక్రియకు వ్యావహారిక రూపము.

తరిగొండవాసుడు శేష - గిరిధాము దర్శము వచ్చి
విరివిగా వర్ధన్నగాని - విడువ నింక శిశువునాని ॥కంసుడు॥3

వ. (అప్పుడు) కంసుడు దేవకితో నిట్లనుచున్నాడు: 42

ద్విపద. ఓ దేవకీదేవి! - యొనర నీ విచట
నాదరంబుగ గాంచి - నట్టి డింభకుని
తెప్పున బట్టి నే - తెగటార్పవలయు;
నిప్పుడు నిల్పరా - దెంతైనగాని
ధరణిపై నీ సహో - దరుని, కోపమున
పొరిగొన బుట్టిన - పుత్రుని మీద
నీకు మోహంబేల? - నెనరెల్ల మాని
నీ కొడుకును దెమ్ము - నేను ద్రుంచెదను;
అదరార తరిగొండ - హరి యర్థమైన
విడువను తే తెమ్ము - వేగ డింభకుని.

వ. అనిన విని దేవకీదేవి బిడ్డ నెత్తుకొని కంసునితో నిట్లనుచున్నది: 43

## దర్వు, ఆది తాళం

అన్నా! యీ శిశువు ఆడదిరా! ॥పల్లవి॥
సంపన్నా! నిను జంపదు గదరా! ॥అ.ప.॥
మగవాడైనను - పగమీరగ నిను
తెగజూచీనని - దిగులుపడందగు ॥నన్నా॥ ౧
సొరెకు కత్తిని - ఝళిపించిన, మది
నారటమైనది - యకటా! ద్రుంపకు ॥మన్నా॥ ౨
తరిగొండనృకే - సరి తోడే! [1] యీ
వరసుత నిప్పుడు - వధియింపక పో ॥వన్నా!॥ 3

1. 'తరిగొండ నృకేసరి తోడు' గా. అనగా 'తరిగొండ నృకేసరి మీది ఒట్టు' గా వధియింపక పొమ్మని తాత్పర్యము.

వ. (అప్పుడు కంసుం డిట్లనుచున్నాడు:) 44

తే. గీ. ఉవిద! యష్టమ గర్భమం దుదితమైన
పురుషుడే గాని, స్త్రీ గాని భూమిమీద
నేల మననిత్తు? నిపుడు నేనేల విడుతు?
నెమ్మదిగ బిడ్డ నిక బట్టి తెమ్ము తెమ్ము. 45

వ. (అనిన దేవకి యిట్లనుచున్నది:) 46

గీ. కొడుకులకు నోచనైతి; నీ కూతునైన
నేను సాకెద నియ్యరా! నెనరు మీర,
మేనకోడలు గావున దీనిమీద
నలుగవద్దన్న! మ్రొక్కెదనన్న! విడువు. 47

వ. అనిన విని కంసుండు కోపాటోపంబున దేవకిని గదిమి, శిశువును నాచికొని[1]గగనంబున కెగురవైచి కత్తి యొడ్డి చూచుచుండగా, ఈ శిశువంత రిక్షంబున కెగసి కంసునితో నిట్లనుచున్నది:

48

## * యోగమాయ పల్కులు *

### ఏలలు

క్రూరాగుణమూ విడువాలేక - ఘోరాపాపామూలు జేసి
మీరీ గర్వించీనావేమిరా? వోరోరి కంసా!
-మేలు నీ కీమీదా లేదురా! ౧

తనువూ నిజమూ గాదనుచూ - తలచీ శాంతి బొందాలేక
చెనటీవాడా వైతీవేమిరా? వోరోరి కంసా?
-శిశువూలా ఖండించేవేమిరా? ౨

1. అపహరించి. (చూ. శ.ర. పుట. 420).

కారాణా మున్నారీతిని కార్యాము బుట్టూ ననుచూ
ధీరాతా నుండరాదేమిరా? వోరోరి కంసా!
-దిగులు పడితే తీరూనేమిరా? 3

తల్లాడింపూచుండాగా నీ - చెల్లెలు గన్నా బిడ్డాలా
నెల్లా వధించీనాదేలారా?[1] వోరోరి కంసా?
- యేమి ఫలమూ నీకూ వచ్చెరా? ౪

వరశేషాద్రీ నిలయూడైన - తారిగొండా నారాసింహుడూ
ధరను నిన్నూ నిలువానీడురా! వోరోరి కంసా?
- దైవకృతమూ దప్పునేమిరా? ౫

ద్విపద. ఓరోరి కంస! యో - రోరి పాపాత్మ!
తేరకె పూర్వమీ - దేవకీసుతుల

చంపితి; విటు నన్ను - జంపబూనితివి,
తెంపరినై నిన్ను - తెగటార్చు దాన

గాను; నిన్ జంపెడి - ఘనుడు నాతోడ
తాను జనించి ము - దంబుతో నొక్క

చోట నున్నాడని - సూటిగా బలికి,
ధాటిగా నమ్మాహె - ధ్ధతయైన శక్తి

భరితాష్ట దోర్దండ - భాస్వర యగుచు
మరి యందు నిలువక - మాయగా నెగసి

సురసిద్ధ చారణా - సురకిన్నరాదు
లరుదైన కానుక - లర్పించి పొగడ

---

1. 'వధించినది ఏలరా?' అని విభజనము.

బహురూపనామ వి - భ్రాజిత యగుచు
మహితగుణంబుల - మాన్యయై వెలసి,
తరిగొండనృహరి సో - దరి యను కీర్తి
నురుముదంబున బొందు - చుండె నిద్ధరను.

వ. అప్పుడు కంసుండు తేరకు దేవకి బిడ్డలను చంపితినని వగచి, దేవకీ వసుదేవులతో నిట్లనుచున్నాడు: 49

తే.గీ. బయలు మాటలు నమ్మి మీ బాలకులను
జంపుటకు మీరు నన్ను శపింపవలదు,
కారణంబున్న గతి బుట్టె కార్యమనుచు
వారలకు మ్రొక్కె కంసుండు గౌరవమున. 50

వ. ఇటు మ్రొక్కి దేవకీ వసుదేవుల నూరడించి, కంసుండు నిజనివాసంబున కరిగె; నంత 51

* మందలో పురుటిబిడ్డడు *

వ. మందలో యశోద మేల్కాంచి మాయా నిద్రా విముక్తయై లేచి,ముందర కావుకావున నేడ్చుచున్న ముద్దు బాలకుం జూచి తన చెలులతో నిట్లనుచున్నది: 52

తే. గీ. నేను నిదురించినటులుంటి నెలతలార!
ఎపుడు బుట్టెనె యీ బిడ్డ యింతులార?
చాలా కడుపెండినది గదే సఖియలార!
బొడ్డు గోయరె యికనైన పొలతులార! 53

వ. అనిన విని చెలులు బిడ్డ బొడ్డు గోసి, నీళ్ల బోయుచున్న జూచి యశోద యిట్లనుచున్నది: 54

## దర్వు

ఉద్దు కూర్చుకునీ[1]నమ్మా! చిన్ని బిడ్డడు ॥పల్లవి॥

వుద్దు కూర్చుకునీని[2]వోయమ్మ! నా బిడ్డ

దర్జముగ చేతులొడ్డి నీళ్లు బోయు ॥దుద్దు॥ ఉ.ప.॥

తక్కక కన్నులు - తలను, పుణికె నొత్తి

ముక్కు చెక్కులు నొత్తి - మోమొంచి[3]లాలబోయు ॥దుద్దు॥ ౧

తొడలు మోకాళ్లు చే - తులు సాగదియ్యుచు

కడుపు నిమిరి మెల్ల - గానె లాలబోయు ॥దుద్దు॥ ౨

తరిగొండపుర నర -హరి వరమున నేటి

వరకు బుట్టిన బిడ్డ - వర్ధిల్లవలె నిప్పు ॥దుద్దు॥ 3

వ. అనిన విని నవ్వుచు చెలులు బిడ్డకు నీళ్లుబోసి, చేటనుంచి, కొలను పూజించి[4]దేవళ్లకు మ్రొక్కి, తదనంతరంబున. 55

---

1,2. 'ఉద్దుగుడుచుకొని' అను క్రియాపదము యొక్క వ్యావహారికరూపములు. ఉద్దుగుడుచు=ఊపిరిత్రిప్పలేక బాధపడు. (చూ. శ. ర. పుట. 82) 'ఉక్కిరిబిక్కిరియగు' అని భావము.

3. 'మోము వంచి' అని విభజనము. ఇది వ్యావహారిక సంధిరూపము.

4. 'కొలను పూజించుట' దేశీయమగు ఒక ఆచారము. శిశువు జన్మించిన వెంటనే, బొడ్డు గోసిన అనంతరము 'మావి'ని ఒక మట్టి పాత్రలో నుంచి, ఇంటిముందు ప్రదేశమున నొక ప్రక్క చిన్న గోతిలో నుంతురు. పిమ్మట మట్టితో గోతిని నింపి చదును చేసి, పై నొక బరువైన రాతి నుంచెదరు. ఇట్లు 'మావి' ఉంచబడిన ఈ చోటునకే (స్నానార్థమైన) కొలను, కొల్లు - అని వ్యవహారము. పుట్టిన నాటినుండి పురుటి రోజు వరకు శిశువుకు, పురుటినాడు జనయిత్రికిని ఈ 'కొల' నున్న చోటనే నీళ్లు పోయుదురు గనుక ఈ పేరు సార్థకము. మంత్రసాని మూడు చిన్నరాళ్లను కొలనిబండకు ఆనించి, వాటిని పసుపు కుంకుమలతో అలంకరించును. వీటినే కొలనుదేవతలు ('శీత'లు) అందురు. వేపాకు, జొన్నలు, ప్రత్తిగింజలు- వీటిని కలియగలిపి, అక్షతలుగా కొలనిదేవతలపై వేయుచు మంత్రసాని పూజించును; ఆ దేవతలకు పప్పుబెల్లములు నివేదించి మ్రొక్కులిడును. పిమ్మట ఆ పప్పుబెల్లములను ,చిన్నపిల్లలకు వంచును. 'కొలను పూజించుట' యను మాటలో ఈ సంప్రదాయార్థ మంతయు ఇమిడియున్నది.

ద్విపద.ఆ యశోదాదేవి - కా చెలు లెల్ల
నాయకం[1]బొప్పగా - నడుము బిగించి

గట్టి కారవు గుట్టి - కల మ్రింగ నిచ్చి,
గట్టిగా తలనంట - గా కొంగు గట్టి
కావుబొట్టు[2], విభూతి - కాటుక బెట్టి
వేవేగ కాచుతో[3] - విడె మిచ్చి, సుతుని

తొలగక పుణుక నొ - త్తుచు నాముదంబు
తలనంటి, యట నుగ్గు - ద్రావించి, నల్ల
చుక్కలు నుదుటిపై - సొగసు చెక్కిళ్ల
తక్కక బెట్టి మో - దమున 'యశోద!
చన్నిమ్ము సుతునకు - సంప్రీతి' ననుచు
చెన్నొంద బిడ్డను - చేతి కిచ్చినను
పట్టిని చేతుల - బట్టి యెత్తికొని
నెట్టన చన్ను మ - న్నించి త్రావించి
ఆ యింతి తరిగొండ - హరి నాత్మ నుంచి
పాయక దేవళ్ల - బ్రార్థించె నిట్లు:

## * యశోద ప్రార్థన *

## దర్వు, ఆదితాళం

దేవళ్లార! నాబిడ్డను - కావు డిప్పుడూ ॥పల్లవి॥
మిమ్మ్మొ సేవింపుచు నేను పూ - జించే నెప్పుడూ ॥దేవళ్లార॥ ఉ.ప.॥

గొడ్డుమీరియుండి నే నీ - కొడుకున్ గంటినీ
వీని, దొడ్డవాని జేయుడు పాం - దూగా నంటినీ ॥దేవళ్లార॥ ౧

1. నడికట్టుముడి.
2. శిశువులకు రక్షగా నొసటిపై నుంచెదు నల్లని బొట్టు. దీనినే 'కావిరిబొట్టు' అనియు నందురు. (చూ. శ. ర. పుట. 173).
3. తాంబూలములో చేర్చెదు ఒక దినుసు.

అయువు వారోగ్య మియ్యు - దాని యంటినీ
మిమ్ము, వేయి విధముల వేను - వేడే నంటినీ ॥దేవళ్లార॥ ౨

తరిగొండ హరికి పీడు - దాసు డంటినీ
గాన, చిరముగా మీరందరు ర - క్షింపు డంటినీ ॥దేవళ్లార॥ 3

తే. గీ. అనుచు దేవళ్ల బ్రార్థించి యా యశోద
పరగ బంగరు తొట్లలో బాలు నుంచి,
యూచి జోలలె బాడరె యువిదలార!'
యనిన జోలలు బాడి రిట్లనుచు చెలులు: 56

## లాలి

లాలి ముద్దులబాల! - లాలి గోపాలా!
లాలి కాంచనచేల! - లలితగుణజాలా! ॥లాలీ॥ ౧

ప్రవిమలాచార! యా - దవకులోద్ధారా!
కవిబృంద మందార! - కలికలుషదూరా! ॥లాలీ॥ ౨

నందనందన! సదా - నంద! గోవిందా!
సౌందర్య వదనార - వింద! ముకుందా! ॥లాలీ॥ 3

వర చిన్మయాకార! - వనధి గంభీరా!
నిరుపమ సుగుణహార! - నిగమ సంచారా! ॥లాలీ॥ ౪

శైలజనుతనామ! - సంపూర్ణ కామా!
నీలమేఘశ్యామ! - నిర్జర (లలామా!) ॥లాలీ॥ ౫

తరిగొండ పురవాస! - తారకవిలాసా!
చిరరమ్య దరహాస! - శ్రీ శ్రీనివాసా! ॥లాలీ॥ ౬

## దర్వు (జోల), ఆదితాళం

జోజో జోజో కృష్ణా! జోజోజో కృష్ణా! ॥పల్లవి॥

నీకు, వాజగాదు[1]; పోరుబెట్ట - వద్దు కృష్ణా! ॥జోజో॥ ఉ.ప.॥

చెలగుచు మామోములు జూ - చేవు కృష్ణా!
నీవు, మొలకనవ్వులు నవ్వేవు - ముద్దు కృష్ణా! ॥జోజో॥

వూచితే హాయిగా నూగు - చుండి కృష్ణా!
మే, మూచకుంటె వూకొట్టేవ - వోరి కృష్ణా! ॥జోజో॥

తరిగొండ నారసింహుడు - దయను కృష్ణా!
నీకు, చిరతరాయు వియ్యవలె - చిన్ని కృష్ణా! ॥జోజో॥

## దర్వు, ఆది తాళం

చిచ్చోలా (ల్ల) చిచ్చోల్లా ॥పల్లవి॥

ముచ్చ్బవగలతోను - ముద్దులు జూపేవు
నచ్చు [చూపులతోను] నీ - కనుగవ మోడ్చావు ॥చిచ్చో॥ ౧

సోలుచు కనుమూసి - సొక్కినట్లున్నావు
నీలమేఘవర్ణ! - నిద్దుర జెందేవు ॥చిచ్చో॥ ౨

శృంగారముగ కాళ్లు - చేతు లాడింపూచు
నుంగ వుంగ యని - యూరకె పోరేవు ॥చిచ్చో॥ ౩

వరతరిగొండనార - సింహుడు నీలోన
నిరవుగ నున్నా - డింకేల పోరేవురా? ॥చిచ్చో॥ ౪

వ. అని యిట్లు చెలులు జోలలు బాడుచుండి; రంత నందుం డట్టి పుత్రు జననంబు విని, యమునలో స్నానంబు జేసి, ధనధాన్యంబు లవేక

---

1. 'తగదు' అని భావము.

బ్రాహ్మణులకు (ఇచ్చి) పుత్రోత్సవంబు జేసి, పురోహితునకు భూషణాంబరంబు లిచ్చి మ్రొక్కి యిట్లనుచున్నాడు: 57

తే.గీ. ఓ పురోహిత! బహునాళ్ల కుర్విమీద
నాకు పుత్రుడు బుట్టియున్నాడు; వాడు
జనన మొందిన దివస నక్షత్ర లగ్న
ముల ఫలంబులు జెప్పవె! ముదముతోడ. 58

## * పురోహితుడు - జాతక ఫలము *

వ. అనిన విని పురోహితుం డిట్లనుచున్నాడు:వినవోయి నందగోపకా!

శ్లో॥ నమయా వీక్షితా ఛాయా, నక్షత్రం నావలోకితం।
పరోపదిష్టవేళాయాం, లిఖ్యతే జన్మపత్రికా॥

యిషని జ్యోతిషమందు వుంచున్నది. యీ రాత్రి మోడము బట్టివున్నది. పాదచ్ఛాయా వేయకూడదు . నక్షత్రములున్ను కనిపించలేదు. నీవు నన్ను అడిగిన ప్రశ్న లగ్నంబట్టి లెస్సగా విచారించి చెప్పుసామూ. నీ కుమారుడు వుదయించిన దినం శ్రావణ బహుళ అష్టమి రోహిణి నక్షత్రం. రోహిణి మృగశిరార్ధం వృషభం. కాగా, రాశి వృషభరాశి. తత్తద్గ్రహ గతులున్నూ, వీక్షణ విశేషములున్నూ లెస్సగా విచారిస్తిమి. కాగా, నీ కుమారుడు జారుడౌనున్నాడూ; చోరుడున్ను అవునున్నాడూ. చౌషష్టి విద్యలున్ను నీ కుమారునికి వస్సున్నవి. యిదిగాక బాల్యమందు విషగండం, సర్పగండం, శకటగండం, గాలి గండం, అజగర గండం, అగ్నిగండం, జలగండం, సర్పగండం,వృషభగండం, హయగండం, గజగండం, వస్సున్నవి. ఆ గండము లన్నిన్ని తప్పిపోస్సున్నావి. నీ కొడుకు లోక [ప్రసిద్ధ] జారుడనిన్ని, చోరుడనిన్ని నిందె పొందుసూ వుంచున్నాడూ. ఆ రోహిణి నక్షత్ర ఫలం యేమని అంటివైనా, అతని మేనమామకు గండం వస్సున్నది. నీ కుమారుడు స్వస్థలం విడిచి పరస్థలం జేరునున్నాడు. బహుమంది పెండ్లాల పెండ్లాడునున్నాడూ. బహుమంది బిడ్డల గనునున్నాడూ. బహుమంది దుర్మార్గుల చంపునున్నాడూ. బహుమంది సన్మార్గుల రక్షిస్తున్నాడూ. మహదైశ్వర్య సంపన్ను డౌనున్నాడూ. నూటయిరవైయయిదేండ్లు జీవిస్తున్నాడు.

శ్లో॥జననీ జన్మసౌఖ్యానాం, వర్ధనీ కులసంపదాం।
పదవీ పూర్వపుణ్యానాం, లిఖ్యతే జన్మపత్రికా॥

యిషనేని సిద్ధాంతం వుంచున్నదిగనుక, జన్మసౌఖ్యాలకున్ను,[ కులసం] పదవర్ధమానం అయ్యేటందుకున్ను,పూర్వజన్మ పుణ్యవిశేషములు తెలియుటకున్ను మాకు తోచినట్లు లెస్సగా విచారించి చెప్పినామూ.

నేను పెద్ద బ్రాహ్మణ్ణి. జటాంత స్వాధ్యాయినీ. నాల్గు వేదములున్ను, ఆరు శాస్త్రములున్ను, పదునెనిమిది పురాణములున్ను, ................ [చది] విన వాణ్ణి. బిడ్డలు గలవాణ్ణి. జ్యోతిషము లెస్సగా చదివినవాణ్ణి. కాగా, నేనే దానపాత్రుణ్ణి. ఆత్మస్తుతి, పరనిందా ధనకాంక్ష లేని నావంటి మహానుభావునికి యేమి దానము చేసినా మీకు అనంతపుణ్యం వస్తున్నది. నాకేగాని, తక్కిన భ్రష్టులకు యెవ్వరికి దానము [చేయరాదు]. మాకు మూడు హస్తములు గలవు. మూడు హస్తములలో అహవనియ్య, గార్హపత్య, దక్షిణాగ్నులనే త్రేతాగ్నులున్ను మూడు హస్తముల యందున్ను వుంచున్నవి. కాగా, మా హస్తము దానపాత్రమై వుంచున్నది. మేము మహాపవిత్రమైన వారము. త్రికాలములయం [దున్నూ మీకు శుభములు గలుగుసూ] ండవలెనని ఆశీర్వాదం జేస్సూవుంచున్నాము.

అనిన పురోహితునికి నందుండు గో భూ హిరణ్య దానంబులు మొదలైన షోడశ మహా దానంబులు జేసిన, పురోహితుండు దీవించి చనియె; నంత 59

ద్విపద. నలువొప్ప నటమీద - నందగోపకుడు
నలరుచు పురుడు పుణ్యాహవాచనము
[వరలెడు స] కలోత్స - వంబులతోను
నెరవేర్చి సుతుని మ - న్నింపుచునుండె.

## * పూతన *

అంతమీదట కంసు - డాకాశమందు
పంతంబుతో శక్తి - పలికిన పలుకు
తలచి, భీతిని బొంద[1] - తను జంపువాడు
పొలుపొంద ధరణి పై - బుట్టినాడనుచు
జెప్పె గావున, చిన్ని - శిశువులనెల్ల
తెప్పున జంపిన - తెరలి యెందైన
............................. గా కనుచు
తక్క కచ్చటికి పూ - తనను రప్పించి
'భూలోకమున నీవు - పొందుగా వెదకి
బాలుర జంపు మే - ర్పడ' నన్న, దనుజ
కామిని చనులలో -గరళంబు నుంచి
భూమిలో బుట్టిన - బుడుతల కెల్ల
చన్ను బాలనుచు వి - షము నిచ్చి చంపి
పన్నుగా నొకనాడు - బాలింతవలెను
వెర [వొప్ప సుం]దర - వేషంబు దాల్చి
యరుదుగా తరిగొండ - హరియైన కృష్ణ
దేవుడు పెరుగగా - దీపించు మంద
కావేళ వచ్చె న - త్యద్భుతంబుగను.

### దర్వు, ఆదితాళం

భూతకి[2] వచ్చెనూ; ప్రాణ - ఘాతకి వచ్చెనూ ॥పల్లవి॥

మహా, పాతకాములాకు మూల - పా థేయామై పుట్టినట్టి ॥భూతకి॥ ॥ఉ.ప.॥

సరగమాయ [లు ప] న్నుకుంట - బాలకూల వెదకుకుంట ॥భూతకి॥ ౧

---

1. భీతిని బొందునట్లుగా - అని యర్థము.
2. ఇది దుష్టయగు రక్కసికి పర్యాయముగా వాడబడు ప్రసిద్ధ వ్యావహారికరూపము. శూర్పణఖను సైతము 'భూతకి' యని వ్యవహరించుట జానపదులలో కలదు.

తన చన్నులు చేపెనంట - త్రాగే బిడ్డాడు లేడంట ॥ఘాతకి॥ ౨
తరిగొండ నరహరి చేత - తా నీల్గుట తెలియలేక ॥ఘాతకి॥ ౩

గీ. ఇట్లు వచ్చిన పూతన యిందు నందు
చిన్ని బిడ్డల వెదకుచు, చిత్రగతుల
నాట్య మొనరింపుచును, నందనందనుండు
పవ్వళించిన మేడలోపలికి బోయి 60

వ. అందు కన్నులు మూసి యేమి యెరుంగని వాని చందంబున నిదురింపు చున్న చిన్నికృష్ణుని బట్టి యెత్తబోయిన, యశోద అడ్డంబు వచ్చి యిట్లనుచున్నది: 61

## దరువు*, ఆదితాళం

నా బిడ్డను బట్టను నీ వెవతెవు? - నాతో దెలుపవె కొమ్మా!
[మరి], నాతో దెలుపవె కొమ్మా! ॥పల్లవి॥

నీ బిడ్డడు నాబిడ్డ డనుచు బలు - నెనరున బట్టి తినమ్మా!
బలు, నెనరున బట్టితినమ్మా! ౧

నిద్దురబోయెడి బిడ్డను లేపను - నీకు పనేమే కొమ్మా?
మరి, నీకు పనేమే కొమ్మా? ౨

బాలుడు ముద్దుగ నున్నా డందున - పాలిచ్చెద నో యమ్మా!
చను, బాలిచ్చెద నోయమ్మా! ౩

నా బిడ్డకు నా పా [లున్నది] - నీ బిడ్డ కియ్యవే కొమ్మా!
పాల్, నీ బిడ్డ కియ్యవే కొమ్మా! ౪

గొడ్డుపాలు బడియున్నది; త్రాగను - బిడ్డడు లేడోయమ్మా!
నాకు, బిడ్డడు లే డోయమ్మా! ౫

బిడ్డలు బుట్టని గొడ్డుపాలు నా - బిడ్డకు వలదే కొమ్మా!
నా, బిడ్డకు వలదే కొమ్మా! ౬

* ఇది సంవాద దరువు. యశోదకు పూతనకు మధ్య నడిచిన సంవాద మిందు కలదు.

సంతానము కొరకే నే నితనికి - చను గుడిపించెదనమ్మా!
నే, చను గుడిపించెదనమ్మా! ౭

చన్నువుడ త్రాగను వ డిక, నీ - చన్నిపు డొల్లడె కొమ్మా!
నీ, చన్నిపు డొల్లడె కొమ్మా! ౮

ముద్దుల బాలుని తొడపై నిడుకొని - ముద్దాడెద నియవమ్మా!
వీని, ముద్దాడెద నియవమ్మా! ౯

తరిగొండాధీశ్వరు తోడే వీని - తాకరాకవే కొమ్మా!
వీని, తాకరాకవే కొమ్మా! ౧౦

వ. అని యిట్లు యశోద [అడ్డం] బు వచ్చి వారింపుచున్న నిలువక, బలాత్కారంబున డింభకు నెత్తి తొడలపై నిడికొని, చుంచు దువ్వి చెక్కిళ్లు యిట్లనుచున్నది: 62

ద్విపద.ఓ చిన్ని బాలక ! - ఓ ముద్దులయ్య!
నీ చెల్వమును జూడ - నేడు వింతయ్యె

కనుమూసి కుసిలింప [1] - కారణంబేమి?
నను జూచి చిరునవ్వు - నవ్వరా తండ్రి!

సహజమౌ నీ తల్లి - చనుబాలకన్న
బహు మధురంబైన - పాలు నా పాలు

కావున ద్రావి శీ - ఘ్రంబుగా నిదుర
పోవచ్చునని తట్టి - బుడుతని లేపి

తరిగొండ నరహరిన్ - తన తొడ మీద
నిరవుగా నిడికొని - యిట్లని పలికె:

## దర్వు, ఆదితాళం

పాలు దాగరా! నా కొడుకా ! - పాలు దాగరా! ॥పల్లవి॥

వోరి, నీలవర్ణ! నీకు బాగా - నిద్దుర వచ్చేనిగాని ॥పాలుదాగరా!॥ఉ.ప॥

---

1. కుసిలించు - అతృప్తిచే దుఃఖించు (మా. శ. ర. పుట. 187)

నిన్ను గన్న తల్లి పాల - కన్న మధురమగుచు జేపె[1]
పన్నుగ నీ విపుడు పొర - బారక[2] తిన్నగ నొదిగి ॥పాలు॥ ౧

కడుపు వాడియున్నదిరా! - గళమంతా యెండె గదరా!
బుడుతడ! నీ కరువు దీర - బొజ్జనిండ వూర వూర[3] ॥పాలు॥ ౨

'తరిగొండా వాసుని తోడే! - తాకవద్దు బిడ్డ' నని
పరగ బల్కిన మీ యమ్మ - బాగా సంతోషించుగాని ॥పాలు॥ 3

ద్విపద.అని యివ్విధంబున - నాదరింపుచును
తను లేపుచుండిన - దానవి క్రూర

భావంబు దెలిసి లో - పల నవ్వికొనుచు
నావలింపుచు కన్ను - లప్పుడు దెరచి,

మెల్లనె కుసిలించి - మెలపుగా నొదిగి
సల్లలితుడు దాని - చను కబళించి,

దాని ప్రాణములతో - దాని చన్పాలు
దానవాంతకుడైన - తరిగొండ నృహరి

బీర్చు[4]చునుండగా - పెడబొబ్బ లిడుచు
నోర్చలే కా యింతి - యులికి యిట్లనియె:

## దర్వు, ఆదితాళం

విడువరా! చన్ను - విడువరా! ॥పల్లవి॥

వోరి, విడువరా! పిల్లల - పిడుగువంటి బిడ్డ! ॥విడువరా!॥ ఉ.ప.॥

దయ్యమువలె బట్టి - త్రావేవు పాలన్ని
కుయ్యో మొర్రో! యింక - కుడువవద్దయ్యయ్యో! ॥విడు॥ ౧

1. 'చేపెను', అనగా పాలు స్రవింప నారంభించెనని భావము. (చూ. శ. ర. పుట. 279).
2. 'పొరు పెట్ట దొడగక' అని యర్థము.
3. 'ఊరగా, ఊరగా' అని యర్థము.
4. 'పీర్చు'కు వ్యావహారిక రూపము.

వడిగి[1] ప్రాణములన్ని - వాతికి[2] వచ్చెను
తడబడుచున్నది - తనువిప్పు డయ్యయ్యో! ॥విడు॥ ౨

తరిగొండ నరహరి - దంష్ట్రల కన్నాను
బెరసిన వాడిమి - పెదవులిం దయ్యయ్యో! ॥విడు॥ 3

వ. అని యిట్లు పూతన యేడ్చుచుండగా కృష్ణుండు దాని ప్రాణంబులు చను బాలతో బీర్చిన, అది (వి)కృతరూపంబుగా నేల గూలిన, దా[ని రొ]మ్ము మీద నాట్లాడుచున్న, డింభకునికి కినరు[3] దాకెనని కన్నీరు నింపుచున్న యశోద చేతికి చెలులు కృష్ణుని గొనిపోయి యిచ్చి యిట్లనుచున్నారు: 63

జంపె

కన్నీరు బెట్టకువె - కామిని యశోద!
నీ, చిన్నారి కృష్ణునికి - శ్రీరామరక్షా ! ౧

పన్నుగ నికమీద - భయమించుకయు లేదు
చిన్నారి కృష్ణునికి - శ్రీరామరక్షా! ౨

మన్నించు తరిగొండ - మనుజకేసరి దయను
చిన్నారి కృష్ణునికి - శ్రీరామరక్షా! 3

వ. అని యిట్లు చెలులు గోపెమ్మ నాదరించి కృష్ణునికి సర్వాంగరక్షణంబులు జేసి; రంత నందుండు వచ్చి వెరగుపడి పూతన శరీరంబునకు తగిన సంస్కారంబు జేయించె; నంత. 64

---

1. వడుగు - కాంతి మాయు. (చూ. ఆంధ్రక్రియాస్వరూపమణిదీపిక, పుట. 827)
2. 'నోటిలోనికి' అని యర్థము.
3. అంటుసోకుటవలన పసిబిడ్డలకు గలిగెడు దోషము. (చూ. శ. ర. పుట. 177)

## * శకటాసురుడు *

ద్విపద. కరకరి[1] నొకనాడు - కంసు పంపునను
సరభసంబున మించి - శకటాసురుండు

మురువొప్పగా గోష్ఠ - మున కేగివచ్చి
పారిపారి నందందు - పొంచుచునుండి,

పనుల తొందరచేత - భామ యశోద
వనజాక్షు నొకదిక్కు - వైపుగా నునిచి

మరచియుండిన వేళ - మాయ రాక్షసుడు
తరిగొండ హరియైన - దందశూకాద్రి

వరుడైన కృష్ణుండు - వసియించియున్న
వరరత్న హేమ భా - స్వరమై తనర్చు

భవనంబులోనికి - బండి చందమున
జవమున బొరలి యా - శ్చర్యంబుగాను.

### దర్వు, ఆదితాళం

శకటాసురుడు వచ్చెనూ
కృష్ణునిపైకి, శకటాసురుడు వచ్చెనూ ॥పల్లవి॥

కకవికలై గొల్ల - గరితలు వెరగంద
ప్రకటముగను గో - పాలుని మీదికి ॥శకటా॥ ౧

ముద్దుగ కృష్ణుని - వద్ద నాడే బుడుత
లద్దద్దిరా! యని - దద్దిర్ల[2] గా మించి ॥శకటా॥ ౨

వరతరిగొండ ని - వాసుడు శ్రీశేష
గిరివాసుడై [న శ్రీ] - కృష్ణుని మీదికి ॥శకటా॥ 3

---

1. కరకరి - క్రూరభావము. (చూ. శ. ర. పుట. 152).
2. 'దద్దిర్లు' అనునది 'దద్దరిల్లు' యొక్క రూపాంతరము.

ద్విపద. ఈ రీతి వచ్చిన - యింద్ర కంటకుడు
టీరంబు మీరగా - బెడబెడ బొరలి

శౌరిపై రా శంఖ - చక్ర దంభోళి
సారసాంకుశ కేతు - చామర ఛత్ర

హలకులిశాది రే - ఖాంకితంబగుచు
విలసత్ర్పవాళన - పీన మృదుత్వ

కలితమౌ నిజపాద - కంజాత మె [త్రి
బలియు] డై బాలుడా - బండి బోదన్నె

తన్నిన నది వియ - త్తలమున కెగసి
మిన్నక వడిగూలె - మేదిని మీద.

వరతరిగొండ ని - వాసుడై శేష
గిరి వాసుడగు బాల - కృష్ణు దర్భకుని

వలె నుండె; నందుండు - వచ్చి యచ్చోట
వలగొనుచుండిన - వారి కిట్లనియె:

తే. గీ. బండి నెవ్వడొ దన్నె [గోపాలు] లార!
దనర కృష్ణుండు బండిని దన్నెనయ్య!*
బాలుడెటు దన్నగలడు? దబ్బరలుగాక
యనుచు నందుండు వెరగందె మనమునందు. 65

ద్విపద. అంతలోన యశోద - యచటికి వచ్చి
సంతోషమున సుతున్ - చంక నెత్తికొని

రయమున తా నంగ - రక్షలు జేసి
దయ [ను జూచు] చునుండె - తదనంతరమున.

---

* ఇది గోపాలురు నందునితో పల్కిన వాక్యము.

## * తృణావర్తుడు *

ఒకనాడు శ్రీకృష్ణు - నొగి తొడమీద
రకముగా నిడుకొని - రాగిల్లి చాల
ముద్దాడు చున్న ని - మ్ముగ నద్రి పగిది
తద్దయు బళువైన - ధరియింపలేక
కుతలంబు మీదట - గూర్చుండబెట్టె;
నతిరయంబున కంసు - డంపగా నెగసి,
వడిగొను [చును తృ] ణా - వర్తుండు మించి
సుడిగాలివలె వచ్చి - చుట్టి డింభకుని
తడయక గొంపోయె; - తదనంతరమున
తడబడి యా యశో - దాదేవి లేచి
కొడుకును గానక - కూతలు బెట్టి
పడతుల నెల్ల త - ప్పక పిల్చి పలికె:

క. ఇచ్చట నుండిన బాలుని
చెచ్చెర సుడిగాలి వచ్చి చేకొని చనె; నే
నెచ్చట వెదకుదు? నీ గతి
[నచ్చు]క నేనేమి సేతు నమ్మయలారా? 66

### దర్వు

ఏమి సేతు ,నోయమ్మా?
సుతు, నెక్కడ జూతు నోయమ్మా? ॥పల్లవి॥

యిక్కాడ నుండిన - చక్కాని బిడ్డను
గ్రక్కున గొంపోయె - గాలిదయ్యము వచ్చి ॥ఏమిసేతు?॥౧

తొడమీదనే యుండి - దొడ్డగ బళువైన
పుడమిపై బెట్టితి - బుడుత డిచ్చోట లే ॥దేమి సేతు?॥ ౨

ఉరగాద్రి పతియైన - తరిగొండ నరహరి
యిరవుగా నా బిడ్డ - నిచ్చితే మేలయ్యే[1] ॥నేమి సేతు?॥ 3

---

1. మేలయ్యేను - మేలగును.

ద్విపద. అని యశోదాదేవి - యారట పడగ
తను గొనిపోయిన - దైత్యు నీక్షించి,

గోపబాలుడు వాని - కుత్తుక బట్టి
కోపంబుతో మహా - కుధరంబుమాడ్కి

భారమై తోప న - ప్ప [వన దైత్యుం] డు
భోరునబడి నీల్గె - భూస్థలిమీద

నప్పుడు తరిగొండ - హరి దైత్యుమీద
నుప్పొంగి యాట్లాడు - చుండె నవ్వుచును.

వ. ఇట్లాడుచున్న కృష్ణుని చెలులు గొనిపోయి యశోద కిచ్చి
అంగరక్షలు జేసి; రంత 67

తే.గీ. అర్భకుండొక్కనాడు తా నావులించి
వదన గహ్వ [రమందున వ] నజ జాండ
ములను జూప, యశోద తా కళవళంబు
పడుచు నందున్న సతులతో బలికె నిట్లు: 68

## ★ యశోద భ్రాంతి ★

ద్విపద. ఈ వింత లేమమ్మ! - యీ చిన్ని బిడ్డ
డావులించిన వేళ - నా నోటిగుండ

'కడుపులో నేమేమొ - గనుపింప [సాగె],
నడర నవ్వల జూడ - నమితంబుగాను

పాలన్ని [యేరులై - పా] రుచు నుండె,
నాలోన జూడ న - నంతంబు లగుచు

తలగక వెన్నము - ద్దల గుంపు లుండె,
చెలగి యీనుతున కి - చ్చిన పాలు, వెన్న

కొంచెకొంచెములైన - గొప్పలై పెరిగి
యించుకైనను హ - రించుట లేక

నాపట్టి కిట్లజీ - ర్ణంబు బుట్టించె;
నీ పాప డిట్టైన - నెటు వృద్ధి బొందు?

[శ్రీపన్ను] గాద్రి పై - చిరముగా వెలయు
నాపాలి తరిగొండ - నరహరి మీద

భారంబు వేసి పా - పని కేమి వైద్య
మారూఢిగా జేతు - నమ్మయ్యలార?

## దర్వు, ఆదితాళం

బాగా వాము వస వేంపాలి[1] - బటువు నల్లేరు గెణుపులు
వేగా కరుకైనా[2] జేసి త్రా - వింతమటరే! ౧

కడుపులోని జున్ను, పాలు - కరిగి జారిపోవుటకు
బుడుతని కాముదమైన - బోతమటరే! ౨

వెన్నముద్ద లరిగిపోవ - నన్నబేదియైన దెచ్చి
పిన్నవాని కిపుడు దిని - పింతమటరే! ౩

కారపుంటలు మ్రింగించి - కడుపు బిసికి,వేడినీళ్లు
భోరున బొడ్డుచుట్టూరు - బోతమటరే! ౪

పన్నుగ శ్రీతరిగొండ - పతిమీద భారము వేసి
చిన్ని బుడుత కీ మందులు - జేతమటరే! ౫

ద్విపద. అనగ నందొక్క వృ - ద్ధాంగన బలికె:
వినవె యశోద! యీ - వెరపేల నీకు?

పాలుపొంద నీ పట్టి - బొజ్జ లోపలను
జలజజాండంబు ల - సంఖ్యలు గలవు

గనుక, నా బ్రహ్మాండ - గణములయందు
ఘనతర దుగ్ధసా - గర పంక్తు లుండు,

1. 'వెంపలిచెట్టు' - అని యర్థము.

2. 'కరుకు' - మందుదినుసులతో చేయబడిన కషాయము.

కరమొప్పు ధవళను - కాంతుల నమరి
వరుస కైలాస ప - ర్వతములు నుండు,

సుదతి! యీ కడుపులో - జూచినపాలు
వదలని యా క్షీర - వార్ధులు గావి,

చెలువొప్ప నీవు బో - సిన పాలు గావు;
నెలత! యీ బొజ్జలో - నీవు జూచినవి

కొలదిమీరిన వెండి - కొండలు గాని,
యలరుచు సుతుని నీ - వాట లాడించి

మొనసి యిచ్చిన వెన్న - ముద్దలు గావు;
పెనుపొంద నీవేల - భీతి నొందెదవు?

వీడు బాలుడు గాడు - విష్ణుదేవుండు.
చూడ చూడగ వీని - సొబగు గాన్పించు

నమ్మ! యీ తరిగొండ - హరికి వైద్యంబు
లిమ్మాడ్కి జేయుట - కెంతవారలము?

ఓయమ్మ! నీవూర - కుండు మటంచు
నా యశోదకు ధైర్య - మది జెప్పె; నంత

## * గర్గుడు - నామకరణము *

వ. వసుదేవుని పంపున వ్రేపల్లెకు గర్గమహాముని వచ్చినం జూచి, యుచితాననంబునందుంచి పూజించి, [యమ్మునిౕకి నందుం డిట్లనుచున్నాడు: 69

### జంపె

ఓమహామౌనీంద్ర! - యో సత్కృపాసాంద్ర!
మా మంద కిపుడు స - మ్మతముగా మీరూ ౧

ఘనకృపను వచ్చినం - దున కృతార్థుడనైతి
ననఘ! కారణములే - కను పెద్దవారూ ౨

కోరి మాయట్టి సం - సారుల గృహంబులకు
కారణం బే [ద్రైన - కలుగకను] రారూ 3

వారు వచ్చిన శుభము - వచ్చు గావున, నిటకు
మీరు రాగా మాకు - మేలు దనరారూ ౪

తరిగొండ నృహరి వర - తనయులగు బాలులకు
నరులెన్న నామకర - ణము జేయు డిపుడూ ౫

వ. అని నందుండు పలికిన విని గర్గుండు సమ్మతించి,యథావిధిగా నామకరణంబు సాంగంబు గావించి, మొదట రోహిణి కుమారుని జూచి యిట్లనుచున్నాడు: 70

ద్విపద. కూరిమి విను నంద - గోపక! వేడ్క
నీ రోహిణీ పుత్రు - డిరవంద జనుల

రమియించు[1]గావున - రామాఖ్య నొనరు;
కమనీయ గర్భ సం - కర్షణంబునను

నమర సంకర్షణుం - డను పేర నమరు;
ప్రమద మొప్పగ మహా - బలశాలి గనుక

బలభద్రు డనుపేర - ప్రఖ్యాతి బొందు.
పొలుపొంద వినుము నీ - పుత్రుడు మున్ను

ధవళ లోహిత పీత - తనువులు దాల్చి
భువి మీద నిప్పుడు - పురుహూతనీల

కృష్ణ వర్ణుండౌచు - క్రీడించు కతన
కృష్ణాఖ్య నమరు; మి - క్కిలి వసుదేవ

వరపుత్రు డౌటచే - వాసుదేవాఖ్య
కరమొప్పు; బహువర్ణ - కలిత రూపముల

నిరవందు గనుక న - నేక నామముల
మెరయునంచు (వ) చించి - మీర లీ సుతుల

1. 'ఆనందింపజేయును' అని తాత్పర్యార్థము.

కరుణచే శోకార్ధి - గడతు; రీ ఘనుడు
పరవి నారాయణ - సముడని తెలుప

సనఘాత్ముడగు నందు - డానంద మొందె;
చనియె గర్గుడు నిజ - స్థానంబునకును,

వరతరిగొండని-వాసుడై శేష
గిరి వాసుడగు బాల - కృష్ణుండు, బలుడు

అచ్చట బెరుగగా - నా మందలోన
హెచ్చిన గోగణం - బిచ్చిన పాలు

పిండి, కమ్మగ గాచి - పేర బెట్టికొని
దండిగా బ్రొద్దున - దనరు వేడ్కలను.

### * గోకులము – శ్రీకృష్ణుని దుడుకులు *
### దర్వు, మధ్యమావతి రాగం, ఆదితాళం

పెరుగూ జిలుకుదురు గొల్ల చెలులు
బ్రొద్దూ బ్రొద్దున, పెరుగూ జిలుకుదురు గొల్లచెలులు ॥పల్లవి॥

కర కంకణములు - ఘలు ఘల్లన, ముం
గురు లల్లాడగ - సరభసముగ నిటు ॥పెరుగూ॥ ॥అ.ప.॥

చలువా చీర [లు] - నెళ నెళ మనగా
పసిడి కాసె దా - జంటి రవికలు నిగనిగమనగా

కులుకుచు బెళుకుచు - కొప్పుల విరిసరు
లెలమిని గదలగ - నెంతో ముదమున ॥పెరుగూ॥ ౧

నురుగూ లుప్పొంగి - పై పై నెగయా
ఆలోని వెన్న, మెరుగూకవ్వముల - నిండా నొరయా

పొరి పొరి కవ్వం - బులు కుడి యెడమల
నరుదుగ బిర బిర - దిరుగగ మురియుచు ॥పెరుగూ॥ ౨

తరిగొండ నారా - సింహుడైనా
శ్రీ వేంకటాద్రి, వరునీ బాడుచు - భక్తితో వా.
మురువలరగ కుచ -ముల భారములకు
నరిమురి మధ్యము - లసియాడగ, తగ ॥పెరుగూ॥ 3

ద్విపద. తరుణు లీ విధమున - తమ యింట్లలోను
పెరుగు జిల్కెడివేళ - విసరుహాక్షుండు

అచ్చట నందరి - కన్ని రూపముల
హెచ్చి కన్పింపుచు - నింతుల జూచి

యెత్తు కొమ్మని చేతు - లెత్తుచు, నగుచు
నెత్తి ముద్దాడిన - హేలావతులకు

మరులు బుట్టింపుచు, - మర్మస్థలంబు
లెఱిగి యంటుచు, నేమి - [యెరుఁ] గని వాని

వలె నందు తరిగొండ - వాసుడా చెలుల
నలరించి పలికె నె - య్యమున నిట్లనుచు:

దర్వు, ఆదితాళం

మీ యింట్లా కిటు వొత్తినే! నే - మీ గుట్లన్ని జూత్తినే! ౧
నా యెరా దయవుంతారా? యిక - నన్ను మీ రెత్తుకుంతారా? ౨
బెల్లము, పండ్లు నిత్తారా? [మీ] - పెరుగంతా దాగిత్తారా? ౩
వెన్నాముద్దా లిత్తారా? నా - వేరుకలన్ని జూత్తారా? ౪
పాచాలు[1] దాగిత్తారా? మీ - పరుచూల నా కిత్తారా? ౫
తరిగొందాలో వుంతానూ: బి - ద్దాలా చానా గంతానూ ౬

క. అని ముద్దుమాట లాడుచు,
వనబో(దు)లు జూద నందు వానావింతల్

1. 'పాలు' అని యర్థము. ఈ పద మీ యర్థమున బాలకృష్ణుని పల్కులలో ఈ యక్షగానమున పెక్కుచోట్ల ప్రయోగింపబడియున్నది.

దినదినమొప్పగ జూపుచు
పనిగొన్న నొకనాడు గొల్లపడుచుల కనియెన్[1]: 71

ద్విపద. పరుచులారా! జ్ఞాన - పత్తిలి నూలి
పొరి జేసి పాలలో - బోసి, రాయపొరి -

చక్కెర[2] వేసి యి - చ్చట వందలమును
చక్కగా తరిగొంద - చామి కర్పించి

యందల మది దాగి - యానంద మెసగ
నెందెందు బోక నిం - దాత్తారుదామె?

## దర్వు, ఆదితాళం

ఆవేశ మారుదామా?[3] తల లూచుకుంతా
ఆవేశ మారుదామా? ॥పల్లవి॥

ఆవేశ మారుతావుంతే - నపురు మన కన్నులకు
శ్రీవైకుంత మెదులుగాను - చెలిగి కానవొత్తుందిప్పు
॥రావేశ మారుదామా?॥ ॥ఉ.ప.॥

మీ పెద్దవారు ధూ! మాయ - మ్మతొ పొల్లుమాతలు జెప్పి
యీ పట్ల నన్ను గొత్తించే[4]- రిందు చద్దుచేయ కిపు ॥రావేశ॥ ౧

జంతగా నందలము మూల - యింతిలో జేలి యచ్చోత
కంతకుల కెవ్వాలికి - కనుపరకుంద దాక్కోని ॥యావేశ॥ ౨

చెలగి తరిగొంద నర - చిమ్మచ్చామి పొతలన్ని
పలుమారు చొగముగాను - పొలుకుంత, నాలుకుంత ॥ఆవేశ॥ 3

---

1. 'గొల్లపడుచులకు+అనియెన్' అని విభజనము.

2. రాయపురిలో తయారగుచుండిన నాణ్యమగు చక్కెర. దీనికి నేడు 'బూరాచక్కెర' యని వ్యవహారము.

3. 'శివమెత్తి నట్లు ఒళ్లు మరచి ఆడుట' అని యర్థము.

4. 'కొట్టించేరుసుమా!' అని ముందుజాగ్రత్తతో గూడిన హెచ్చరిక.

క. అని జ్ఞానపత్రి[1]చూర్ణం
బును, శర్కర, పాలు గలిపి పూబోణులకున్
వనరుహనేత్రుడు ద్రావిం
చిన ద్రావుచు చెలులు లేచి చెలువము మీరన్. 72

వ. అప్పుడు శరీరంబులు మరచి వారు తమలో [దామి ] ట్లనుచున్నారు: 73

## దర్వు

నే నెవరే? మరి - నే నెవరే? ॥పల్లవి॥
నానా వింతలు - మానక చూచితి
నే నెవరే? మరి - నే నెవరే? ॥అ.ప.॥
వాళ్ల దెలియలే - దుండే దెచ్చటనే? ॥నే నెవరే?॥ ౧
ఆకాశంబున - కరిగేట్లున్నది ॥నే నెవరే?॥ ౨
తరిగొండ నృకే - సరివలె నైతిని ॥నే నెవరే?॥ ౩

తే. గీ. ఏమె మే [మి] ప్పు డంటి మో యింతులార?
మే మని [నదే] మి చెప్పరె మెలఁతలార?
వింటి మవియేమొ తెలియరె వెలదులార?
తెలివి యిట్టిదేమకో తెఱవలార? 74

## దర్వు, ఆదితాళం

ఇదిగోనే వైకుంఠమూ - హెచ్చిందే వైకుంఠమూ ౧
అదిగోనే కైలాసమూ - హరుడున్న నివాసమూ ౨
స్వర్గలోక మదిగోనే! - సత్యలోక మదిగోనే! ౩
వీడుగోనే! యజుఁడూ - వాఁడుగోనే! రుద్రుఁడూ ౪
తరిగొండ నృసింహుఁడూ - తాండవమాడుచున్నాఁడూ ౫

వ. అని యెగిరెగిరి గంతులు వేయుచు, వికావిక నవ్వుచు వీథి వీథి పరువులుబారుచున్నం జూచి, వికావిక నవ్వి కృష్ణుం డిట్లనుచున్నాఁడు:75

1. గంజాయి.

## దర్వు (జావిడి), ఆదితాళం

చింగు చింగూన దాటూచు - చీరాలు విరిచివేచి
బంగిబాయి తొత్తులార! - పలువెత్తాకురే! ౧
మీ పెద్దవాండ్లూ జూచితె - మిమ్ము బత్తి కొత్తుతాలు
నీ వా పెద్దవాండ్లిది వింతె - నన్నూ దిరతారూ ౨
తరిగొందా మాచామితోరె! - వురకావద్దీరాకు వొచ్చి
పరగా మూలయింతిలోనె - పాచుకుందారే![1] ౩

క. అని పడుచులఁదోడ్కొని చని
మన మలరఁగ నొక్కమూలమంది రమునఁ జే
ర్చిన, మేనులు దెలియక నం
దొనరఁగ నిర్వాణు[2] లగుచు నుర్వీస్థలిపై. 76

తే.గీ. నిదుర బోవుచునుండఁగా నీలవర్ణుఁ
డచ్చటికి వెన్నముద్దలు దెచ్చి దేహ
ములను హత్తించి, పిల్లల మొనసి చుట్టు
విడిచి, యిల్లిల్లుఁ జొరఁబడి వెన్నుఁడంత. 77

వ. దధిక్షీర నవనీతంబులు మెక్కి, కొల్లబెట్టి కుండలు బగులగొట్టి, బహువిచిత్రంబులైన దుడుకులు జేయుచున్న, గోపసతులు కృష్ణునితో నిట్లనుచున్నారు: 78

## దర్వు, ఆదితాళం

యాలా చట్లడిచితీవి గోపాలా?
శాల, గోలాతో కొట్టేమూరా గోపాలా! ౧

మాయింండ్ల కింక రాకు గోపాలా!
యిది, మీ యమ్మాతో జెప్పేమూ గోపాలా! ౨

---

1. 'పరుండుదము రండు' అని యర్థము. 'పచ్చుకొను' అను శబ్దపల్లవము దీనికి మూలము ఇది 'పడుత్తుక్కో' అను తమిళ పదమును పోలినది.

2. ఈ శబ్దమునకు 'దిగంబరులు' అను అర్థము వ్యవహారములో (చిత్తూరు మండలమున) గలదు.

తరిగొండా హరితోడే గోపాలా!
నిన్ను, తరిమి కొట్టకపోము గోపాలా! 3

వ. అని బెదిరించిన, కృష్ణుండు వారితో నిట్లనుచున్నాడు: 79

దర్వు. ఆదితాళం

మాయమ్మాతో జెప్పతారతే?
వో తొత్తులారా! మాయమ్మాతో జెప్పతారతే? ॥పల్లవి॥

మీ యిండ్లాకు నే వొత్తేను - మీ చొమ్మెంతా బోయెను?
॥ మా యమ్మాతో జెప్పతారతే?॥ ॥ఉ.ప.॥

కొత్తా వత్తా రత్తైతె మీ - గుత్తూలన్ని బైలుజేసి
రత్తూబెత్తి మీ యిండ్లాలో - రాయదొంగనై వుంతాను
॥మా యమ్మాతో॥ ౧

దెమ్మాల[1] కెల్లానూ మొదటి - దెమ్మానాని నాకు వెన్న
కొమ్మాని పెట్టక నంతా - గోరాదెమ్మాల [2] కొప్పించి
॥మా యమ్మాతో॥ ౨

తరిగొందా దెమ్మాన్నై నా నా - దాచ్చిన్యాము లేదంతారు
మెరచే మీ గోడదేవళ్ల - మీదానే వుమ్మేశిపోతా
॥మా యమ్మాతో॥ 3

ద్విపద. అని హల్లకల్లోల - మచ్చుట జేసి
పనిబూని వేల్పుల - పైనతానుమిసి,

దుడుకు లెన్నోచేసి - దుడదుడ నురికి,
తడయక కృష్ణుండు - తనతల్లి చెంత

---

1. దేవమ్మలు - దేమ్మలు - దేమ్మాలు- దెమ్మాలు - ఇది దీని రూప నిష్పత్తి క్రమము. 'దేవమ్మలు' అనగా స్త్రీ దేవతలని శబ్దార్థము. గొల్లవారు తమ యిండ్ల యందొక గోడపై గంధము, పసుపు, కుంకుమల బొట్లతో గుండ్రని దేవతాకృతులను చిత్రించుకొని యుందురు. ఆ దేవతాకృతులకు 'దేవమ్మ'లని, 'దేవు'ళ్లని, ఆ గోడకు 'దేవమ్మల గోడ' లేదా 'దేవుళ్ల గోడ' అని వ్యవహారము. 'దేవమ్మలు అనునది మహతీవాచకమేయైనను, అది సమస్త దేవతలకు సూచకముగా వాడబడుచుండును.
2. 'గోడదేవమ్మలకు' అని యర్థము.

జేరి యుండగ, గొల్ల - చెలులెల్ల గూడి
యూరకే శ్రీకృష్ణు - నుప్పతింపుచును[1]

అదర పిల్లులకు దే - హముల నొప్పించి
పడి తెల్వి లేకున్న - పడుచుల జూచి,

గొబ్బున నా పిల్లి - కున్నల దోలి
తబ్బిబ్బుపడి తట్టి - తట్టి బిడ్డలను

కుదురుగా తామెత్తి - కూర్చుండ బెట్టి
'యిది యేమి వచ్చె? మా - కెరిగింపు'డనిన

విడిబడి నవ్వుచు - వెక్కిరింపుచును
పడుచు లందరు తడ - బడి తరిగొండ

హరిని బేర్కొని యాట - లాడి సోలుచును
పరగ తల్లుల జూచి - పలికి రిట్లనుచు:

ఆ.వె. పొసగ కృష్ణు డెమొ పొడిదెచ్చి పాలలో
తాను గలిపి మాకు ద్రావ నిచ్చె;
నందుమీద మేను లెందుండు టెరుగరా
దెవరు మేము? మీర లెవ్వరమ్మ? 80

వ. అని పలికి (న) పడుచులకు బలాత్కారంబుగాచే లంబులు గట్టి, యిలువెడలనియ్యక వాకిండ్లు బిగించికట్టి తమలో దామిట్లనుచున్నారు: 81

## దర్వు (జావిడి), ఆదితాళం

చిన్నావాడనుచు ముద్దు - జేసి గోపిదేవీసుతుని
మున్నూ లాలించినది మనకు - మోసమాయెనే! ౧

వెన్నా మెక్కి, పాలు పెరుగు - పన్నూగ తాఁద్రావి, కుండ
లన్నీ పగలగొట్టె నేడా - చిన్నీ బిడ్డడే! ౨

---

1. 'ఓర్వలేనితనముచేత అడిపొసికొను' అని యర్థము. ( చూ. శ. ర. పుట.92).

యీ పడుచులాకు మందు - లేమి బెట్టి పోయినాడొ?
లేపినా బిడ్డా లిదేమె - లేవకున్నారే? 3
యిప్పుడెంతాలేదనీ [1] యీ - తప్పుగాచి యుండరాదు
తెప్పునా గోపెమ్మా కిది - జెప్పివత్తామే! ౪
తరిగొండా నారసింహుడు - తానని దేవళ్లమీద
నెరుగ కుమ్మేసుటాకు[2] స - హింతూ రటరే? ౫

## * గోపికల ఫిర్యాదు *

ద్విపద. అని గోపభామలు - నందరు బోయి
మొనసి యశోదని -మ్ముగ జూచి యనిరి:

ఈ పాప మేమమ్మ? - యింతి గోపెమ్మ!
పాపడే ననుచు నీ - బాలుని మేము

ముద్దాడుచుంటిమి - మొనసి యిన్నాళ్లు,
పద్దుతో దుడుకుల - పారంబుగాను

తొడరి చేసినను నీ - తో జెప్పలేక
నడరార[3] నెంతలే - దనుచుంటి; మిపుడు

మాకే యసాధ్యుడై - మాపాలు పెరుగు
పీకతో తాద్రావె - వెన్నంత మెక్కె,

పరగ కుండలనెల్ల - పగుల నడంచె;
సొరిదిగా మాపడు - చుల కేమొ మందు

పావనమైనట్టి - పాలలో గలిపి
త్రావించినాడట! - దానిచే వారు

సర్వంబు మరచి వ - స్త్రముల వర్జించి
నిర్వాణులై నేల - నిద్రింప జూచి

---

1. 'ఎంతో లేదు' అనగా 'ఎక్కువగా లేదు' అని యర్థము.
2. 'ఉమ్మివేయుట'కు మాండలిక రూపము.
3. 'అదరు+అరవ్' అని విభజనము. అదరు=ఒప్పు (చూ. సూ. రాం. ఆం. నిఘంటువు. ప్రథమ సంపుటము, పుట. 108).
'ఒప్పారగా' అని యర్థము.

తగ వెన్నముద్ద లం -దరి శరీరముల
బెగడు నొందక మెత్తి - పిల్లి కున్నలను

వారిమీదికి దోలి - వచ్చినా డిటకు,
మీరి పిల్లులు వారి - మేనుల నింద

తిరిగియాడుచు వెన్న - దినుచున్నగాని
యెరుగరు దేహంబు - లీ వేళకైన,

పెనుపొంద నీ బిడ్డ - బెట్టిన మందు
కనువంద విరుగుడే - మది నీవు దెల్పు!

తరిగొండ హరియైన - తనకు వెన్నంత
విరివి నియ్యక గోడ - వేల్పుల కిచట

పెనుపొంద మీర ల - ర్పించితి రనుచు
పనిబూని వేల్పుల - పైవ తా నుమిసె;

నిపుడు ప్రాయశ్చిత్త - మేమి జేయుదుము?
నిపుణతతో దెల్పు - నీవు గోపెమ్మ!

వ. అనిన విని యశోద యిట్లనుచున్నది: 82

జంపె

నాబిడ్డ డిందె యు - న్నాడు, మందులు దెచ్చి
యే బుడుత డటు వారి - కిచ్చివాడమ్మా? ౧

కడగి వేగమె యెఱ్ఱ - గడ్డల రసము, చల్ల
పడుచులకు ద్రావించి - బ్రదికించరమ్మా! ౨

పనిబూని వేల్పుల - పై నెవ్వ డుమిసెనో
మొనసి గంజరము[1] ని - మ్ముగ జల్లరమ్మా! ౩

పాల గోడలు గడిగి - సోలి గంధపు బొట్లు
పూలతో హత్తించి - పూజించరమ్మా! ౪

---

1. గోమూత్రము. ఈ యర్థమున 'గంజర' మను పదము ఈ నాడును చిత్తూరు మండలమున వ్యవహారములో నున్నది.

మీపాలు ద్రాగుటకు - మీవెన్నలను దినుట
కీ పాపనికి పుట్టు - లెట్లందునమ్మా? ౫

అలర మా తరిగొండ - హరి సాక్షిగానె మది
తెలియకను మీరుప్ప - తించవలదమ్మా! ౬

ద్విపద. అన విని కాంత లి - ట్లనిరి: గోపెమ్మ!
వినుము మాపుట్టులు - వీ డందగలడె?

యని యంటి వది నిజ - మగు గాని, వీడు

మునిముచ్చువలె వచ్చి - మొనసి చేతులకు

పుట్టు లందకయున్న - నుపమగా రోళ్ల
నుట్టుల క్రిందికి - నూకించి త్రోసి,

యా రోళ్లమీద తా - నవలీల నెక్కి,
భోరున వెన్న తి - ప్పన మెక్కి, పాలు

ద్రావి కుండలనెల్ల - ధరణిపై గొట్టు;
నా విధ మెరిగి యే - మన నోరురాక

యూరకే లాలింపు - చుంటి మిన్నాళ్లు;
నేరుపుతో వీడు - నేడు వారింటి

తలుపు మెల్లనె తీసి - తా లోని కరిగి,
వలనుగా మాచిన్న - వాండ్లకు తనకు

పుట్టి యందకయున్న - నొకగంప దెచ్చి
పుట్టిక్రింధికి ద్రోసి - యుపమగా గంప

పైన పీటలు బేర్చి - బాలుని దాని
పైనిల్పి తా వాని - పై నెక్కి, మీది

కుండలో చేబెట్ట - గూడక పాల
కుండ రంధ్రము జేసి - గునిసి వాయార

బట్టి త్రావుచు జొక్కి - పరవశత్వమున
గట్టిగా మొలనున్న - ఘంట వాయింప

గుట్టుగా పొంచి యా - కోమలి బోయి
పట్టబోయిన దాని - పై బడి దుమికి,

కట్టల్కతో పాలు - కనులలో నుమిసి
కొట్టి, గట్టిగ దాని - కుచముల వ్రచ్చి,

యిచ్చటజేరి యే - మెరుగని గతిని
ముచ్చట జేసీని - ముచ్చు చూపులను

తరిగొండహరి యింత - దంటతనంబు
నెరవాదియై చాల - నేర్చినాడమ్మ!

వ. అనిన విని యశోద గోపకాంతలతో నిట్లనుచున్నది: 83

ఆ.వె. నన్ను గన్న తండ్రి నిన్ని చందముల మీ
రుప్పతింపవలవ దుద్దవిడిని[1]
మీరు పల్కినట్టి మెండుపనుల్ సేయ
బాలు డేగునటరె? భామలార! 84

వ. అనిన విని గోపాంగన లిట్లనుచున్నారు: 85

దర్వు

బాలుడా? వీడూ బాలుడా? ॥పల్లవి॥

తేలూల గొనితెచ్చి - తెరవలా తొడలలో
నేలాగో గరిపించి - యెగురులాడించును ॥బాలుడా? ॥ఉ.ప.॥

పోడీమిగా స్త్రీలు - పురుషూలు జతగూడి
వేడూక నుండిన - వేళ నక్కడ జేరి
వాడీ జేయుచు పెద్ద - కోడే పాముల విసరి
యాడా వారల నడుమ - నవలీలగా వీచు ॥బాలుడా?॥ ౧

---

1. 'ఒక్కుమ్మడిగా' అని యర్థము.

చాలా నింద్రమహేంద్ర - జాలాములను నేర్చి
బాలామణుల నెల్ల - లాలించి రతికేళి
మేలిమిగా నల్పే - లీలాల జూపుచు
చీలల్లా![1] సిగ్గులు - జెరచుచుండును వీడు॥బాలుడా?॥ ౨

తరిగొండహరిని న - న్నెరుగరా? యని వచ్చి
త్వరగా మాయిండ్లలో - జొరబాడి, పెద్దవాం
డ్లరసి దించగలేని - బరువు కుండలు దించి
వెరువకా వెన్నంత - వేవేగ దినివచ్చు ॥బాలుడా?॥ 3

ద్విపద. మరి యదియును గాక - మా పొరుగింటి
తరుణి మజ్జిగ చిల్కు - తరి గని పోయి

వెనుక నుండగ, నది - వెన్నదీయుటకు
పనిబూని వంగగా - భళి! భళి! యనుచు

మగపోణుముల జేయ - మల్లాడి దాని
దిగువటు బడద్రోసి - తినివచ్చె వెన్న;

కామిని యదిపూర్ణ - గర్భిణి దాని
పై మించిపడి యల్ల - పనికె దా జొరగ,

'చూలాల నన్నంట - జూడకు' మనిన
'బాలుడ నేను త - త్ప ద్ధతి యెరుగ;

చూ లెట్టు లైతివి? - సూచింపు' మనుచు
ఖేలచే గరగించి - కెమ్మోవి గరచి,

మాయమాటల బలు - మచ్చిక చేసి
పోయినా డిట్టి య - ద్భుత మెందు గలదె?

తరిగొండ హరియైన - దందశూకాద్రి
వరుడు మెచ్చునె యిట్టి - వగలు చేసినను?

---

1. ఇది ఏవగింతను సూచించెడి ధ్వన్యమకరణశబ్దము.

(వ. అనిన విని యశోద వారితో నిట్లనుచున్నది:) 86

ఆ.వె. ఇంతులార! కృష్ణు నీ రీతి నిందించి
పలుకదగునె మీకు భయములేక?
ఆటలాడు బుడుత డటకు వచ్చిన, వాని
తప్పుగాచి మీరు తాళుకోరె! 87

(వ. అనగా విని గోపిక లిట్లు పల్కుచున్నారు:) 88

దర్వు, రేగుప్తిరాగం

తరుణిరో! మే మెట్ల - తాళదుమమ్మా?
యెట్లు తాదుమమ్మా?
తామరసాక్షున కిది - తగునటే వోయమ్మా? ॥పల్లవి॥

మురియుచు మురియుచు వచ్చి - మోహాంధకారమున హెచ్చి
పరగా మాగుట్లన్ని కృష్ణుడు-బట్టబయలుగా జేసివచ్చె
॥తరుణిరో! ॥ఉ.ప॥

సుదతిరో! చిన్నావాండ్ల - చూచినామమ్మా!
మేము చూచినామమ్మా!
యిదిగో! యింతా పుత్రాతుని - యెందూ గానమమ్మా?
మదమత్తుడై వీడు నేడు - మంద కరిగీన వాజోడు
ముదిత నేలినాడే! - ముచ్చువాడే! మోసకాడే! ॥తరుణిరో!॥ ౧

మనువు బొయ్యేడి చిన్ని - మగువాల సాక్కించి
మనసిజాని కేళి దేల్చి - మర్మాము భేదించి
వెనకసారి యాచందము, జనులు - వినవీన చాటించి
మనువు జెరిచినాడే! - మహిమవాడే! మచ్చరీడే! ॥తరుణిరో!॥ ౨

నలినాక్షి! తరిగొండ - నారసింహుడైతే
కొలువుండి మాచే మ్రొక్కించు - కోవాలె దొరైతే
తులువాతనమున నింత - దొమ్మి జేసితే మా కెంత
యెలమి గలుగునమ్మా? - యేమె కొమ్మా? యెట్ల నమ్మా?॥తరుణిరో!॥ 3

ఆ.వె. గంప బోర్లవేసి, ఘనపీఠములు పైన
బర్చి,[1] దానిమీద పిన్నవాని
నిలిపి, వానిమీద నెరి నెక్కి యుట్లంది
పాలుద్రావు వీడు బాలుడటవె?. 89

వ. అనిన విని యశోద నవ్వి కృష్ణునితో నిట్లనుచున్నది: 90

జంపె*

వంచించి సన్నలమ - రించి బుడుతనిమీద
మించి యెక్కినది నిజ - మేనటర కృష్ణా? ౧

వీలందలును వొత్తి - పోలు బుత్తించి యిపు
రూలికె జెప్పచు - న్నాలు గోపెమ్మా! ౨

దాని పాలే త్రావి - దాని కన్నులనిండ
పూని యుమిసినది నిజ - మేనటర కృష్ణా? ౩

సలవితో తలిగొంద - చామితోరే! వీలు
పలగ జెప్పినవి ద -బ్బలవె గోపెమ్మా! ౪

వ. అని పలికిన బుడుత నెత్తి ముద్దాడి, యశోద గోపికలతో నిట్లనుచున్నది: 91

ఆ.వె. నవ్వు లంతెగాని నాబొజ్జకందవా
డిన్నిపనులు జేయ నెరుగునటరె?
మీర లుప్పతించ కూరకె, నాబిడ్డ
తప్పులన్నిగాచి తాళుకోరె! 92

(వ. అనిన విని గోపవనితలు యశోదతో నిట్లనుచున్నారు:) 93

---

1. బెట్టి - అని యుండిన యతిభంగము కాకుండెడిది.
* ఇందు యశోదాకృష్ణుల సంవాదము కలదు.

## దర్బ్యు, కేదారగౌళరాగం

ఎట్లు తాళుదుమో యమ్మా? యశోదమ్మ!
(మే), మెట్ల తాళుదుమో యమ్మా? ॥పల్లవి॥

యెట్లు తాళుదుమమ్మ? మ - మ్మేమేమొ జేసి యీ
పట్ల గోపాలుడు - బలుదుండగీడయితే ॥ఎట్ల॥ఉ.ప.॥

జలక మాడుచు నొక్క - జవరా లుండుట జూచి
చలమూన నచటికి - జని, గునియుచు దాని

విలసితాకృతి మెచ్చెనే! నా భార్య వీ - వే నని వాక్రుచ్చెనే! మెల్లగా దాని కలసే పనికి జొచ్చెనే! అది కోపింప - గా కుచముల వ్రచ్చెనే! యశోద! ॥ఎట్ల॥౧

అట్లాడవచ్చి మా - వుట్లపై కెగబ్రాకి
చట్లలోపలి వెన్న - సంతోషమున మెక్కి

చట్లంద పడవేసెనే! మా పడుచూల-జతగూడే నని డాసెనే వూరకేవారిగుట్లు బయలుజేసెనే! యిదే మంటె-కొట్లాటలకు దీసెనే! యశోద! ॥ఎట్ల॥౨

తరిగొండ నరహరి - తను జూడగా నూరి
తరుణూల బట్టుట -తగదింక నిచ్చోట
దొరయై [యుండమన ] వమ్మా! యిప్పుడు జేసే - దుడుకులు సరిపోవమ్మా! నీ కొడుకుకు
వరబుద్ధి నేర్పవమ్మా! మతో నీవు - వాదింపవలదమ్మా! యశోద! ॥ఎట్ల॥3

ద్విపద.ఎలనాగ వినవమ్మ! - యిది యొక వింత
తలకొన్న వేడ్కతో - దంపతుల్ గూడి

నిదురింపుచుండగా - నిన్నటి రాత్రి
పదరుచు దొడ్డిలో - పసుల నన్నిటిని

పైరులపై దోలి - పసు లార్భటింప
వారించుటకు మగ -వాడందుజనగ,

తానింటిలో జేరి - తత్ప్రతిరీతి
మీనాంకకేళి కా - మినితోడ బెనగి

యిల్లు వెల్వడ, నాల - నెల్ల మరల్చి
వల్లభు డచటికి - వచ్చిన, దాను

వానికి గనుపడి - వంచించి యురికె;
నానాతి జారిణి - యని వాడు

వరతరిగొండ ని - వాసు డిట్టైన
నిరవుగా నిచట మే - మెట్లోర్తుమమ్మ?

వ. అనిన విని యశోద కృష్ణునితో నిట్లనుచున్నది: 94

## దరువు* ఆదితాళం

ఆ యింటికి చీకటిలో నీ వెటు - పోయినావురా కృష్ణా?
నీ, వెటు పోయినావురా కృష్ణా? ౧

వోయబ్బా! చీకటిలో నే - బోవుదునతవే గోపెమ్మా?
నే, బోవుదునతవే గోపెమ్మా? ౨

ఆ యింటిల్లాలిని గూడితివట! - యది యేమిర శ్రీ కృష్ణా?
మరి, యది యేమిర శ్రీ కృష్ణా? 3

ఆ యింతిల్లాలిని గూరుతు పే[1] - రది యెత్తనె గోపెమ్మా?
మరి, యది యెత్తనెగోపెమ్మ ౪

మేలిమి పైరులపై పారుగావుల - తోలితివటరా కృష్ణా?
నీవు, తోలితివటరా కృష్ణా? ౫

వోలల్లా! తరిగొండ చామితో - రుత్తమాత గోపెమ్మా!
యిది, వుత్తమాత గోపెమ్మా! ౬

---

* ఇది సంవాద దరువు. యశోదాకృష్ణుల సంవాద మిందు కూర్పబడినది.
1. 'కూరుచు పేరు'నకు వ్యావహారిక రూపము. 'కూర్చెడు దండ' అని యర్థము.

వ. అనిన విని యశోద గోపికలతో నిట్లనుచున్నది: 95

ద్విపద. ఓ యమ్మలార! యీ - వృత్త నిందలను
నాయన్న పై గట్ట - నాయంబుగాదు,

నెలవుగా మాట్లాడ - నేరని బిడ్డ
బలవంతుడై యింత - పని జేయగలడె?

పోరి చీకటిని జూచి - బూచని చాల
వెరచు నా బిడ్డడు - వింతగా రాత్రి

సమయమం దచటికే - చందాన వచ్చు?
భ్రమయక పశువుల - బట్టి తానెట్ల

పలుపుల వదిలించి - పై రులమీద
నులుకక నెటుదోలు - నుత్సాహ మెసగ?

నా యింటి మగవాని - నవల బోనిచ్చి
యా యింటి యిల్లాలి - నపుడెట్ల గూడు?

నిట్టి ముద్దుల పాప - డెందైన నతుల
బట్ట నేర్చునె? వట్టి - పాపంబు గాక,

జవ్వనులార! మీ - నోటమాట[1] విన్న
నవ్వడె తరిగొండ - నరమృగేశ్వరుడు?

పోరి మమ్మారడి - బొందింప వలదు
పోరె మీ యిండ్లకు - పూబోణులార!

(వ. అనిన విని గోపకాంత లిట్లనుచున్నారు:) 96

తే.గీ. అమ్మ గోపెమ్మ! మామాటలన్ని నీవు
కల్లలంటివి; మంచిదిగాని, మేము
పోయెదము; నీవు కొడుకును మాయెడలకు
పరువు బారుచు రానీక[2] భద్రమింక 97

1. కపటపు మాట. ( చూ. శ. ర. పుట. 772).
2. 'రానీకు' - అనుటకు వ్యావహారిక రూపము.

వ. అని పలికి గోపకాంతలు తమ యిండ్లకు జేరి; రంత కృష్ణుండు యశోద చెంత వుండినట్టె వుంది గోపకాంతల యిండ్లకు బోయి అనేకంబు లైన దుడుకులు జేసి, తనయీడు గోపకన్యలతో నిట్లనుచున్నాడు: 98

## దర్వు, అటతాళం

చిత్తబత్తికాయ - చేతూల నారుచు
నాత్తారుదామె - అబ్బాచ్చులారా![1] ౧

కూచుంది గురుగూరు - గుంతమారుచు, తల
లూచుదామా - వో చెలులారా! ౨

పత్తూగ తరిగొంద - పతి జూర మీ రొమ్ము
లొత్తూదునా - వో చేరెలారా! 3

ద్విపద. పెద్దవాం దొత్తారు -పెరతింతిలోను
చద్దు జాయక మూల - జతగూరుకోని

అరుమొగుందాత - లాత్తారుదామ?
మీరు నా పెందాలు - మీ కల్ల పనుల

నేరుపుచుంతాను - నే మీ మగరను
తరిగొందహరితోరె! - దాగిపోవద్దు
పెరిమెతో మిము ముద్దు - బెతుకుంతానె.

## దర్వు, అటతాళం

పరుచులారా! రారె - పండ్లు [ గోయు ] దామూ ౧

యిక్కరక్కర బొమ్మ - రిందు గరదామూ ౨

ము ద్దూగ చంచార - ములను జేతామూ 3

తరుఛుగ ముద్దుబి - ద్దలను గందామూ ౪

తరిగొందహరి పేరు - తగ బెత్తుదామూ ౫

---

1. 'అబ్బాక్షులారా!' - అను సంబోధనకు బాలభాష.

ద్విపద. అని చిన్నికన్నెల - నాదరింపుచును
మనసిజ కేళి స - మ్మతిని దేల్చుచును,

పనిఖూని యువతుల - బట్టి నవ్వుచును,
చెనకి గారదములు[1] - జేపి చొక్కుచును,

ఒక యింటిలో నాడి - యొక యింట బాడి,
యొక యింటిలో నవ్వి - యొక యింట దిట్టి,

యొక యింట మృగఘోష - మొనరింపుచుండి,
యొక యింట పక్షి పుం - జోక్తుల దనరి,

పాలెల్ల చిల్లాడి[2]- భామల గూడి,
చేలంబులను జించి - చెలరేగి మించి,

వెన్నముద్దలు మెక్కి - వేడ్కతో జొక్కి,
పన్నుగా చట్లన్ని - పగుల నడంచి,

లోగక హల్ల క - లోలంబు జేసి,
యా గొల్ల గరితల - యందొక్కదాని

బట్టిన నది భయం - పడి తన యత్త
నట్టిట్టు జునుగుచు - నపు డిట్లు బిలిచె:

## దర్వు, పంతువరాళి రాగం, అటతాళం

ఓ యత్తా రావమ్మా! వోహెూ - హెూ యత్తా రావమ్మా! ॥పల్లవి॥

వో యత్త రావమ్మా! - మాయగా నిచటికి
తోయజాక్షుడు వచ్చె - దొంగతనము సేయ ॥నో యత్తా॥ ఉ.ప.॥

ముద్దియ్యమని వచ్చి - మో మెల్ల గరచూచు
హద్దు తప్పి కళ - లంటూచు నిందున్నా ॥దో యత్తా॥౧

1. ఇది 'గారుడ' శబ్దము యొక్క వికృతి. 'మాయ, కపటము' - అను అర్థములలో నిది రూఢి గాంచియున్నది. 'గారడి' యను పదము దీనినుండి యేర్పడినదే.
2. చిల్లు+అడి=చిల్లుమని ధ్వనియగునటుల కలచివేసి-అని యర్థము.

నీతీ విడిచి పెద్ద - భూతామువలె రెండు
చేతూలతో నన్ను - చిక్కించుకొనివున్నా ॥ఓ యత్తా॥ ౨

వరతారిగొండ ని - వానూడు నా సిగ్గు
మురియూచు చెరచాక - ముందె నీ విచటికి ॥ఓ యత్తా॥ ౩

## * గొల్ల ముసలిది *

ద్విపద. అనుచు కోడలు బిల్వ - నా యత్త వేగ
విని, తెల్లనగు చిర్ర - వెంద్రుకల్[1] గదల,

తోలు తిత్తులరీతి - తొడరి పాలిండు
తూలియాడగ, నోట - తుప్పరల్ గురియు

తల వణకింపుచు - తబ్బిబ్బు పడుచు,
నులుకుచు, తనకోడ - లున్న చోటికిని

'తరిగొండ నరహరి - దాక్షిణ్యమేమి?
తరిమికొట్టెద' నంచు - దిలచి తా వచ్చె.

## దర్వు (జావిడి)

ముసిలిది వచ్చెనూ; గొల్ల - ముసిలిది వచ్చెనూ ॥పల్లవి॥

కసరుగొట్టూతనముతోను - విసరాలాడుచు[2] వేవేగ
॥ముసిలిది వచ్చెనూ॥ ॥ఉ.ప.॥

కోడల! యిచ్చోటి కె - వ్వాడు వచ్చి నీ సిగ్గెల్ల
నేడు బయలు జేసె? నది - నిజముగ జెప్పుమనుచు ॥ముసిలిది॥ ౧

గడగడ వణకుచు, నూత - కట్టె చేతబట్టుకొని
పాడిదగ్గు దగ్గూచు, పెద్ద - పొట్టల్లాడించూకుంటాను[3] ॥ముసిలిది॥ ౨

---

1. చింపిరి వెంద్రుకలు. (చూ. శ. ర. పుట. 269).
2. 'కోపమును, విసుగును సూచించు మాట లాడుచు' - అని తాత్పర్యము.
3. 'పొట్టల్లాడించు కొనుచును' - అను శత్రుర్థకమునకు వ్యావహారిక రూపము.

తరిగొండావాసూడు శేష - గిరివాసూడు వచ్చెనంటి
విరవూగ వా డిందెందున్నా? - దేది? యేది? చూపుమని ॥ముసలిది॥ 3

## ఏలలు*

గోపాలుడూ వచ్చెననుచూ - వాపోయి పిల్చితివీ నన్నూ
చూపావే వాడిందెందున్నాడో? వోహెూ కోడాలా!
-చులుకు[1] తీసి లెస్సా కొట్టేనూ. ౧

నీ ముందరానే వున్నాడూ - నిను వెక్కిరింపూచున్నాడూ
యేమి నన్నూ జూపామనేవూ ? వో యత్తాగారూ!
యెదిగి పట్టి కొట్టుమూ నీవూ ౨

నా చెంతానె యున్నాడాని - యనుచు జెప్పే వంతెగానీ
చూచితే వా డిందెందూ లేదే! వోహెూ కోడాలా!
- సుళ్లుమాట లనెదే జాణే! 3

తరిగొండావాసూడూ శేషా - గిరివాసూడై నవ్వుచూ, నీ
కురులు బట్టీ వంచూచున్నాడే! వో యత్తాగారూ!
- కొట్టు కొట్టు కొట్టూ మిప్పుడూ. ౪

(వ. అనిన గొల్ల ముసలిది కోడలితో నిట్లనుచున్నది:) 99

ఆ.వె. గోపబాలు నిచట కొట్టుమంటివి; వాడు
కానుపించలేదు గాని, నీవు
పెరుగు జిలుకుచుండు; మరల వా డిచటికి
వచ్చినపుడు జెప్పు వారిజాక్షి! 100

వ. అనిన విని కోడలు అత్తతో నిట్లనుచున్నది. 101

---

* గోకులమున ఒకానొక్తఅత్తకు, కోడలికి జరిగిన సంభాషణ ఇందు కలదు.

1.'చురుకు' యొుక్క రూపాంతరము. 'చురుకు ముట్టించెడు బెత్తమువంటి సాధన'మనిభావము.

క. నీ వీ వాకిటి ముందర
కావలిగా నుండు; వాడు క్రమ్మర వచ్చున్
వేవేగ బట్టి కొట్టుచు
నావల బోదరుముచుండు మత్తమగారూ! 102

వ. అని పలికి, యత్తను వాకిట కావలిగా నుంచి, గోపకాంత పెరుగు జిలుకుచు, తన తోడ చిలుకుచున్న చెలులతో నిట్లనుచున్నది: 103

## దర్వు

పెరుగూ బిరబిరా జిలుకారమ్మ వోయమ్మాలారా! ॥పల్లవి॥
అరమరలే కిపు డరిమురి కవ్వము
లురువడి మరిమరి - గిరిగిరి[1] దిరుగగ ॥పెరుగూ॥ ఉ.ప.॥

కలకంఠులారా! గోపాలుడూ, నే తొలుతా పెరుగు
చిలుకా సన్నాహమైనప్పుడూ, తా నిచ్చోటికి
మొలకానవ్వూతో వచ్చినాడూ; పాలిండ్లు బట్టి
యలకావ ద్దిందు నన్నూ గూడు
కులుకులాడి! యని పలుకుచు నన్నిపు
డళికించినవా డావల నుండగ ॥పెరుగూ॥ ౧

సందూగొందూల డాగినాడూ; వచ్చితే వెనుక
ముందూ పనులూ చేయనీడూ; వాడేమొకాని
మందూ మంత్రములు నేర్చినాడూ; వాని జూచితె
పొందూ కోర్కె బుట్టూ నెప్పుడు
సుందరమందల కందర్పుడు[2] వా
డిందు రాకముం దందరు గుములుగ ॥పెరుగూ॥ ౨

---

1. ఈ శబ్దము 'గిరిగిరిగోలు' అనుదానిలోని 'గిరిగిరి' వంటిది. 'గిరిగిర' - అని యర్థము.
2. 'మందరతకు మేర యగు మన్మథుడు' అని యర్థము.
(మందల=మేర, చూ.శ.ర.పుట. 595).

తరిగొండ నారాసింహరాడైనా శేషాద్రివిభుడిం
దరి మానమూల వెట్లవైనా దక్కించితేవే
సరిగాని, లేకయుంటె శానా మోసాము వచ్చు
నరవిందాక్షుల కట్లగావా
పరువిడి కృష్ణుం డురువడి నిచటికి
చొరబడి వచ్చిన తరుముద మావల ॥పెరుగూ॥ 3

ద్విపద. అనుచు నొండొరుల నం - దవసరింపుచును
గొనకొని పెరుగు జి - ల్కుచు నున్నవేళ

వచ్చి గోపాలుండు - వాకిట చెంత
నచ్చుగా కాపున్న - యా ముసిల్దాన్ని

వెక్కిరింపుచు, తల - వెంద్రుకల్ బట్టి
తక్కక నీడ్చుచు - దాని కన్నులకు

కనుపడకుండ లో-గా (ప్ర)వేశించి,
తనుమధ్యలను బట్టి - తగ గుట్లు చెరిచి,

పెరుగు పాల్ చిల్లాడి - బెదరించి, చాల
మురిసి గ్రక్కున వెన్న - ముద్దలు మెక్కి,

యంతట [తరిగొండ] - హరి గోపిదేవి
చెంత ముద్దులు జూపి - చిరుత చందమున

నాట్లాడుచుండగా, - నా గోపసతులు
కొట్లాడ నత్తను - కోరి దోడుకొని

పోయి, నందుని గృహం - బును బ్రవేశించి
యాయశోదను బిల్చి - యంద రిట్లనిరి:

## * గోపికల ఫిర్యాదు *
## దర్వు అటతాళం

పొలతి! కృష్ణుని వలన[1] - పాయ్యోదమమ్మా! ॥పల్లవి॥
యెలనాగ! నిను జూచి - యెందు పోజాలక
యిన్నాళ్లు తాళితి - మిక తాళమమ్మా ॥పొలతి!॥ ఉ.ప.॥

పండ్లు గొనే చిన్న - వాండ్లను బెదరించి
పండ్లన్ని మెక్కి, మా - యిండ్లలో జొచ్చి, జవ
రాండ్లను జూచి తా - పెండ్లాడే ననగ, పూ
బోండ్లు దిట్టితే పుట్ట - చెండ్లను, గజనిమ్మ
పండ్లను, బంగారు - గిండ్లను వాండ్ల పా
లిండ్ల పై కేసి, సా - క్కించె గదమ్మా! ॥పొలతి!॥ ౧

కొట్లాడు కొనుచు మా - తోట్లలో జొరబడి, పొన్న
చెట్లెక్కి పూల్గోసి - పొట్లాలుగా దెచ్చి
యాట్లాడే చినచిన్న - బొట్ల[2]వళ్లలో నించి
నోట్లోనే విడెమిచ్చి - రెట్లు బట్టుక మేలు
కట్ల మేడ జేరి - యెట్లనో జేసింత
గుట్లు జెరిచె నిం - కెట్లానో యమ్మా! ॥పొలతి!॥ ౨

*బాలునివలె వచ్చి - స్త్రీలను జూచి, కు
చాలమీదను పెద్ద - తేలుల బడవైచి
చాలగ గరిపింప, - నోలల్లా! యని వార
లాలో భీతిల, తాను - మేలు మంత్రజ్ఞుడై
తేలుమంత్రములు మం - త్రించె గదమ్మా! ॥పొలతి!॥ 3

---

1. కృష్ణుని ఉద్దేశించిన (కృష్ణుడు కారణమైన) వలన
2. బొట్టెలు= చిన్న పిల్లలు.
* తక్కిన చరణము లన్నిటిలో ఆరేసి పాదము లుండగా ఈ మూడవ చరణమున మాత్రము ఐదు. పాదములే యున్నవి. ప్రతిలేఖకుడు ఏమరుపాటున నొకపాదమును వ్రాయక విడిచి యుండును.

దిట్టడై వచ్చి మా - పుట్టి పై పాలన్ని
పొట్టనిండా ద్రావి - చట్టి పడవైచితే
కొట్టెద ననుచు మా - కోడ లప్పుడు తన
జుట్టుపట్టీడ్చితే - నట్టే యప్పుడె దాని
పట్టుగా కౌగిట - గట్టిగా బిగబట్టి
వొట్టి గాబరజేసి - వురికె గదమ్మా! ॥పాలతి!॥ ४

చుక్కలరాయని - టెక్కున మాయింటి
కొక్కడే వచ్చితే - చక్కని బిడ్డాని[1]
యెక్కువగాను నే - నక్కున జేర్చితే
చక్కెరకెమ్మోవి - నొక్కి తేలింపుచు
నెక్కడెక్కడనొ బల్ - చక్కిలింతలు జేసి
చిక్కించుకొని చాల - సొక్కించెనమ్మా! ॥పాలతి!॥ ५

అండబాయక తరి - గొండలో నెలకోని
దండిగ నంతట - నిండియున్నా డఖి
లాండకోటి బ్ర - హ్మాండ నాయకుడాని
పండితు లెన్నుచు - నుండగా నితడింత
మెండుగ మాయిండ్ల - దుండగములు జేసి
దిండీడై[2]విహరించే - తీరేమో యమ్మా? ॥పాలతి!॥ ६

ద్విపద. మానినీ! యివిగాక - మరియొక వింత
నేను జెప్పెద విను: - నిన్నటి దినము

మిక్కిలి నొకరింట - మీగడ తాను
మెక్కి, కోడలిమూతి - మీదట కొంత

మెత్తి తా నరుగగా, - మీగడ లేక
అత్త కోడలి జూచి - యాగ్రహింపుచును

1. 'బిడ్డ+అని' - ఇది వ్యవహారిక భాషయందలి సంధి రూపము.
2. 'దిండు + ఈడు' = కాసె కట్టినవాడు (చూ. శ. ర. పుటజ 389). జెట్టివలె పన్నద్ధుడైనవాడని భావము.

తత్తరింపుచు మహా - దండంబు బూని
మొత్తి 'మీగడ కిదె - ముచ్చురా!' యనుచు.

వీరింటి బానల - వెన్న తా మెక్కి
వారింట నా ఘటా - వళులన్ని బెట్టి

చనగ, నంతట వీరు - జాడ బట్టుకొని,
పెనగొని సిగపట్ల - బేరంబుగాను
వారు వీరును పెద్ద - వాదాడ, నందు
జేరి ధర్మంబులు - జెప్పె నీసుతుడు.

సుతులు లేరని యొక్క - సుదతి చింతింప
'మతిశాలివై నన్ను - మగనిగా గొనిన

సుతుని బుట్టించెద - సుందరీ!' యనుచు
హితము జేయదలంచె - నిది యెందు గలదు?

వెర్గైనదిప్పు డు - ర్వని తరిగొండ
పురనాయకుం డెంత - పోకిళ్లమారె!

(వ. అనిన విని యశోద గోపికలతో నిట్లు పల్కుచున్నది:) 104

### * దర్వు (జావిడి), మధ్యమావతి రాగం *

నా బిడ్డా నెందు కిట్లనేరే? వోయమ్మలారా!
నా బిడ్డా నెందు కిట్లనేరే? ॥పల్లవి॥

శాబా సట్టైతే బాగైనది యీ బాలుడు మీ
యిండ్లకు వచ్చున? ॥నా బిడ్డ నెందు కిట్ల నేరే? ॥ ఉ.ప.॥
తొట్లాలో పవ్వళించేవాడూ; నా తోవైనాను

మాట్లాడగానైతేనే రాడూ; మీ యిండ్లలోని
కెట్లా చొరవగ వచ్చినాడూ? బళువైన వెన్న

చట్లా నేరీతి దించు వీడూ?
గుట్టెల్లను బలురట్లా[1]టెరుగక
మట్లుమీరి నగుబాట్లకు వెరువక ॥నా బిడ్డ॥ ౧

యిదివరకు దొగ్గాడినాడూ; మూత్నెల్లనాడూ
ముదముతో లేచి నిలిచినాడూ; తప్పడుగే గాని
పదిలాముగానూ నడవాలేడూ; బలభద్రుతో మా
సదనాములో నాట్లాడు వీడూ
తుదమొద లెరుగక పదరుచు నందరు
మది జెడి పలుమరు కొదవల నెన్నుచు ॥నా బిడ్డ॥ ౨

మెల్లా లాలించి, మంచి చల్లా ద్రావింపబోతే
వొల్లాక కనుమూసు; నా పై నెల్లా యిట్లావాడు మీ
చల్లా పాలును నెయ్యి కొల్లాబెట్టూనేమమ్మా?
జెల్లా! మీమాట లెంత కల్లా?
యిల్లాండ్లను భయమెల్ల విడిచి బలు
పొలుమాట లనజెల్లదు సారెకు ॥నా

కోరీ యాట్లాడియాడి సొలసూ; ముకురము చెంత
జేరీ తన నీడ జూచే జడుసూ; నాబాలుడు మీ
నారీమణుల నెట్లాగలసూ? అద్భుతమేకాని
మారూకే శెట్లా వీనికి దెలుసూ?
కూరిమి దలచక నారడిజేయుచు
దూరకురే! మీ పో రిక జాలును ॥నా బిడ్డా ॥ ౪

తరిగొండహరిపై నెనరూ లేదా? యిటువంటి ముద్దు
తనయూల గన్నారు లేదా[2]? మీ బిడ్డలవలెనే
పరబిడ్డలను జూడరాదా? తెల్లావారేది

---

1. రట్ల + ఆట = రట్లాట. ఇది 'కొట్లాట' వంటిది. రట్టు = నింద ( చూ. శ. ర. పుట. 660). 'నిందలపాలగుట' యని తాత్పర్యము.
2. 'కన్నారా, లేదా?' - అని భావము. 'చూచినావు లేదా?' 'చెప్పినాను లేదా?', 'ఉన్నారు లేదా?'- మున్నగు ఇట్టి వాక్యప్రయోగములు తరిగొండప్రాంతమున నేటికిని నిత్యవ్యవహారమున నిలిచియున్నవి.

త్వరగా నాతో మీకింత వాదా?
నరిసరి యందరు నరిమురి బాలుని
మరిమరి దూరుట[1]మర్యాదగునా? ॥నా బిడ్డ॥ ౫

(వ. అనిన విని గోపికలు యశోదతో నిట్లనుచున్నారు:) 105

## దర్వు, రేగుప్తిరాగం, మట్టితాళం

చిన్ని గోపాలు డేమెరుగ డుంటేను - చెలియ మే మేమందుమే? ॥పల్లవి॥

ఎన్నాళ్లోర్తుము! గన్నాతల్లి? మీ - చిన్నావాడు మా
వెన్నాకుండలు - భిన్నములు జేసే మొన్నా
పన్నూగా బెదరించి - పట్టు దామని యంటె
యెన్నెన్నో వన్నెలన్ను, వింతా చిన్నె - లరుదుగా బన్నె ॥చిన్ని గోపాలు॥ ౧

కచ్చా[2]లాడుచు వచ్చా; మాయిండ్లు - జొచ్చా; కానుకలు
దెచ్చా; కన్యల కిచ్చా- ఘనముగా మెచ్చా
పచ్చవిల్తుని కేళి - పణతుల దేల్చా
దనుజుల గెల్చా - తానింత ఫెచ్చా ॥చిన్ని గోపాలు॥ ౨

బాలామణులైన స్త్రీలా జూచి, కు - చాలా మర్దించి
లీలా బెంచి వి - శాలాముదమొం దీ వేళా
యేలా గోపాలకు - డిండ్లిండ్లు జొరబాడి
పాలూ వెన్నెల - పూలవర్షాలా చిల్లాడె చాలా? ॥చిన్ని గోపాలు॥ ౩

ఆడావారుండె జాడా కని తాను - జూడావలెనని
మేడాపై కెక్కి జాడా పూల్ జుట్టి - మాడా లొసగూచు, క్రీడ
వేడూక మీరగా - వింతవింతగ సల్పి
వాడొకమేడా - వనితలతోడా దిగె మేము జూడా ॥చిన్ని గోపాలు॥ ౪

---

1. 'నిందించుట' అని యర్థము.
2. కలహములు (కలహపు మాటలు).

పట్లా చినవాండ్ల జుట్లా ముడివేసి - మొట్లా మొట్టుచు
కొట్లా కొట్లుచు - వాట్లా[1] వాడుచు, నుట్లా
యెట్లెట్లనో యెక్కి - యింపుతో వెయి దాగి
యట్లనె చట్లా - నందుంచి గుట్లా కనివచ్చె నిట్లా ॥చిన్ని గోపాలు॥ ౫

అమ్మా! వినవే గో - పెమ్మా! నీ కొడు
కమ్మా! బహుదుడు - కమ్మా! మమ్మనకవమ్మా!
యిమ్మహిలోపల నిటువంటి బాలకు డెందులే
డమ్మా! యిత డొకరి - సొమ్మా? మాయకాడమ్మా! ॥చిన్ని గోపాలు॥ ౬

పుండరీకాక్షు డండాయై, తరి - గొండా పాలింపు
చుండాడని జనులు - నిండా పొగడుచునుండా
దుండగిడైనాడు - తొలగకాజాండ
తతులు పిండాండములు - (తన) కుక్షినుండ ॥చిన్ని గోపాలు॥ ౭

ద్విపద. ఏమమ్మ గోపెమ్మ! - యీ చిన్నిబిడ్డ
దేమెరుగ డటంచు - నివుడు బల్కితివి,

ఎరుగనివాడైన - నింటింట వెన్న
తిరముగా మ్రుచ్చిలి - తిన నెట్ల వేర్చె?

పాలు ద్రావుచు - చట్ల పగులగొట్టుచును
చేలముల్ జించుచు - చెలగి దొంతులను

పడద్రోసి నవ్వుచు - బాలామణులను
విడిబడి కూడుచు - వింతగా నుట్ల

పై కెగబ్రాకుచు - పల్మారు పెరుగు
జోకగా ద్రావుచు - జొచ్చి మాయిండ్ల

ధనము పోజల్లుచు - 'తరిగొండవాను
డను వాడు వేవె; వా - కమ్యడె?' యమచు

1. ఆటలు

నిన్ని మాయలు బన్ను - టేరీతి నేర్చె?
పన్నుగా గన వీడు - బాలుడేమమ్మ?

(వ. అనిన విని యశోద శ్రీకృష్ణునితో నిట్లనుచున్నది:) 106

## దర్వు* (జావిడి)

వీరి మాటలన్ని దెలియ - వింటివటరా కృష్ణా?
నీవు, వింటివటరా కృష్ణా?
వారి నోత నబద్ధాలు - వత్తావె గోపెమ్మా! ౧

చెలగీ వారి వెన్నాలూ ము - చ్చిలితివటరా కృష్ణా?
(నీవు,) ముచ్చిలాతివటరా కృష్ణా?
యల వెన్నా మన యింతిలో లే - దంతావే గోపెమ్మా? ౨

వెలలేని పాలెత్తుకొని ద్రా - వితివటరా కృష్ణా?
నీవు, త్రావితివటరా కృష్ణా?
యలరాగ నా కరువంతా గొ - ప్పంతావే గోపెమ్మా? ౩

తులువాయై దొంతూలు పడ - ద్రోసితివటరా కృష్ణా?
(నీవు,) పడద్రోసివటరా కృష్ణా?
యల దొంతూలూ దోచే బలముం - దంతావే గోపెమ్మా? ౪

చేరి వారీ చీరలు నీవు - చించితివటరా కృష్ణా?
నీవు, చించితివటరా కృష్ణా?
వూరికే జెప్పే రీ మాత - లూలక్కే గోపెమ్మా! ౫

గెంటాకా వారి వుట్లా - కెక్కితివటరా కృష్ణా?
(నీవు,) యెక్కితివటరా కృష్ణా?
యంటే వుత్తూలూ నా - కందునంతావే గోపెమ్మా? ౬

* యశోదాకృష్ణుల సంవాదమును వివరించు దరువులలో ఇది యొకటి.

భామాలా తేలించి నీవే - పట్టితివటరా కృష్ణా?
నీవు, పట్టితవటరా కృష్ణా?
భామాలా పత్తేతందుకు - పని యేమే గోపెమ్మా? ౭

ధనమూ వెదచల్లినది - తథ్యమేనటరా కృష్ణా?
అది, తథ్యమేనటరా కృష్ణా?
ధనమున్నా చోతూ నాకెలుగా - తరమంతే గోపెమ్మా? ౮

తరిగొండాహరీతోడూ నీ వే - మెరుగావటరా కృష్ణా?
నీ, వే మెరుగావటరా కృష్ణా?
తరిగొండాహరీతోడె! నే వే - మెరుగానే గోపెమ్మా! ౯

ద్విపద. అనుచు బల్కిన సుతు - నాదరింపుచును
దనర నా గోపసుం - దరుల నీక్షించి

ఆ యశోదాదేవి - యప్పు డిట్లనియె:
*నాయమ్మలార! మీ - రూరకె లేని

పోని మాటలు దెచ్చి - బుడుతని మీద
నానావిధంబుల - నాతోను చాడి

జెప్పటె కాని, నా - చిన్నారి కంద [1]
డిప్పు డా పనుల తా - నెటు జేయగలడు?

తరిగొండహరితోడె! - దాక్షిణ్యముంచి
యరసి నా బిడ్డ నే - మనవద్దు పోరె!

(వ. అనిన విని గోపసుందరులు యశోదతో నిట్లు పల్కుచున్నారు:) 107

ఆ.వె. గోపిదేవి! నీవు కొడుకు జేసిన తప్పు
లెరుగలేవు, మమ్ము నిట్లనేవు;

---

* 'ఓ యమ్మలార!' అని యుండదగును. అట్లైనచో యతిమైత్రి కుదురుచున్నది.
1. 'కందు' అను దేశ్య శబ్దముయొక్క మహద్వాచక రూపము 'కందడు'. అనగా పసివాడని భావము.

మంచి; దైన నీ కుమారుని మా యిండ్లు
జేరనీక బుద్ధి జెప్పవమ్మ! 108

వ. అని యొప్పజెప్పి, గోపకాంతలు యశోదచేత సెలవు తీసుకొని తమయిండ్లకు బోయి పెరుగు జిలుకుచు, ఒక్కరిజూచి యొక్క రిట్లనుచున్నారు: 109

## దర్వు (జావిడి)

దధి మథియింపుదమమ్మా!
ధేను, దధి మథియింపుదమమ్మా! ॥పల్లవి॥

దధి మథియింతము - దధి దేవాసురు
లధికోద్ధతులయి - యల్లనాడు దరచినట్లు ॥అ.ప.॥

ప్రొద్దున మేల్కొని నేడు, తన
హద్దున నిల్వక వాడు
ముద్దుల కృష్ణుడు - రద్దులు[1] జేయుచు
పద్దులతో మన - వద్దికి రాకమున్నె ॥దధి॥ ౧

సుడియతనంబున[2] వచ్చి, తుం
దుడుకులు జేయుచు హెచ్చి
విడిబడి నల్లవాడు - దుడదుడమని పరు
విడీ యడయడ[3] చ - ట్లడవకమున్నె మన ॥దధి॥ ౨

ఆడుచు పాడుచు చెలగీ, చిన్ని
చేడెల పొందుల మెలగీ
వేడుకలర మన - వాడల నెయ్యి పాల్
పీడక గొని చి - ల్లాడకమున్నె మన ॥దధి॥ 3

1. అల్లరులు. (చూ. శ. ర. పుట. 661)
2. 'తులువతనమున' అని యర్థము. ( చూ. శ. ర. పుట. 792)
3. 'అద, అద, (అక్కడక్కడ)- అని యర్థము.

సకలము తానని పలికీ, బా
లికెల కుచంబులు చెనకీ
కకవికపడ వికవికనవ్వుచు, తక
ముక[1] పడజేయుట - కిక వాడు రాకమున్నె ॥దధి॥ ౪

మురియుచు నుట్టుల కెక్కి, వెన్న
ముద్దలు మెక్కుచు జొక్కి
వర తరిగొండ ని - వాసుడు పన్నగ
గిరి నిలయుడు తాం - దరజేయకమున్నె ॥దధి॥ ౫

వ. అని యిట్లు పెరుగు జిలుకుచుండి; రంత కృష్ణుండు తల్లి చెంత నుండినట్లనె యుండి గోపసతుల యిండ్లకు బోయి అనేక జారచోర వినోదంబులుజూపుచు తనయీడు బుడుతలతో నిట్లనుచున్నాడు: 110

## దర్వు, అటతాళం

అప్పాలంతా తిప్పాలంతా - నారుకుందామే! ॥పల్లవి॥
వెన్నెల,కుప్పాలు బోత్తాను జోరు - గూరుకుందామే!
॥అప్పాలంతా॥ఉ.ప.॥

బిలబీలా గిలిగిట్లందు - తిలుగుచుందామే!
మీ, కల లేకుంతే కన్నాముచ్చి - ల్లాలుకుందామే!॥అప్పా॥ ౧

కరువాపువ్వాల దండాలు - కత్తుకుందామే!
మనము, మెరా నిందా - వేచుకుందామే! ॥అప్పా॥ ౨

పూని తారిగొందా చామిని - పూజా జేతామే!
యిందు నేను మీలల్లా[2] పనూలు - నేర్చుకుందామే!॥అప్పా॥ 3

ద్విపద. అనుచు కన్యలతోడ - నాట్లాడుచుండి
మొనసి యింటింటి కి - మ్మగ పోయి పోయి

---

1. 'తికమక'కు వ్యావహారిక రూపము.
2. 'మీరల్లా' అనగా 'మీరందరు' అని యర్థము.

తేలుపిల్లల బట్టి - తిన్నగా సతుల
పాలిండ్ల పైన నే - ర్పడ గరిపించి,

పాముల గొనిపోయి - భామలమీద
వేమరు వేయుచు - వెరపించి నగుచు,
తొదరి కుఱ్ఱల జుట్లు - దూడల తోక
లడర గూరిచి కట్టి - యపుడు దూడలను

పరువు లెత్తించి, యా - బాలకు లరువ
గరిమతో తాను వి - కావిక నగుచు

తుదమొదల్ గనరాని - దుడుకులు జేసి,
చెదరక తమ తల్లి - చెంగట జేరి

తరిగొండహరి యున్న - తరి గోపసతులు
వెరచి తమత్త[1]తో - వేగ నిట్లనిరి:

దర్వు

అత్త వింటివా? వో - యత్త వింటివా? ॥పల్లవి॥
మేము, తత్తరింప తేళ్ల నల్ల - తావుల గరిపించె కృష్ణు
॥డత్త వింటివా? ॥ఉ.ప.॥
సలుకు[2]నాడి వీపులాకు - కలుకుమాని యెక్కి
నలుకులేక దిగమంత్రించే - నంటూ వాడు చేతులు సాచె
॥నత్త॥ ౧

యీాడు బుడుతాల జుట్టాలు - దూడల తోకాల గట్టి
జోడు జోడుగా నే దెగురు - లాడించి నవ్వాచు నురికె
॥నత్త॥ ౨

పామూలాను దెచ్చి, చిలికే - భామాల పాలిండ్ల మీద
వేమారు వివరివేసి - వెరపించి గేలించి యురికె ॥నత్త॥౩

---

1. 'తమ + అత్తతో ' అని విభజనము. ఇది వ్యావహారిక సంధిరూపము.
2. 'సలుపు' యొక్క వ్యావహారిక రూపము. తీవ్రమైన బాధ, పోటు - అని యర్థములు.
(చూ. శ. ర. పుట. 784).

అప్పుడు వాడందు మమ్మూ - కొప్పరించి[1] చేసినట్టి
తప్పపనూలన్ని నీతో - జెప్పటాకు సిగ్గౌతుంది ॥నత్త॥ ౪
కుండ లడిచి యడిచి, తారి - గొండవాసుడైన పైడి
కొండవాడు తానే నాని - కూతాలు బెట్టూచు నురికె ॥నత్త॥ ౫

వ. అని సలుకుచేత నెగురుచున్న కోడంబ్ర నూరడించి, అత్త యిట్లనుచున్నది: 111

## దర్వు అటతాళము

మంత్రింతునటరే? నే - మంత్రింతునటరే? ॥పల్లవి॥

మంత్రముగా నల్ల - తావూల భూతితో
॥మంత్రింతునటరే?॥ఉ.ప॥

మాయల మల్లిని - మలయాళ భగవతి
నీ యెడ దలచి, నే - నీ సలుకులు దిగ ॥మంత్రింతు॥ ౧

పచ్చి మిరియపు ముద్ద - లచ్చోట్ల హత్తించి
హెచ్చు మంటలు దిగ - నిపుడు మీ కెల్లనే ॥మంత్రింతు॥ ౨

వరశేషశైల ని - వాసుని తరిగొండ
పుర నారసింహాని - స్మరణజేయుచు మీకు॥మంత్రింతు॥౩

## * తేలు మంత్రము *

వ. అని పలికి, సలుకుచేత నలుకుచున్న తలుకులాడుల బెలుకు జూచి విభూతి చేతబట్టి 'ధూ మాయల మల్లి మళయాళ భగవతీ! నందవర చౌడేశ్వరీ! నారాయణవనం అమ్నాయాక్షి వరమేశ్వరీ! శివకంచి యేకామ్రేశ్వరీ! జంబుకేశ్వరా ఖిలాండేశ్వరి! అరుణాచలేశ్వర వున్నామలేశ్వరీ! కాళహస్తీశ్వరా జ్ఞానాంబ! భక్తజనావలంబ! సద్గుణకదంబ! మదంబ! చిదంబరేశ్వర శివశంకరీ! శ్రీ శైలభ్రమరాంబ! కాలభైరవ!

---

1. విజృంభించి. ( చూ. శ. ర. పుట. 200)

గణేశ్వరా! కోళాలమ్మా! కొల్లాపురెమ్మా![1] తాళపాక గంగమ్మా! తాతయ్య గుంట గంగమ్మా! మీకు మ్రొక్కెద. యీ కులుకులాడు(ల) నళుకు దించుడు. తరిగొండ నారసింహుని తోడే! నాకు జెప్పిన గురుపాదమానే![2] దిగు,దిగూ! 112

సీ. శ్రీ రంగనాయక! శ్రీజగన్నాయకా!
వర యహొరాబలవాస! వరదరాజ!
తిరుపతిపురావాస! తిల్లగోవింద ! కో
దండ రామోద్దండ దనుజభీమ!
శ్రీవరాహస్వామి! శ్రీశేషగిరివర!
శ్రీనివాసానంత చిద్విలాస!
చండప్రతాపమార్తాండ స్వరూప! శ్రీ
తరిగొండ నరసింహ! సురనుతాహ్వ!

తే. గీ. కలికికృష్ణుండు వచ్చి యీ కులుకు చెలుల
నళుకజేయుచు బహు రహస్యాంగములను
తేల్ల గరిపించెనట నళ్కు దించు' దనుచు
పలికి మంత్రించి మునిలాపె నళుకు దించె. 113

క. అటు నళుకు దిగిన తరి నతు
లటునిటు బో కంద రరిగి యగ్గో పెమ్మన్
చటులోగ్రమతిని కనుగొని
పటురోషము మీర నిట్లు పలికిరి వరుసన్: 114

## * గోపెమ్మ, గోపికల వాగ్వాదము *

### దర్వు, అటతాళం

ఏమమ్మా గోపెమ్మా! - యేమమ్మా గోపెమ్మా!
యేమమ్మా గోపెమ్మా! - యేమమ్మా గోపెమ్మా! ॥పల్లవి॥ ౧

---

1. 'కొల్లాపురి + అమ్మా!' అని విభజనము. ఇది వ్యావహారిక సంధిరూపము.
2. 'గురుపాదము + అన + ఏ!' గురుపాదముయొక్క ఆజ్ఞ సుమా!
(ఓ నళుకూ! త్వరగా దిగిపొమ్ము) అని భావము.

కాపురములూ జేయ - గానీదు మమ్మిక
నీ పాప డీ మాట - నిజమె గోపెమ్మా! ॥ఏమమ్మా॥ ౨

బెరసి యీ పల్లె కా - పురమూలు జాలించి
పొరుగూళ్లకైనాను - పొయ్యేం గోపెమ్మా! ॥ఏమమ్మా॥ ౩

తరిగొండా హరితోదే! - పరగ నీ కొడుకు మ
మ్మిరవూగా నిందుండ - నియదె గోపెమ్మా! ॥ఏమమ్మా॥ ౪

(వ. అనిన విని యశోద వారితో నిట్లనుచున్నది:) 115

ఆ.వె. చేడెలార! యిచట చిన్నికృష్ణుండు నా
యొద్ద నుండగానె, దద్దిలుచును [1]
వచ్చి వీనికొరకు వలన బోదు మటంటి,
రిచట నున్న బిడ్డ డేమి జేసె? 116

(వ. అనిన విని యా గోపసతు లిట్లు పలుకుచున్నారు:) 117

ద్విపద. వినవె యశోద! బల్ - వింత యింకొకటి
యనువంద నీ బాలు - డాడుచు వచ్చి

తులువయై మా కోడె - దూడ తోకలకు
వలనొప్ప మా చిన్న - వాండ్ల జుట్లకును

వీకతో ముడివేసి - వీథిలో దోలె;
నా కోడె లెగురగా - నా చిన్నవాండ్లు

అదిరి కుయ్యోమొరో! - యని కూత లిడగ,
పదపడి తా నందు - పకపక నవ్వి

పరువెత్తి వచ్చెనీ - బాలు డిచ్చటికి,
వెరచి తోకలు, జుట్లు - విడిపించలేక

1. 'దద్దరిల్లు' అనునది దీని మొదటి రూపము. ఇది యుచ్చారణవశమున క్రమముగా దద్దిర్లు - దద్దిల్లు - దద్దిలు - అని మార్పు నొందినది.

పనిబూని కోడెల - బట్టి మెల్లగను
చినవాండ్ల జుట్లు పీ - ర్చితి[1] మింత తడవు

శ్రీతరిగొండ న్ఱ - సింహుని తోడె!
నీ తనూజుడు బహు - నిర్మోహకుండె.[2]

## దరువు* (జావిడి)

ఈ మాటలు కల్లాలని - యెంచుకోకవమ్మా!
నీవు, యెంచుకోకవమ్మా!
యీ ముద్దువా డందురాలే - దెట్ల నిజములమ్మా?

యేమో వీని మాయలు - యెరుగగూడదమ్మా!
మా కెరుగగూడదమ్మా
రామరామ! బిడ్డ నేల - రవ్వజేసేరమ్మా! ౧

మమ్మిట్లా రవ్వజేసేది - మంచిటావమ్మా?
యిది, మంచిదటావమ్మా?
మిమ్మెవ్వారు రచ్చలా - కిమ్మెయి బిలిచీరమ్మా?
మమ్మూ రచ్చకు దీసేది - మాధవుడేనమ్మా?
యా మాధవుడేనమ్మా!
యిమ్మాహి నన్యాయము లి - ట్లెందు [క] నేరమ్మా? ౨

భళి భళి యశోద! యిది - బాగాయ నో యమ్మా!
యిది, బాగాయ నోయమ్మా!
వళవళాగా మీరిచ్చేట - వదరవల దోయమ్మా!

---

1. 'పీడజేసితిమి' అని యర్థము. పీడుచు = పీడజేయు ( చూ. శ. ర. పుట. 726).
2. 'నిర్వాహకుండె' అని యుండదగును. అట్టైన అర్థము చక్కగా సమన్వయించును. అట్లుగాక 'నిర్మోహకుండె' అనునది జానపదుల వ్యవహారములో ('నిర్వాహకుండె' అను అర్థమిచ్చెడి) కృతక ప్రామాణిక రూపముగా మారియుండవచ్చును. గోపికలు జానపదులు గావున కవయిత్రి వారినోట ఆ రూపమును యథాతథముగా పల్కించెనని తలపదగును.
* గోపికలకు, యశోదకు జరిగిన సంభాషణ మిందు గలదు. ఈ సంవాదము తరువాతి కందద దరువులోను కొనసాగినది.

కళవాళముగా నీవు మమ్ము - గదిమేదేల నమ్మా?
నీవు, గదిమేదేల నమ్మా?
ఫెళఫెళాగా మీరైతే సా - పింపవచ్చునమ్మా? ౩

మాకు నీ కొడుకుమీద - మచ్చరమటమ్మా?
మాకు, మచ్చరమటమ్మా?
లేక, వీనిలో తప్పులు - లేవుగదరమ్మా!
యీ కుచోద్యపు మాట లి - ట్లెందు కనేరమ్మా?
యిట్లెందు కనేరమ్మా?
మీ కుచోద్యములే కాని - మేమే మెరుగామమ్మా! ౪

మగువాల వీడు బట్టేది - మంచిదటవమ్మా?
యిది, మంచిదటవమ్మా?
మగువాలు యీ బుడుతాని కే - మాడ్కి జిక్కిరమ్మా?
వగకా డేమో మాయజేసి - వలపించినాడమ్మా!
వీడు, వలపించినాడమ్మా!
తగని నింద లిట్ల గట్టా - తగదింకా పోరమ్మా! ౫

నిందలుగా వీ మాటలు - నిక్కములే నమ్మా!
యివి, నిక్కములే నమ్మా!
కందడెట్లా తరుణులాను - కవగూడూ నోయమ్మా?
సందేహములేదు వీడు - జారుడే నోయమ్మా?
వీడు, జారుడే నోయమ్మా!
మందెమేళముగా[1] నిట్ల - మాట లనకురమ్మా! ౬

యింకా నీ కొడుకూ దుడుకు - లెన్నో గదవమ్మా!
అవి, యెన్నో గదవమ్మా!
కొంక కన్ని దెలుపు డింక - కొదవలేల నమ్మా?
పొంకముగా నొక్క సతిని - పొరలించినాడమ్మా!
వీడు, పొరలించినాడమ్మా!
పంకజనాభుని కంత - బల మెక్కాడిదమ్మా! ౭

1. 'చనువుగా'. (చూ. శ. ర. పుట. 596).
'అతి పరిచయము వలని పరిహాసముగా' నని తాత్పర్యము.

బలములేకనే యింతుల - బుట్టునటవమ్మా!
పీడు, పట్టునటవమ్మా!
యెల శిశువూ కింతబల - మెట్లా వచ్చునమ్మా?
పలుమారు శిశువనుచు - పలుకావలదోయమ్మా!
నీవు, పలుకావలదోయమ్మా!
యెలమిని మీకండ్లకు పీ - డెంతావాడోయమ్మా? ౮

వనిత! నీ బాలుడు పూర్ణ - వయసువాడోయమ్మా!
పీడు, పూర్ణవయసువాడోయమ్మా!
పెనసి మీ కా రీతి గాని - పించునటావమ్మా?

పనులన్ని పెద్దవి; పీడు - బాలుడేనోయమ్మా?[1]
పీడు, బాలుడేనోయమ్మా?
చెనకి బలుపను లేమి - జేసి వున్నాడమ్మా? ౯

పాము నొక్క దంపతూల - పైన వేసెనమ్మా!
పీడు, పైన వేసెనమ్మా!
పాము నెట్ల బాలకుడు - బట్ట నేర్చునమ్మా?
నేమమూన వాకట్టేమొ - నేర్చుకున్నాడమ్మా!
పీడు, నేర్చుకున్నాడమ్మా!
యీ మహిమా తరిగొండ ల - క్ష్మీశు డెరుగునమ్మా! ౧౦

## కందద దర్వు*

క. మగువల గూడుచు వారల
మగవారిని జేరి యట్టి మర్మములెల్లన్
నగినగి చెప్పుచు, పీథిని
తగవుల బెట్టించు నిదియు తగునటవమ్మా?

---

1. 'బాలుడేనా + ఓ యమ్మా?' అని విభజనము.

*కందద దరు వనగా కందపద్యముతో సంధింపబడిన దరువని యర్థము. దీనినే కందార్థదరువని, కందార్థమని యందురు. ఇందు కంద పద్యముయొక్క నాల్గవ పాదమందలి నాల్గవ గణముతో దరువు ప్రారంభమగును. అనగా కందము నాల్గవ పాదము యొక్క చివరి రెండు గణములు దరువులో విలీనములై యుండునని భావింపవలెను. ఆ రెండు గణములు అటు కందమునకు పూరకములుగను, ఇటు దరువునకు ప్రారంభకములుగను ఉండి, ఆ రెంటిని ఒకటిగా సంధింపజేయుచుండును.

ద. తగునటవమ్మా? వీనితో బోర - తరమటవమ్మా?
వగ లప్పుడటు జేసి - చిగురుబోణుల దాసి
మగుడి రచ్చకు దీసి - యగడు బొందించేది
తగునటవమ్మా? ౧

క. తగ సిగ్గెరుగని బాలుడు
మగువల కవగూడె ననుచు మాటికి నాతో
తెగువగ జెప్పెద రిల, బలు
నగుబా టిది విన్నవారు నగుదురు గదరే!

ద. నగుదురు గదరే! మీ యిండ్ల కై - నను వేగ పదరే!
దిగులు లేకను నాతో - జగడమునకు వచ్చి
పగటు పల్కులు[1] మీరు - పల్కితే, విను వారు
నగుదురు గదరే! ౨

క. పెరు గొక సుందరి జిలుకగ
మెరసెడి సర్పమును దాని మెడ నేసిన, తొం
దర నది యురుకగ, తా నట
పరువడి నావెన్న మెక్కి పరువిడెనమ్మా!

ద. పరువిడెనమ్మా! నీ బిడ్డ డు - త్రాతు డోయమ్మా!
యిరుగు పొరుగుల నుండే - తరుణి లడ్డము దాకి
తరిమి పట్టగ, వారి - నొరసి కరిచి బరికి
పరువిడెనమ్మా! 3

ద. ధర పామును గని పెద్దలు
పరువెత్తుదు; రింత చిన్నిపాపడు దానిన్
కరముల బట్టునె వెరువక?
నిరవుగ నిటువంటి వింత లెరుగము పోరే!

1. 'పగతో కూడిన మాటలు'. అనగా ద్వేషముతో గూడిన పరుషవాక్యములని భావము. (చూ. ఆంధ్ర వాచస్పత్యము, ద్వితీయ సంపుటము పుట. 1655).

ద. ఎరుగము పోరే! మ మ్మగడు మీ - రేల జేసేరే?
నరినరి మేల్మేలు - చాల్ చాలు మీ మాట
లరయగ డబ్బర - లమ్మమ్మ జెల్ల ! మే
మెరుగము పోరే! ౪

క. తెరవల లోదొడలందును
కరములతో నెత్తి మంత్రగబ్బల నెపుడో
చొరదోలుచు కరిపింపగ
నురిమంటలచేత[1] కాంత లొరలుదురమ్మా!

ద. ఒరలుదురమ్మా! తా జూచి న - వ్వుచు నుండునమ్మా!
పరవశత్వమున నం - బరములు విడిచి, సి
గ్గెరుగక పలుమారు - నురికి సళుకుచేత
నొరలుదురమ్మా! ౫

క. వెరవక యి బ్బాలుడు తన
కరములతో నెట్ల మంత్రగబ్బల నంటున్?
పరువడి నంటిన వీనిని
గరవక యా సతుల తొడలు గరచిన దేమే?

ద. కరచినదేమే?[2] యీ మాట లె - క్కడనైన నిజమే?
అరసి కానక తొల్త - నంటిన బిడ్డను
గరువ కూరకె యుండి - కాంతల తొడలలో
గరచినదేమే? ౬

---

1. 'ఉరియువట్టి మంటలు'. ఉరియు - కాలు, చలించు. (చూ. సూ. రా. ఆం. నిఘంటువు, ప్రథమ సంపుటము పుట 691).
అనగా మండుచున్న మంటలవలె చలించుచు అతిశయించు బాధలని భావము.
2. 'కరచిన విషయ మెట్లు?'. అనగా 'ఏలాగున కరచును?' అని యర్థము.

క. ధరణిని నీ సుతు మాయల
నెరుగవు నీవైన, మేము నెరుగ మిదేమో?
మరి మరి మించిన దింతయు
తరిగొండాధీశు డెరుగు తరుణి! యశోదా!

ద. తరుణి యశోదా! నీ కొడుకును - దండించరాదా?
మురిసి మురిసి, వీడే - మెరుగడనుచు, మమ్ము
తరుమవచ్చుట నీకు - ధర్మము గాదమ్మ!
తరుణి యశోదా! ౽

క. అను వారల నదలింపుచు,
తనయుని దగ్గరికి బిలిచి దయ దళుకొత్తన్
మన మలరగ లాలింపుచు
నెనలేని ముదంబు మీర నిట్లని పలికెన్: 118

### * యశోదాకృష్ణుల సంవాదము *

ద్విపద. ఇది యేమిరా కృష్ణ! - యీ వూరి సతులు
కొదుకక నీ మీద - కొదువ లెంచెదరు?

దబ్బరో, నిక్కమో - తథ్యంబుగాను
తబ్బిబ్బు నొందక - తగ దెల్పు మిపుడు,

శ్రీ తరిగొండ నృ - సింహుని తోడె
నీ తప్పు జెప్పరా - నేడు శ్రీకృష్ణ!

(వ. అని పల్కిన గోపెమ్మతో శ్రీకృష్ణు డిట్లనుచున్నాడు:) 119

### దర్వు, ఆదితాళం*

అమ్మా! నామాత నిజమె గోపెమ్మా! వారి మాతలు దబ్బరలమ్మా!
నే నిందె వుంతిగదమ్మా! వారిం డ్లేమెరుగుదునమ్మా?

---

* ఈ దరువులో యశోదాకృష్ణుల సంవాదము అప్యాయనమగురీతిని మనోజ్ఞముగా కూర్పబడినది.

తేరకు నను దిత్తేరమ్మా! తరిగొండాదివుతోరమ్మా!
నే దురుకుశాయలేదమ్మా! నను కొత్త వొద్దు గోపెమ్మా!
నను కొత్తవద్దు గోపెమ్మా! ౧

నేనూ నిన్ను గొద్దుమీరి కన్నానూ; యెంతో నిక్షేపముగానూ
నిన్నిందు జూచుకున్నానూ; నిను పరులంటే వినలేనూ
పొరుగిండ్లకు నిక బోతేనూ, నిను బూచికి పట్టిచ్చేనూ
తరిగొండాధిప! యింట్లోనూ, నీ వుంటె నిన్నేమననూ
నీ వుంటె నిన్నేమననూ ౨

నేనూ యెవరింతికి చొలవగ బోనూ; యింతోనే రామునితోనూ
నే నాత్తారుతు వుంతానూ; బూ చిక్కర వచ్చితేనూ
నన్ను దాచి పెత్తవె! రానూ; తరిగొందేశురనై నేనూ
బూచికి నిండా వెరచేనూ; నను నీవు గావు దయతోనూ
నను నీవు గావు దయతోనూ 3

పేరూపెంపైనట్టి యీవూరూ, లోనుండె గొల్లావారూ
బూచిని దాచీనారూ; నిను బట్టిచ్చేమన్నారూ
నీకై పొంచుచున్నారూ; తరిగొండాధీశా! పోరూ
బెట్టాకుంటె యెవ్వారూ, నిన్ను బట్టియ్యలేరూ
నిన్ను బట్టియ్యలేరూ ౪

అమ్మా! బూ చెత్తా వుండూనమ్మా? ఆ [రీ]తి జెప్పవమ్మా!
తెలిశితే మంచిదమ్మా! వాని రూ పెత్తిదమ్మా?
చేచీనా మానిబొమ్మా?[1] లేకా పెద్ద గంగమ్మా?
తరిగొందా హరితోరమ్మా! దాచకా చెప్పవమ్మా?
దాచకా చెప్పవమ్మా? ౫

చూడు కృష్ణా! యా బూచివాడూ, పండ్లిగిలింపుచున్నాడూ
బలు బాకి నోటివాడూ, గోరులు బెంచినాడూ

1. 'వేపవంటి పెద్ద మ్రానితో తయారు చేసిన బొమ్మయా?' అని యర్థము. తిరుపతి గంగజాతరలో వేపమ్రాని కాండముతో గంగమ్మ ఆకారమును గొప్పగా తీర్చుట సుప్రసిద్ధము.

మించినా గారడీడూ, తరిగొండాధీశా! వాడూ
నీ కొరకే పొంచినాడూ, నిను బట్టుకోకపోడూ
నిను బట్టుకోకపోడూ ౬

యిత్తూ బూచివారంతా మత్తూమీరి యిందె వున్నత్తూ
జెప్పేవు; నన్ను గుత్తూగా నింతో దాచిపెత్తూ
తరిగొందాదిపు దేతత్తూ జనెనో లే రిందన్నత్తూ
వెదకింతో వాందా దిత్తూ[1]; బూచీని వెళ్లగొత్తూ
బూచీని వెళ్లగొత్తూ ౭

నేనూ నీవెందు బోకుంటేనూ చల్లని లాలా బోసేనూ
బంగరు వల్లె గట్టేనూ; సొమ్ములు శానా బెట్టేనూ
కొండెకు పువ్వులు జుట్టేనూ; తరిగొండాధిప! నీమేనూ
నిండా గంధము బూసేనూ; నీకు పాల్ బువ్వ బెట్టేనూ ౮

నేనూ యిక నెవ్వారింతికి బోనూ; బహుభీతి నొందుచున్నానూ
యింతోనే రామునితోనూ వెన్నలు దాచే యింతోనూ
నేరొదిగి[2] దాగివుంతానూ; బూచిచతికి వొచ్చితేనూ
తరిగొందాదిపు డింతోనూ లే రావల బోపొమ్మానూ
లే రావల బోపొమ్మానూ ౯

పూనూ ధైర్యము నా కొడుకా! మేనూ వణకించే దింకా మానూ
నే నిందె యుండగానూ భయమేమిరా యింట్లోనూ?
తరిగొండాధీశా! నేనూ బంగారు తొట్లలోనూ
నిన్నుంచి ముద్దుగానూ జోలపాటా బాడేనూ
జోలపాటా బాడేనూ ౧౦

---

1. 'వెదకింట్లో వాండ్లా దిట్టూ'. అనగా బూచికి పట్టియ్యదలచి వచ్చిన వారినిగాంచి, యశోద వారి యెదుట కృష్ణుని కొరకు ఇంట్లో వెదకినట్లు నటించి, యింట్లో లేడని చెప్పి, ఆ వచ్చిన వారిని తిట్టిపంపవలసినదని కృష్ణుని అభ్యర్థనము.
2. 'నేదొదిగి' (నేడు + ఒదిగి) అని గ్రాహ్యము.

†చూరూ మనవూరి యూరావారూ, తేరకు నన్ను
జారురంతా నిందించినారూ
నే నింతో వుంతె పోరూబెత్తేట్ల గిచ్చినారూ[1]
నిను గానకుందా వారూ; నన్నెత్తుక పోయినారూ
పాచాలూ[2] దెచ్చినారూ; రామారచమూ[3] చేశినారూ

నాకూ దాగించినారూ; తామదే తాగినారూ
చాలా మత్తిల్లినారూ; 'తరిగొండాధీశా! మారూ
కేళీ సల్పుమన్నారూ; తామేమొ జేచినారూ
తామేమొ జేచినారూ ౧౧

వోరీ ముద్దు కృష్ణా! యీ వూరీ గరితాలు నిన్ను దూరీ
పల్కుచు బల్ వేసారీ నిందించి రింకా వారీ
పడుచూ లుండినా దారీ పోవద్దు ,వెన్నా గోరీ
పోతే కొట్టే నీ సారీ తరిగొండా నరహరీ!
తరిగొండా నరహరీ! ౧౨

†మత్తూ బుత్తించి నన్ను బత్తూకోని తాము నాచత్తూ
నిల్చి గందాము బూత్తూ, మెల్లో పూసరులు వేత్తూ
నెత్తినా పూలు బోత్తూ, వెన్నా నోతి కందిత్తూ
వేరీపాలు దాగిత్తూ, నాకు వక్కాకు లిత్తూ
నా చెక్కిళ్ళు గరుత్తూ, నాగుత్తు బత్తి చూత్తూ

† ఈ గుర్తుగల చరణములలో నాలుగుకన్న ఎక్కువగా పాదము లుండుట గమనింపదగినది.

1. 'పోరుబెట్టేట్ల గిచ్చినారు'. అనగా పోరు బెట్టునటుల గిచ్చినారని భావము.

2. 'పాలు' అనుటకు బాలభాష.

3. ఇది యొక రకముగు పానీయము. బాదాము పప్పు, సారెపప్పు, గసగసాలు, గులాబిపూలు, ఎండు ద్రాక్ష, ఏలకులు, లవంగములు, చక్కెర, గంజాయి పూలు మొదలగు దినుసులను సన్నెకంటిపై నూరి ఆవుపాలలో కలిపి, అందుండి సారమును వడియగట్టుదురు. ఆ సారమునకు' రామ రస' మని పేరు. రమింప జేయునది - అనగా, పరవశింపజేయునది - అనుఅర్థమున ఈ పేరు దీనికి సార్థకము.సాధువులు, సన్న్యాసులు , బైరాగులు, మహంతులు, యోగులు మున్నగువారు తాత్కాలికముగా ప్రాపంచిక విషయముల కతీతులై తన్మయీ భావముతో నుండు నిమిత్తము రామరసమును సేవించెడివారు.

నన్నూరకె నవ్వేత్తూ, తరిగొండాహరి మా పొత్తూ
కురానీ[1] నన్నూ పత్తూకోవొత్తే నే వెరుత్తూ
కూగూతాలు నే గూత్తూ, లేచీ నే పరిగెత్తూ
కో రాబోతే నాజుత్తూ బత్తీర్చేమేమో తేత్తూ

వుంతె నే వురికెత్తుకుంతా యింతికీ వొత్తూ
నా వెంబరీ నరుత్తూవచ్చిందు నన్ను రత్తూ
చేచీనా సతుల బత్తూ; చెంపా లదరగొత్తూ
చెంపా లదరగొత్తూ ౧౩

ధీరా! నా ముద్దుతండ్రీ! దేరా[2] యిట్లా మాట్లాడకూరా!
ని న్నుప్పతించేరూరా! పోకళ్లు నేర్వకూరా!
నీకు దృష్టి తాకీరా! నేనేమీ సేయుదురా?
తరిగొండాధీశా రారా! మంగాళారతిచ్చేరా!
మంగాళారతిచ్చేరా! ౧౪

ఆ.వె. అని యశోద మంగళార తిచ్చిన, కృష్ణు
డనియె నిట్లు: గొల్లవనితలెల్ల
నన్ను నుప్పతించినారు గావున పత్తి
కొత్తు కొత్తు కొత్తు గోపిదేవి! 120

క. అని గోపాలుడు తల్లికి
వినిపింపగ, గోపసతులు వెరగందుచు నీ
తనయుని మాటల కిప్పుడు
కొనమొద లేదమ్మ[3] నందగోపాలసతీ? 121

(వ. అనిన విని యశోద వారి కిట్లనుచున్నది:) 122

---

1. 'మాపొత్తుకురా+అని' అని విభజనము
2. 'తేరా' అనగా 'తేరకు' (ఊరక) అని యర్థము.
3. 'కొన మొదలు + ఏదమ్మ' అని విభజనము. అనగా 'చివరలేదు; మొదలు లేదు' అని భావము.

క. నా కొడు కుండివ చోటను
మీ కూతుల జేరనీక మెలువుగ మీ మీ
వాకిండ్లందును (భద్రము)
గా కావలిబెట్లు; డేల కలహించెదరే? 123

వ. అని పలికి యశోద గోపసతుల సముదాయించి పంపించె; నంత మరునాడు గోపసతులు గుమిగూడి పెరుగు జిలుకుచు తమలో దా మిట్లనుచున్నారు: 124

## దర్వు (జావిడి)

చిలుకరమ్మా! బిరబిర పెరుగూ చిలుకరమ్మా ॥పల్లవి॥

చిలుకరమ్మా! ము - ద్దుల గోపాలుడు
తులువై కుండలు - ద్రోయక మునుపే ॥ చిలుకరమ్మా ॥అను॥

సందుల గొందుల - యందుల పొంచుచు
ముందర కృష్ణుడు - మొనయక మునుపే ॥చిలుకరమ్మా॥౧

దాగుచు మూగుచు - నాగడపరుచుచు
మీగడ గొని వాడు - మెక్కక మునుపే ॥చిలుకరమ్మా॥ ౨

కిలకిల నవ్వుచు - ఖేలలు జూపుచు
బలు కవ్వంబులు - బట్టక మునుపే ॥చిలుకరమ్మా॥ ౩

గిరగిర కవ్వము - లరిమురి దిరుగగ
నొరపిన మెరుగుల - నురుగులు గరగా ॥చిలుకరమ్మా॥ ౪

తరిగొండాధీ - శ్వరుడగు వేంకట
గిరి నిలయుండగు - కృష్ణుడు వచ్చీ[1] ॥చిలుకరమ్మా॥ ౫

వ. అని యిట్లు పెరుగు జిలుకుచున్న సమయంబున కృష్ణుండు క్రమ్మర గోపసతులమీద దాడివెడలి, యాడుచు పాడుచు, చల్ల చిల్లాడ

---

1. 'వచ్చివి'. అనగా 'రాగలడు' అని యర్థము.

నుల్లాసంబున కొల్లకాడై రాగా, నల్లనయ్యను జూచి వల్లవపల్లవాధరలు చెల్లరే! యని తమలో దా మిట్లనుచున్నారు: 125

## దర్వు, ఆదితాళం

తిరుగ వచ్చెనే! కృష్ణుడు - తెరవలారా! వాకిండ్లకు
కరుకు[1]బీగములు వేసి - కావిళ్లుం[2] దామే ౧

చుట్టుపట్ల పొంచి విని - పట్టి కట్టివేసి, పూని
గుట్టుగా యశోదకడకు - గొంచూపోదామే! ౨

తన చెంతా శ్రీతరిగొండా - ధాము డున్నాడను గోపెమ్మా
కనువందాగా వీని మాయ - లపుడూ దెలుసూనే! 3

వ. అని పలికి,వాకిండ్లు వేసి కృష్ణునిచుట్టు పరివేష్టించిన గోపికలతో కృష్ణుండిట్లనుచున్నాడు: 126

## దర్వు (ధ్రువం)*

పత్తుతారా? (మీరు) నన్ను పత్తుతారా? ॥పల్లవి॥

గుత్తు గుత్తుగా మాత్తారు - కుంతా వున్నారీర మీరు ॥పత్తు తారా?॥ ఉ.ప.॥

మీ కందలికిని నేను - మిందగారనై వొత్తినీ
నాకు[3] వేలుపిక లేదు - నంగనాచి తొత్తులాల! ॥పత్తుతారా?॥ ౧

పెద్ద పెద్ద వాకిందాకు - బీగములు బాగా వైచి
పద్దు పత్తీ మీలు నన్ను - పత్తుతామంతీ రత్తైతె ॥పత్తు తారా?॥ ౨

---

1. 'కరకు' యొక్క వ్యావహారిక రూపము. 'కఠినమైన, గట్టి' అని యర్థములు. (చూ.శ.ర.పుట. 156)
2. 'కావలి' కి వ్యావహారిక రూపము 'కావిలి'. దానికి బహువచనము 'కావిళ్లు'.
* ఈ 'ధ్రువ' మనునది 'జావిడి' వలె దరువులలో నొకరకమని తెలియదగును. 'ధ్రువపద' మని దీని నామాంతరము.
చూ. i) నృత్తరత్నావళి 7వ అధ్యా., 65 శ్లో.
ii) భరత కోశః , పుట. 229.
3. 'నా కంటె' అని యర్థము.

తరిగొందా నారాచిమ్మని - దాచ్చిన్యాము మీకు లేక
పరగా మాయమ్మ చెంతాకు - పత్తూకొపోతామంతారు
॥వత్తు తారా?॥ 3

వ. అని కలహించినట్టుండి, యంతరిక్ష - మార్గంబున వారిండ్లలో జొరబడి దధిక్షీర నవనీతంబులు మెక్కి, కొల్లబెట్టి, నానా విచిత్రంబులైన దుడుకులు జేసి, యొక్క ముద్దుపాపని బొజ్జనిండ వెన్నగూరి, వాడు గ్రుడ్లు వెలికురికి యూపిరి ద్రిప్పలేకున్న సమయంబున కృష్ణుండు అంతర్ధానంబున వచ్చి యశోదచెంత నుండె; నంత గోపసతులు కృష్ణుని గానక పోయెనని[1] బీగంబులు దీసిపోయి, తమ యింఢ్లలో నడిచిన విచిత్రంబులకు వెరగుపడి, యూపిరి ద్రిప్పలేకున్న బిడ్డను గొనివచ్చి యశోద ముందర బెట్టి యిట్లనుచున్నారు: 127

### * గోపికల ఫిర్యాదు *

ద్విపద. ఈ పాప మేమమ్మ - యింతి గోపెమ్మ?
నీ పాప డిప్పుడు - నీ చెంత నిలిచి

యున్నాడనుచు జెప్ప - చున్నావు నీవు,
వెన్ను డిప్పుడు నిన్ను - విడిచిరా జూచి

వెరచి వాకిండ్లకు - వేవేగ మేము
కరుకు బీగంబులు - గదియింప, జూచి

మాతోను కలహించి - మమ్ము బొంకించి
యే తీరుగానొ తా - నిండ్లలో జొచ్చి

పాలు ద్రావియు చట్లు - పగుల నడంచి
బాలామణుల గూడి,- బాలుని పొట్ట

విరియ కుత్తుకబంటి - వెన్న దా గూరె;
నరయగా నాబాలు - డప్పుడు గ్రుడ్లు

చాల వెల్కురుకగా[2]- సంకటపడుచు
లీల నూపిరి ద్రిప్ప - లేకయున్నాడు;

---

1. 'అచటినుండి వెళ్లిపోయెనని' అని యర్థము.
2. 'వెల్కి (వెలికి) + ఉరుకగా' అని విభజనము.

ఈ పాప దేమైన - నిది నీకె సెలవు![1]
నీ పట్టిచేతను - నేడు మా పట్టి

యీ తెరువాయె - నింకేమనవచ్చు?
శ్రీ తరిగొండ నృ - సింహుని తోడె!

కాపురములు జేయ - గాజాల మిచట
మీ పల్లె జాలించి - మేము బోవలసె.

(వ. అనిన విని యశోద గోపసతులతో నిట్లు పల్కుచున్నది:) 128

క. నాపాపడు నా చెంగట
నీ పగిదిని బలునితోడ నిందాట్లాడున్;
మా పిన్నవాని కొరకై
యీ పల్లెను మీరు విడువనేందుకు? బోరే! 129

(వ. అనిన విని గోపికలు యశోదతో నిట్లనుచున్నారు:) 130

## దర్వు, అటతాళం

గోపెమ్మా! యేమె గోపెమ్మా! ॥పల్లవి॥

గోపెమ్మా! మావల్ల - పాపాములేదు నీ
వీ పట్ల మామీద - కోపాము జేయకు ॥గోపెమ్మా! ॥ఉ.ప.॥

యిట్టి లోకాతీతు - డీవూరిలో బుట్ట
బట్టి మాబ్రతుకూలు - బంగారమై పోయనే! ॥గోపెమ్మా॥ ౧

బాలకుడని నీవు - భావింపుచున్నావు
బాలుడు గాడు నీ - పాదములాన వో ॥గోపెమ్మా॥ ౨

చిన్నికుఱ్ఱలను - జూచితిమమ్మ! భూమిలో
నిన్ని నేర్చిన కుఱ్ఱ - నెరుగ మెచ్చోటను ॥గోపెమ్మా॥ 3

---

1. అనగా ' ఆ పాపపుణ్యములు మీవే సుమా!' యని భావము.

రమణిరో! యివి మత్స - రంపు మాటలుగావు
క్రమముగా నడుగు మి - క్కడివారి నెల్లను ॥గోపెమ్మా॥ ౪

పాదైనా[1] తరిగొండ - పతితోడె! నీ బిడ్డ
మీద దబ్బరచాడి - మేము జెప్పలేదే! ॥గోపెమ్మా॥ ౫

ద్విపద. వెలది! నీ కడుపులో - వ్రేలెడు బిడ్డ
కలుగునా? యని మేము - కన్నదేవళ్ల

నురుభక్తి తో వేడు - చుంటి మీవరకు
తరిగొండహరి మీకు - తనయు నిచ్చుటకు,

ముదమందుచుండగా - మొనసి నీ కొడుకు
విదితంబుగా జూడ - విపరీతుడయ్యె.

వీడు జేసిన పనుల్ - వివరంబుగాను
చేడె! నీతో మేము - చెప్పనేలేదు,

కొడికొడిగా నిందు - కొన్ని జెప్పితిమి;
కడముట్ట నీతని - కార్యంబులన్ని

జెప్పితిమైన[2] బల్ - సిగ్గులచేటు,
జెప్పనేటికి? మాకు - సెలవియ్యవమ్మ!

(వ. అనిన విని నందసతి వారితో నిట్లనుచున్నది:) 131

క. ఇక్కడ నుండెను బాలకు;
దక్కడి కెవ్వాడు వచ్చె? నా పనులెల్లన్
తక్కక నెవ్వడు జేసెను?
దిక్కే దీమాయ మాకు తెలియదు గదరే! 132

(వ. అనిన విని యాగోపిక లిట్లనుచున్నారు:) 133

---

1. 'నిలుకడయైన', అనగా 'శాశ్వతుడైన' యని భావము.
2. 'చెప్పినట్టైన' అని యర్థము.

## దర్వు

ఇక్కడా వీడుండె నంటివమ్మా!
మా యిండ్లాకు వే, రొక్క దేదనుండి వచ్చెనమ్మా? ౧

సత్యాముగా వీడె వచ్చెనమ్మా!
వగలెన్నో జేసి, సతుల కుచములా వ్రచ్చెనమ్మా! ౨

అందారిండ్ల పాలు ద్రావెనమ్మా!
యింటింటి కుండ, లడచియడచీ పారవైచెనమ్మా! ౩

బాలామణులాను బట్టెనమ్మా!
పసిబిడ్డలాకు, భావజునికేళి నేర్పెనమ్మా! ౪

వీ డెక్కాడి చిన్నవాడోయమ్మా?
తరిగొండహరికి వీని, వింతాలన్ని దెలుసునమ్మా! ౫

క. తక్కక కృష్ణుని దుడుకులు
వెక్కసమై తోచె గనుక, వీనివలన మే
మెక్కడనైనను బోయెద;
మిక్కడ నిక నుండవెరతు మిదె సెలవు సఖీ! 134

ద్విపద. అని వారు బల్కాగా - నపుడా యశోద
విని యిట్టులనియె: నో - విరిబోణులార!

హక్కనుచే[1] మాట - లని యూరు విడిచి
యెక్కడ బోను మీ - కేల? నానుతుని
ఏయెడనైన నే - నేమరకుందు;
మీ యిండ్ల కెటు నన్ను - మించి రావచ్చు?

వచ్చెబో సతుల వె -వ్వరి నేల వ్రచ్చు?
వ్రచ్చెబో మీ పాలు - వాడెన్ని ద్రాగు?

---

1. 'అక్కమ' కు పూర్వరూపము. 'అగ్రహము, కోపము' - అని యర్థములు.

త్రాగెబో కుండ లెం - దరివని నీగు?[1]
నీగెబో మీ రన్న - నేర్పు లే మెరుగు?

ఎరిగెబో స్మరకేళి - నేరీతి మరుగు?
మరిగెబో నతుల నె - య్యాడ్కని బట్టు?

పట్టెబో రతి సల్పు - బలమెట్టు బుట్టు?
పుట్టెబో యిట్టి య - ద్భుతము లిక్కడను!

ఇలువెళ్లి నా కొడు - కెందు రాలేదు,
తెలియక మీ రుప్ప - తించకురమ్మ్మ!

పుట్టి పుట్టక మున్నె - బుడుతని రచ్చ
బెట్టిన ఫలమేమి - ప్రియమెల్ల మాని?

తప్పు గల్గిన నేనె - దండింతు సుతుని
ఇప్పు డెక్కడ బోకు - డిండ్లకు జనుడి!

తరిగొండహరితోడె! - దాక్షిణ్య ముంచి
పొరుగూళ్లకును మీరు - పోకుండరమ్మ్మ![2]

(వ. అనిన విని గోపిక లిట్లనుచున్నారు:) 135

చ. మెలత యశోద! నీ కొడుకుమీదను సారెకు నిందమాటలన్
వలనుగ జెప్ప నిందు పగవారముగాము; నిజంబు జూచితే
నలరగ మీరు మాదొరలు, నాప్తులు గావున మామనంబులన్
కలుగునె యెంతకైన పగ కంజదళాక్షునిమీద భామినీ? 136

(వ. అనిన విని యశోద యిట్లు పల్కుచున్నది:) 137

సీ. మీ చిన్నవానికి మా చిన్నిపాపడు
వెన్నగూరెనటంచు వెక్కసముగ
పలికితి రా మాట పాటింప దబ్బర,
మరి యిది యక్షిణి మాయగాను

---

1. నీగు = వివర్తించు (తొలగించు) - అని యర్థము. ( చూ.శ.ర. పుట. 438).
2. 'పోక + ఉండరమ్మ్మ' అని విభజనము.

తోచుచున్నది; మంచి దీచిన్ని పాపని
కడుపెల్ల నిమురుచు నుడుకునీళ్లు
బోయుడు; కరిగి తెప్పున వెన్న డిగిపోవు,
పాపని కట ప్రాణభయములేదు;

తే.గీ. వసుధ యక్షిణి యనెడు దేవతకు మీరు
శాంతిగా జాతరలు జేయు, డంత నిచట
పుట్ట విట్టి విచిత్రముల్ పాలతులార!
వేగ బోరమ్మ! యిండ్లకు వెలదులార! 138

ఆ.వె. అని యశోద బల్కు నాకొమ్మ లిట్లని:
రమ్మ! కృష్ణు డిచట నెమ్మదిగను
మమ్ము నిల్వనీడు; మా కింక సెలవియ్యు
డనుచు నడుగుచుండి రబ్జముఖులు. 139

* గొల్ల గౌడు *

ద్విపద. ఆ లోన ముసలివా - డగు గొల్లగౌడు [1]
పాల కావడి మూపు - పైన నుంచికొని,

గొంగడి ముసుగుతో - గూను వంచికొని,
యుంగరముల కట్టె - యూతజేసికొని,

కసరుచు రెండు కు - క్కలు వెంట రాగ,
ముసలిది యున్నట్టి - ముంగిటి కపుడు

పోయి, తా దాని న - ప్పుడు గాన కలిగి
యా యెద తరిగొంద - హరి సేయు పనుల

కొరకు గోపెమ్మతో - కొట్లాడుచోటి
కరిగి యిట్లనియె కో - పావేశమునను:

1. 'గౌడు' అనునది ఒక పట్టపుపేరు. కొంత స్థితిమంతులైన గొల్లవారిపేర్ల చివర 'గౌడు' పదమును చేర్చుట నేటికిని రాయలసీమ ప్రాంతమున వ్యవహారములో నున్నది. అట్టి 'గౌడు'లు గొల్లవారిలో కులపెద్దలుగా వ్యవహరించుటయు గలదు.

## దర్వు అటతాళం

వోశోశి ముసిలాపె! - వోశోశి ముసిలాపె!
వోశోశి ముసిలాపె! - వో ముసిలాపె! ॥పల్లవి॥

కూశికూశి మన - గోపెమ్మతోడ నా
క్రోశముతో నీవు - కొట్లాడేదేమే? ॥వోశోశి॥ ౧

కమ్మగా నంబిలి[1]- గాశే కోడండ్లాతో
నెమ్మెలు శేసూత - నిందుండావేమే? ॥వోశోశి॥ ౨

నాకు కడుపులోన - నాకిలౌ[2]తుండాది
నీకు భయము లేక - నే యుండావేమే? ॥వోశోశి॥ 3

సక్కగ తరిగొండ - సామివూజ శెయ్య
కిక్కడనే వుండా - రీ పాపమేమే? ॥వోశోశి॥ ౪

తే.గీ. అనిన విని గొడసాని యిట్లనియె: ముసలి
వాడ! కృష్ణుడు రేపల్లె వాడలోను
పుట్టినప్పుడె కాపురంబులు మునింగె
నావిధం బెట్టు లన్నను నీవు వినుము. 140

## దర్వు అటతాళం

ఇంకేటి కాపురమురా? వో ముసిలోడ!
యింకేటి కాపురమురా? ॥పల్లవి॥

యింకేటి కాపుర? - మీ వూళ్లో క్రిష్ణుడు
మంకువాడై నాతో - మల్లాడవచ్చినా
॥డింకేటి కాపురమురా?॥ ॥ఉ.ప.॥

---

1. 'అంబిలి'. ఇది 'అంబలి' కి వ్యావహారిక రూపము.
2. 'ఆకిలి'. ఇది 'ఆకలి'కి వ్యావహారిక రూపము.

పాలాకుండలు గొట్టి - బాలామణుల బట్టి
ఛీలల్ల! శిగ్గూలు - జెరచి గాబరజేశె ॥నింకేటి॥ ౧

యెరనాగి న్నలవాగి[1] - న్నిరుకుమానికాడ
కరచి బరికి అట్ల - గా [2] జేశినాడంట ॥యింకేటి॥ ౨

తరిగొండ నరహరి - దాడి మెండైనాది
పొరుగూళ్ల కైనాను - పోదాము వలసగా ॥నింకేటి॥ 3

వ. అనిన విని ముసలివాడు గోపిదేవితో నిట్లనుచున్నాడు: 141

తే.గీ. అమ్మ! గోపెమ్మ! మీకు మే(౦) మన్నుపన్ను[3]
నిచ్చి కాపుర మిందుంటి; మింక నుండ
వెరతు; మావులతోడ వేవేగ కృష్ణ
వలస బోయెదమమ్మ! యీ వాదులేల? 142

వ. అనిన విని యశోద యిట్లనుచున్నది: 143

ఆ.వె. గౌడ! నీకు ఇంత కోపమేటికి? (మీరు)
వలస బోవనేల? వలదు నిలువు;
దర్పకుండు మీ గృహంబుల కిక రాడు
పొండు! వీనివలన బోవనేల? 144

వ. అని పలికి, గౌనితోడ నందరికి వీడెంబు లిప్పించి యాదరించి గోపకాంతల నిండ్లకు పంపించి, తదనంతరంబున 145

## * నందసతి సందియము *

ద్విపద. అనుమానమున బొంది - యపుడా యశోద
తనయుని తొడమీద - తగ నుంచి, చుంచు

1. 'ఎఱ్ఱనాగి, నల్లనాగి - అను పేళ్లుగల గోపికలను' అని భావము.
2. 'ఆటలుగా' అని యర్థము.
3. 'నేలపన్ను (నివాస శుల్కము)'. అనగా ఒకరి స్థలమున వసించుచున్నందులకుగాను ఆ స్థలము స్వంతదారునకు చెల్లించెడి పన్ను. నందగోపుడు వ్రేవల్లె కధిపతి గనుక అందు నివసించు గొల్ల లెల్లరు యథోచితముగా అతనికి మన్నుపన్ను చెల్లించుచుండిరి.

చేతుల దువ్వుచు - చెక్కిళ్లు నిమిరి
'నా తండ్రి! యీ చిన్న - నాడు నీకింత

యారడి వచ్చె; నే - మందు నావిధిని?
యూరివారెల్ల ని - న్నువ్వతించినను

నే వినవలసె; నీ - వెత్తిన బ్రహ్మ
దేవు డీరీతి మో - దింపుచు[1] వ్రాసె'

నని యిట్లు తరిగొండ - హరి నాదరించి
చనుబాలు ద్రావించి - జాలితో ననియె:

## దర్వు, నీలాంబరిరాగం, ఆదితాళం

నా తండ్రి! యిందరికి వెరచి, భూ - తాతీత! నే నిన్నెందు దాతురా?
॥హా॥ యేమి సేతురా? ౧

మెచ్చుతున్న సతులాకు నీ - మీద నింత మాత్సర్యాము హెచ్చెరా!
॥హా॥ యింత వచ్చెరా! ౨

శ్రీకర తరిగొండ నార - సింహుతోడే నీ వింకెందు బోకరా!
॥హా॥ దూరు దేకరా! 3

తే.గీ. అనుచు కృష్ణుని నీరీతి నాదరించి
కన్నులను నీరు నించి, ముఖంబు నిమిరి
యేమి దోచక రోహిణిన్ బిలిచి (మిగుల)
జాలితో నిటుబల్కె నాశ్చర్యముగను: 146

సీ. ఓ రోహిణిదేవి! యొకమారుగాకుండ
పలుమారు నా గొల్ల భామలెల్ల
పలికిన పల్కు లేర్పడ దబ్బరనరాదు,
బుడుత డాయిండ్లకు బోనులేదు,
కావున నిజమేది? కల్లయే? దీమాయ
తెలియ దెవ్వారికి; దేవు డెరుగు;

---

1. 'మోదుచు (కొట్టుచు)' అని యర్థము.

ఎన్నాళ్ల కో నేను కన్న బిడ్డకు లేని
  నింద వచ్చుటకు నా డెందమెల్ల

తే.గీ. వెన్నకైవడి గరగుచు నున్నదిపుడు,
గోపికల నేరమందునా? కొడుకు నేర
మందునా? రెండు దెలియలేదమ్మ! నాకు
తెలుపు నీవైన నొకమాట తేటగాను. 147

(వ. అనిన విని రోహిణీదేవి యశోదతో నిట్లనుచున్నది:) 148

## ఏలలు*

దబ్బారా లాడారు గోప - తరుణులూ; వీ డెందుబోలే
దబ్బబ్బా! యిదేమో తెలి - యావే వోహెూ యశోదా!
యద్భూతమై తోచుచున్నాదే! ౧

యీ ముద్దూ కృష్ణునివలెనే - యేభూతామో యీవూరిలో
తా మహిమా జూపూచు - న్నాదే వోహెూ రోహిణీ!
తథ్యామిది దబ్బారా గాదే! ౨

ఆ మాయా నివారాణా మిం - దయ్యేటందూ కందారామూ
గ్రామాజాతర జేయిం - తామే వోహెూ యశోదా!
గంగాకు బోనామూ లిత్తామే! 3

ఉరగాశైలాధీశుడైనా - తరిగొండా హరికీ మ్రొక్కి
త్వరగా నట్లానే జేయిం - తామే వోహెూ రోహిణీ!
తనయునీ నిందా దప్పింతామే! ౪

వ. అని నిశ్చయించి యా యశోద కృష్ణుని యేమరక నాదరింపు చుండగా, అందొక్కనాడు కృష్ణుడు వ్రేపల్లెలోకి దాడివెడలి పోవుచున్న జూచి యశోద యిట్లనుచున్నది: 149

---

* ఇందు రోహిణీయశోదల సంభాషణ కలదు.

## దర్వు

ముద్దుకృష్ణా రారా! వెన్న - ముద్ద లిచ్చే కోరా! ॥పల్లవి॥

హద్దు విడిచి నీవెందు బో - వద్దు వద్దు రారా! ॥ఉ.ప.॥

పొరుగిండ్లాకు బోయి లేని - పోరు దేక రారా!
యిప్పు, దరసి యింట్లో రామునితో - నాట్లాడుదు రారా!
॥ముద్దు కృష్ణా!॥ ౧

పొరుగిండ్లాలో పొంచి పెద్ద - బూచీ వుంది రారా!
గోల్ల బరికీ బరికీని బొజ్జంతా - కరిచిపొయ్యీ[1] రారా!॥ముద్దు కృష్ణా!॥ ౨

బొజ్జా వాడెను పాచాలు - బువ్వా బెట్టే రారా!
మొల, గజ్జాలు వదలీనావి - గట్టిగ గట్టే రారా! ॥ముద్దు కృష్ణా!॥ ౩

పరువు లెత్తితేను నిన్ను - పట్టలేను రారా!
గొల్ల, గరితాలు గొట్టేరు; బొజ్జ - కందవాడా రారా! ॥ముద్దు కృష్ణా!॥ ౪

తరిగొండహరితోడే కడప - దాటిపోక రారా!
వోరి, దురుసూగా పరువులెత్తక - తులువాబిడ్డా రారా!॥ముద్దు కృష్ణా!॥ ౫

వ. అని పలికి, కొడుకు నొడిసి పట్టికొని, బలభద్రునితో నాట్లాడుమని నియమించిన, రాముణ్ని జూచి కృష్ణుం డిట్లనుచున్నాడు: 150

## దర్వు*

అన్నా! యింతో కన్నాముచ్చీ - లాలుదాము లాలా! ॥పల్లవి॥

వోరీ, చిన్ని తమ్ముఁరా! - కండ్లూమూశే నిందు లాలా!
॥అన్నా! యింతో॥ ఉ.ప.॥

అడరగా నిచ్చోట చిడుగూ - డారుకుందాము రారా!
గుడుగుడుగుంతా మారుకుంతా - కూచుందాము రారా! ॥అన్నా!॥ ౧

---

1. 'కరిచిపోవును సుమా!' అని బెదరింపుతో కూడిన హెచ్చరిక.
*ఇందు శ్రీ కృష్ణబలరాముల ముచ్చట (సల్లాపము) కలదు.

చిట్లబట్లా కాయారాను[1] - చేతులు జాచీ రారా!
గిరి,గిట్లాడుద మిందూ - గిరగిర దిరుగా రారా! ॥అన్నా!॥ ౨

కుందికుంది యాట లారు - కుందా మిందు రారా!
మన, మందమైన గచ్చకాయ - లారుదాము రారా! ॥అన్నా!॥ 3

పరువూ లెత్తి వొకరీ వొకరు[2] - పత్తుదాము రారా!
మన, తరిగొందా నారచిమ్మని - తాకుదాము రారా! ॥అన్నా!॥ ౪

## * మృద్భక్షణము *

వ. అని యివ్విధంబున రామకృష్ణు లాట్లాడుచు ముద్దులు జూపుచుండి; రంత నొక్కనాడు కృష్ణుండు మృద్భక్షణంబు జేయుచున్నం జూచి, రాముడు యశోదతో నిట్లనుచున్నాడు: 151

ఉ. తల్లి యశోద! కృష్ణు డల తావుల తావున జేరి ముదంబుమీరగా
నల్లని మంటిపెళ్లలను నవ్వుచు మెక్కుచునుండె నిప్పుడే,
కల్లని నన్ను దిట్టకుము; కంజదళాక్షుడు వెన్నదిన్న నో
రెల్లను మన్ను మెత్తికొనె; నీడకు బిల్వవె! నీవు జూడవే! 152

వ. అనిన విని యశోద కృష్ణుని చేరబిల్చి యిట్లనుచున్నది: 153

## ఏలలు*

మన్నూ నీవూ దిన్నావాని - మన రామూడూ జెప్పినాడూ
పన్నూగా నిక్కామేనేమిరా? - వో ముద్దూకృష్ణా!
-భయపడాకా నాతో జెప్పారా! ౧

జున్నూ పాలూ నెయ్యి వెన్నా - తిన్నా నోతా చీ! పీరా[3] నే
మన్నూ కోరి తిందూనంతావే? వో యచోదమ్మా!
- అన్నా వూరి క్కన్నాలు పోవే! ౨

---

1. 'చిట్లబట్లాకాయాడాను' - అనగా 'చిట్లబట్లకాయ' అను ఆట ఆడుటకు.
2. 'ఒకరి నొకరు' అని యర్థము.
*యశోదాకృష్ణుల సంవాద మిందు వర్ణింపబడినది.
3. 'ఛీ! పీడ' అని యర్థము.

వోరీ! రాముడన్నామాట - వుత్తామాటంటి వట్టైతే
భోరూనా నీ నోరూ దెరువారా! వో ముద్దూకృష్ణా!
- పాలువూమీరా నేనే చూచేరా! 3

శ్రీ తరిగొండా వరానారా - చిమ్మచ్చామీతోడే! మన్నూ
నే తినాలేదూ, తిత్తానావే?[1] వో యచోదమ్మా!
- నీవూ నానోరంతా చూరావే! ४

వ. అని కృష్ణుండు నోరు దెరచి అనేక కోటి బ్రహ్మాండంబులు తన నోట జూపిన, యశోద భయభ్రాంతయై రోహిణితో నిట్లనుచున్నది: 154

ద్విపద. ఇది యేమొ రోహిణి! - యీ చిన్ని శిశువు
వదనంబులో ధర - వన, వహ్ని, పవను,

లాకసంబును, మహ, - త్వాహంకృతులును,
లోకపాలకులును, - లోకముల్, నదులు,

వనధులు , దీవులు, - వన, పర్వతములు,
ఘన సూర్య, సోమ, న - క్ష త్ర పంక్తులును,

పొసగ చరాచర - భూత జాలములు,
పసమీర గలిగిన - బ్రహ్మాండ తతులు

చూచితి; నటుగాన - సుతుడు వీడనుచు
చూచుట దోష, మ - చ్చుగ వీడు పరమ

పురుషుం డనుచు నెంచి - పూజించి మ్రొక్కి
పరమ పదంబున - ప్రాపింపవచ్చు;

నర్భకుడని వీని - నల్లిబిల్లిగను
నిర్భయంబున నెత్తి - నే సాకుచుంటి,

---

1. 'తింటానావే?' - అనగా 'తిననే తిన' నని భావము.

నాపాలి తరిగొండ - నరసింహుఁడితఁడు;
పాపఁడుగాఁడన్న, - బలభద్రు తల్లి

తనలోనె తా నద్భు - తంబు నొందుచును
దనరార నా యశో - దకు నిట్టు లనియె:

ఆ.వె. భ్రాంతిపడితివేమొ బాలుని వదనమం
దిన్ని గలిగియుండు టెందు గలదు?
పరమ పురుషుడేడ? పసిబిడ్డ డేడ? నీ
వుప్పతింపవలవ దో యశోద! 155

వ. అని పలుకుచున్న తల్లులమీద వైష్ణవమాయ గప్పి, పూర్వ నిశ్చయంబును మరపించి, కృష్ణుం డాట్లాడుచుండె; నంత నొక్కనాడు యశోద పెరుగు జిలుకు చుండగా కృష్ణుం డిట్లనుచున్నాడు: 156

దర్వు (జావిడి)

అమ్మయ్యా చాచీవే! నా బొ - జ్జంతా వారెనూ[1] ॥పల్లవి॥

పెరుగు, గుమ్ము గుమ్మమంతా చిలుకు-కుంతావుంతే యెత్తనే?
॥వో యమ్మయ్యా ॥ ఉ.ప.॥

మజ్జిగా చిరాకవద్దు - మంచాముమీదా గూచుంది[2] ॥యమ్మయ్యా॥౧

వులులుక్కి పానూలు జేత్తా - వుంతే కోపాము వత్తుంది ॥యమ్మయ్యా॥౨

తరిగొందాచామీతోరే! నే - తాళలే వాకాటిచాత ॥నమ్మయ్యా॥ 3

★ వెన్న దొంగ ★

వ. అని కవ్వంబు బట్టి చిలుకనియ్యక చలంబుజేసిన, కొడుకును తొడపైనిడికొని చన్నిచ్చు సమయంబున పాలు పొంగిన చల్లార్చుటకు కొడుకు నందుంచి యశోద లేచిపోయిన, కృష్ణుండు దధికుంభంబులో

1. 'వాడెను' అని యర్థము.
2. 'గూర్చుండి' అని యర్థము.

వెన్నమెక్కి తత్కుంభంబు పగుల నడంచి, పొరుగింటి కురికి వారి వెన్నముద్దలు మెక్కుచు కోతి కిచ్చుచున్న సమయంబున పోయిచూచి యశోద యిట్లనుచున్నది: 157

ద్విపద. ఓరి ముద్దులవాడ! - యోదుండగీడ!
యోరోరి! తరిబాన - యొప్పలు [1] జేసి

వచ్చి నవ్వుచు నూరి - వారింటి వెన్న
ముచ్చిలింపుచు కోతి - మూతి కిచ్చెదవు,

చిన్నవాడని కొట్ట - చెయ్యాడ కేను
నిన్ను మన్నింపగా - నీ వింత మించి

తలకొని గోపకాం - తలు జెప్పినటుల
చెలరేగి దుడుకులు - జేయుచున్నావు;

సహజ బాలుడ వీవు - సర్వదా గావు,
మహిమల పోకిళ్ల - మారి వైనావు,

గుణము చేపట్టక - కొడికెక్కినావు[2];
గుణశాలిపోలికె - గునిసియాడెదవు,

గుణివియు గావు, ని - ర్గుణుడవు గావు
గుణహీన ! నిన్నెట్ల - గురిసేయవచ్చు?

గణుతించి యేవేళ - గాచుకయుండి
క్షణ మేమరితివైన - జరిగిపోయెదవు,

చిక్కించుకొనను పొంచిన వారికెల్ల
చిక్కుదువా నీవు? - చిక్కులమారి!

---

1. 'వ్రప్పులు' అను దానియొక్క వ్యావహారిక రూపము. 'వప్పులు' అని నందురు.
ఉదా: టెంకాయ వప్పులు.
2. 'కొడి' యనవగా 'అగ్రము, పై భాగము' అని యర్థములు. (చూ.బ్రౌణ్యనిఘంటువు. ప్రథమ ముద్రణ, పుట 272).
'కొడికెక్కుట' యనగా 'పరాకాష్ఠ నందుట' యని తాత్పర్యము.

చిక్కితి విపుడు నా - చేత బొంకించి
యెక్కడ బోయెద - వింక మీదటను?

పెట్టు సంజీవియౌ - బిడ్డల కెల్ల,
పెట్టు (న) గాని చె - ప్పినమాట వినరు.

తాళుతాళుర! నిన్ను - తాటించునట్టి
వేళ వచ్చునటంచు - వెరపించి పలికి,

తనచేతి సెలగోల - తగ ఝళిపించి,
పనిబూని కృష్ణుని - పట్టబోయినను

తరిగొండహరి యశో - దకు చాల వెరచి
పరువు బారుచు, బగ్గ - పడుచు[1] నిట్లనియె:

## దర్వు

అమ్మా! నన్నూ కొత్తారాకవే! - ॥పల్లవి॥

అమ్మమ్మ యశోదమ్మా! నన్ను కొత్తరాకవే!
నేను, సమ్మతమునా యింతోనే చాచి దాగుచుంతాగాని
॥అమ్మా! నన్నూ ॥ఉ.ప.॥

పొందుగా పాచాలుబువ్వా - బొజ్జనిందా బెత్తితే నే
నెందు బోకా యింతో వుంతా - నే! అమ్మా! యశోదమ్మా!
॥అమ్మా! నన్నూ॥ ౧

'చిన్నావారా! ర' మ్మనుచు - చేతిలో నీవు బెత్తినా
వెన్నాముద్దా దింతావుంతా - నే! అమ్మా! యశోదమ్మా!
॥అమ్మా! నన్నూ॥ ౨

పూలీవాలీ యింతికి నే - నోలల్లా! పోలేదుగాని
పూలికె యింతోనే వుంతా - నే! అమ్మా! యశోదమ్మా!
॥అమ్మా! నన్నూ॥ 3

---

1. 'బ్రతిమాలుచు' అని యర్థము. ఈ యర్థమున 'బంగపోవు' అను వ్యవహారము నేడును కలదు.

మాత్తారుతా అన్నతోనూ - చిత్తాబత్తా కాయారూచు
తొత్తాలో[1] నే నూగుచుంతా - నే! అమ్మా! యశోదమ్మా!
॥అమ్మా! నన్నూ॥ ౪

నా తోరే! శీతరిగొందా - నారచిమ్మచ్చామి తోరే!
నీ తోరే! నే దురుకు చాయ - నే! అమ్మ! యశోదమ్మా!
॥అమ్మా! నన్నూ॥ ౫

వ. అని వెరచి యురుకుచున్న కొడుకును తరిమిపట్టి, కొట్ట చెయ్యాడక రోటికి కట్టి వేసిపోయి, గృహంబులో పనులు జేయుచున్న సమయంబున. 158

## * నలకూబర మణిగ్రీవులు *

ద్విపద. హరి రోట బద్ధుడై - యందిందు జూచి,
వెరచినట్లనె యుండి - వేగ రో లీడ్చి,

మునుపు నారదు శాప - మున మణిగ్రీవు
డనువాడు, నలకూబ - రాభిధానుండు

సంగడి మద్దులై - జనియించియున్న
నంగజగురు డప్పు - డా రెంటి నడుమ

దూరి రోలీడ్వ, మ - ద్దులు గూలె; నందు
వేరుగా నమ్మహా - వృక్షరాజముల

లోనుండి సిద్ధులా - లో వచ్చి మ్రొక్కి
యా నీరజాక్షున - కపు డిట్టు లనిరి:

## దర్వు

దండమూ స్వామి! దండమూ ॥పల్లవి॥

పుండరీకాక్ష! బ్రహ్మాండ భాండోదర! ॥దండమూ॥ ఉ.ప.॥

---

1. 'తొట్లలో' అని యర్థము.

నీ పాదములు సోక - గా పాప మణఁగె; మా
శాపము దీరె వో - గోపాల విగ్రహా! ॥దండము॥ ౧

మునుపు నారదు శాప - మున వృక్షరూపము
లను బూనియున్న మ - మ్మనసి బ్రోచిన స్వామి!
॥దండము॥ ౨

తరిగొండాధిప! శేష - గిరివాన! నీపాద
స్మరణ మా కొసగు భా - స్వర సచ్చిదానంద! ॥దండము॥ 3

వ. అనిన విని హరి సిద్ధులతో నిట్లనుచున్నాడు: 159

ద్విపద. వినుడు గుహ్యకులార! - విశదంబుగాను
మనుజులు దుర్మదో - న్మత్తులుగాక

తమ తమ ధర్మముల్ - దప్పక సర్వ
సములౌచు నను నమ్మ - శాంతచిత్తులకు

అలర సాక్షాత్కార - మై కర్మబంధ
ముల ద్రెంచి, చూపుదు - మోక్షంబు; నన్ను

తలచనివారి నే - దలచ నెన్నటికి;
నలలిత హృదయుడై - చరియించు దేవ

మునివాక్యమున జేసి - మొనసి నన్ దలచు
మనము మీకబ్బె; ని - ర్మలులైతి రింక

జనుడన్న, తరిగొండ - స్వామికి మ్రొక్కి
చనిరి వారలు ధనే - శ్వరుని దిక్కునకు.

వ. అప్పుడు వృక్షంబులు పడిన చప్పుడు విని వచ్చిన నందాదులు
అందున్న వారితో నిట్లనుచున్నారు: 160

ఆ.వె. గాలి వీచలేదు, ఖండింపగా లేదు;
నేల వృక్షయుగము నేడు పడుట
కేమి హేతు? విప్పుడిచ్చట జూచిన
బాలులార! తెలియబల్కు డిపుడు. 161

వ. అనిన విని అందున్న బాలకు లిట్లనుచున్నారు: 162

ఆ.వె. బాలకృష్ణు డిపుడు రో లీడ్చుకొని చెట్ల
నడుమ దూరి రాగ, పుడమిమీద
గూలె మద్దు; లన్న కుఱ్ఱల వాక్యముల్
దబ్బరనుచు నవ్వి తడయ కపుడు. 163

ద్విపద. ఆ నందగోపకు - డబ్జాక్షు జేరి
పూనిన జాలితో - పొసగ నిట్లనియె:

చక్కని తండ్రి! యి - చ్చట నీవు చెలగి
చిక్కవం డ్రెవ్వరి - చే, తల్లిచేత

చిక్కితివే నేడు - చిన్నారి కృష్ణ!
ఇక్కడ రమ్మంచు - నెదను జేర్చికొని,

నెనరు రెట్టింపగా - నెమ్మోము నిమిరి,
తనయుని కట్టు న - త్తరి తాను పీడ్చి,

ప్రియము దీపింప నా - బిడ్డ నెత్తికొని
దయమీర నా యశో - దాదేవి కిచ్చి,

జిగిమీర కృష్ణుని - చెక్కిళ్లు నిమిరి,
నగుమోము దీపింప - నందు డిట్లనియె:

దర్వు*

దిట్టాతనమున ముద్దు - పట్టి మొలకు తాడు గట్టి
కట్టాడి![1] నీవెందు కిట్లా - కట్టిస్తి వేవే? ౧

వారివీరి యిండ్ల జేరి - దూరు దెచ్చితే వే ఏని
గారవింపక నీ రోట - కట్టి పెడితివి ౨

---

*ఇది నందయశోదాసంవాదాత్మకము.

1. 'కట్టడి!' - 'కఠినురాలా!' అని యర్థము.

తాడూ గట్టిన బొజ్జంత - దద్దు గట్టె నిందూ జూడు
చేదే! యింత బిగ్గా గట్టు - చెయ్యెట్లాడెవే? ౩

దుండాగీడై పొరుగిండ్లలో - దొంగిలించితే యీ సారి
గండూజీమ లుండే మాన - కట్టి వేతునా?[1] ౪

నన్ను గన్నాతండ్రి ముద్దు - చిన్ని బొజ్జ వాడీవుంది
మన్నించి నీ వింకనైన - వెన్న బెట్టవే! ౫

పన్నుగా యెవ్వారిండ్లకు - నన్ను విడిచిపోకవుంటె
వెన్న బెట్టేగాని, పోతే - వెన్న బెట్టనూ ౬

నా పాలి శ్రీ తరిగొండ - నరహరివరముచేత ౭
నీ పాపడు బుట్టి - నా డిట్లెందుకనేవే?

ద్విపద. అనుచు నందుడు బల్క - నా గోపిదేవి
కనుగీటి నగి, పతిఁ - గాంచి యిట్లనియె:

వీడు నష్టె మన - వెన్న బానంత
నేడు వప్పులు జేసి - నిగుడుచు పొరుగు

వారి యింటికి బోయి - వైపుగా చేతి
కూరటగా వెన్న - యుట్టందకున్న[2]

రోలు తిరుగవేసి - రూఢిగా నెక్కి,
మేలుమేలని యుట్టి - మీదటి వెన్న

ముద్దలు మర్కట - మున కిచ్చి, దాని
ముద్దు జూచును నందు - మురియుచుండగను

వెంట నే బోయి - వేగ జూచితిని.
మనయూరి గరితలు - మాటి మాటికిని

---

1. ఈ ప్రశ్నార్థకమునకు 'తప్పక కట్టి వేయుదును' అని భావము.
2. 'ఉట్టి + అందకున్న' అని విభజనము.

క్రమముగా వీని దొం - గతనంబు నాకు
నమర జెప్పచుమందు; - రదియెల్ల కల్ల

యనుచు నిన్నాళ్ళు కొ - ట్లాడుచునుంటి.
కనుగొంటి వీని దొం - గతనంబు నేడు

కావున బూచి కే - క్రమమునవైన
నే వీని బట్టిత్తు - నిశ్చయంబుగను,

హెచ్చరికెన్ జెప్ప - డింక మీరనుచు
ముచ్చటగా బల్కు - ముదితను జూచి

తనలోన నగుచు మో - దమున నందుండు
ననువంద తరిగొండ - హరి కిట్టు లనియె:

* బూచివాడు *

సీ. ఓ చిన్ని కృష్ణ! యీ యూరిలోనికి బూచి
వాడు నిన్ వెదకుచు వచ్చినాడు,
పొరుగిండ్లలో నీకు[1] పొంచుచునున్నాడు
బుడుత! నిన్ బట్టుక పోకపోడు;
మీయమ్మ చెంతనె మెలగుచు నీవుండు,
మెవ్వరిండ్లకు బోకు, మింకమీద
పోయితే నా బూచి బుస్సని నీ మీది
కెగచి కరిచిపట్టి యెత్తి కొనుచు

తే.గీ. పోవునని ముద్దు కృష్ణుని బుజ్జగించి
ప్రియ[ము] మీర యశోద కోపించి[2] నందు
దరిగె; నటు మీద శ్రీకృష్ణు డమ్మచెంత
నొనర నాట్లాడుచుండి యందొక్కనాడు. 164

1. 'నీకొరకు' అని యర్థము.
2. 'యశోదను కోపపడి' అని యర్థము.

ద్విపద. చిన్నారి కృష్ణుండు - సెలగోలచేత
పన్నుగా బట్టి యం - బయు గానకుండ

నలరుచు నొక మూల - నరిగి యచ్చోట
జలపూర్ణమగు కల - శముమీద వంగి,

తన ప్రతిబింబంబు - తా జూచి వెరచి,
తనువెల్ల కంపింప - తబ్బిబ్బుపడుచు,

తనతల్లి చెంతకు - తడయక వచ్చి,
కనుల బాష్పము లొల్క - గా నిట్టు లనియె:

దర్వు (జావిడి)

బూచివా రీరకు వచ్చెనమ్మా!
యచోద! నన్ను, దాచిపెత్తు దాగియుంతనమ్మా! ౧

నే నవ్వితే తా నవ్వుతారమ్మా!
నే కొత్తబోతే, తాను నన్ను కొత్తవత్తారమ్మా! ౨

నే నొంగితే తా నొంగుతారమ్మా!
నేను లేత్తేను, తాను లేచి నిలువబరతారమ్మా! ౩

నేను జూత్తే తానూ జూత్తారమ్మా!
నే వెక్కిరిత్తే, తాను నన్ను వెక్కిరిత్తారమ్మా! ౪

తరిగొంద నారాచిమ్ము రోయమ్మా!
యా బూచివాని, తరిమి తరిమి కొత్తవాలెనమ్మా! ౫

ద్విపద. అమ్మయ్య! బూచివా - రా నీళ్లలోను
నెమ్మదితో నేరు - నిలిచియున్నారు,

అల మాయబూచిని - అవల బోగొత్తి
సొలవక యానీళ్లు - జూపవే నాకు,

అందు వారుండక - నావల జనిన
నిందు నే నుందు; వా - రిందుందెనైన

నిక్కంబుగా నిందు - నే నుంద వెరతు,
తక్కక తరిగొంద - దాముతోరమ్మ!

## దర్వు

అబ్బబ్బా బూచీకి వెరతునమ్మా - యచోదమ్మా వో యబ్బబ్బా! ॥పల్లవి॥

యీ బూచీవా రింతో వుంతే - యారానైనా పొంచి వచ్చి
నా బొజ్జంతా కరిచిపొయ్యీ - నమ్మా యచోదమ్మా వో ॥యబ్బబ్బా॥ ౧

నా మీదానే కన్ను బెత్తి - నన్ను వారు చూచుతారు
నా మేనంతా వనుకూచున్న - దమ్మా! యచోదమ్మా! వో ॥యబ్బబ్బా॥ ౨

నా పాలి శీతరిగొంద - నారచిమ్మబ్బామీ వాని
నా మేనంతా వనుకూచున్న - దమ్మా! యచోదమ్మా! వో ॥యబ్బబ్బా॥ 3

ఆ.వె. అనుచు భీతి నొందినట్టి కృష్ణుని జూచి
నవ్వి యా యశోద 'నన్ను గన్న
వాడ! నిన్ను గొట్టవచ్చిన బూచివా
డెట్టివాడు? వెరవ కిపుడు జెపుమ'. 165

ద్విపద. అని గోపిదేవి త - న్నడిగిన, కృష్ణు
డనువంద నిట్లనె: నా బూచివాడు

అచ్చమైనటువంటి - యాణిముత్యముల
కుచ్చులు, బంగరు - కుచ్చులు మెరయ

కరమొప్ప నొక కొండె [1] - గత్తుకున్నాలు,
తరుచుగా వెల్గు ము - క్తాలలామంబు

ధాళధళ్యముమీర - ధరియించినాడు,
జాళువా తళుకుల - నందిదండలును

---

1. రాజులు లోనగువారు మొగముతట్టు వేసికొనెడు వెండ్రుకల ముడి. ( చూ.శ.ర.పుట 197).
చిన్నపిల్లలకు ముఖమువైపు వేసి చుట్టెడి జడను 'కొండె' యుందురు. 'కొండెజడ, కొండెసిగ' మొదలగునవి దీని పర్యాయ పదములు.

దనరార నాగబం - ధములు, కంకణము
లును, మణిముద్రిక - లును దాల్చినాడు,

వరదివ్య మణిహార - వారంబు తోడ
సరిపెణ పులిగోరు,[1] - సవరించి, బొజ్జ

వెలిగింప [2] మెరనింద - వేసుకున్నాడు,
తిలకంబు చొగచుగా - దిద్దుకున్నాడు,

బంగరు నరికత్తు[3] - బంధించి, దాని
చుంగుల పూల కు - చ్చులు గత్తినాడు,
లోచన యుగళ వి - లోలత దన్ను
చూచువారిని తాను - చూచుచున్నాడు.

నల్లని మెయివాడు - నవ్వుచున్నాడు,
చెల్లుగా చెలగోల - చేపత్తినాడు,

కొట్టబోయినవారి - కొత్తుచున్నాడు,
పట్టబోయినవారి - పత్తుచున్నాడు,

వా రెపు రెందుందు? - వా రేమి శేయు?
వా రేల యిచటికి - వచ్చియున్నారు?

మొనసి తెల్పుమటంచు - ముద్దుగా నడుగ
విని, తల్లి నగి సుతున్ వీక్షించి పలికె:

## దర్వు, కాంభోది (జి?) రాగం, ఆట తాళం

నిర్వాణుడై మింట - నిలిచి యంద[రికి]ముద్దుకృష్ణా!
వాడు, పూర్వమందే మాయ - బూచిని గన్నాడు
ముద్దుకృష్ణా!౧

1. 'పులిగోరు అమర్చిన సరిపెణ (బంగారు గొలుసు)'. దీనినే పులిగోరు పతకమనియు నందురు.
2. ఇచ్చట 'వెలిగింపన్' ప్రేరణార్థకము కాదు. ఇది 'మేలిల్లు, రంజిల్లు' అనువానివలె స్వార్థకము. 'ప్రకాశింపగా' అని యర్థము.
3. 'నడికట్టు'.

వాని బూచిని మేము - వారించినందూన ముద్దుకృష్ణా!
పూని మమ్మే మ్రింగి - పోవచ్చినాడురా ముద్దుకృష్ణా! ౨

ఆ బూచి తరిగొండ - హరి వానమైయుంది ముద్దుకృష్ణా!
నా బొజ్జ! నీ వెందు - నను వీడిపోవద్దు ముద్దుకృష్ణా! ౩

ద్విపద. అని బూచివృత్తాంత - మపు డా యశోద
తనయుని కెరిగించి - తగ నిట్టు లనియె:

నా యన్న! వినుమింక - నను నీవు విడిచి
పోయితివైన ని - ప్పుడు నీళ్లకడవ

లోపల నీవు వి - లోకించినట్టి
గోపాలబూచి నిన్ - గొట్టకపోదు,

తరిగొండహరి తోడె - దబ్బరగాదు
పొరుగిండ్ల కిక నీవు - పోకురా కృష్ణ!

వ. అనిన తల్లితో కృష్ణు డిట్లనుచున్నాడు:) 166

ఆ.వె. నీళ్ల కడవలోను నేడున్న బూచిని
చూచి వెళ్లగొట్టి, బూచి లేని
నీళ్లు నాకు జూపు; నిజముగా నందాక
నమ్మి యిచట నుండనమ్మ! నేను. 167

(వ. అనగా యశోద యిట్లనుచున్నది ). 168

ఆ.వె. నీళ్లకడవ మరల నీవు చూచిన, బూచి
వాడు మళ్లి కానవచ్చు నీకు
గాన, నీళ్ల కడవలో నీవు జూడక
యుంటివైన బూచి యురుకు కృష్ణ! 169

వ. అని పలికి కొడుకు నాదరింపుచుండె; నంత నొక్కనాడు యశోదతో
కృష్ణుండిట్లనుచున్నాడు: 170

## దరువు (జావిడి)

నీవూ నన్నూ పొరుగింటికీ - పోవద్దంతావూ
యింతో, నేవేళాకు పొద్దూగూక - దేమి యంతావూ? ౧
నవ్వించే వూకుడు గత[1] - నాకు జెప్పవే!
నే, నెవ్వారింద్ల కింక బోక - యిందె వుంతానే! ౨
తరిగొందా ధాముని కత - తగ జెప్పవే!
యిందు,నరలేకా యశోదమ్మా న - న్నాదరింపవే! 3

## * ఊకుడు కత *

ద్విపద. అని కథ చెప్పు నీ - వని కృష్ణు డడుగ
విని యశోదాదేవి - వేడ్క నిట్లనియె:

వినర పుత్రక! పూర్వ - వృత్తాంత మొకటి
యనువంద భువి రాము - డను మహారాజు

నరులెన్న దశరథు - నకు పుత్రుడగుచు
ధరణిపై జనియించి - తా బాల్యమందె

యురురాక్షసాంగన - నొక్క బాణమున
పొరిగొని, తగ గాధి - పుత్రుడు జేయు

సవనంబు రక్షించి - జనకుని యింట
శివుని చాపము ద్రుంచి - సీత జేకొనియె,

నని(న) కృష్ణుడు ముద - మంది యూకొనియె;
జనకుడు బంపగా - జని మార్గమందు

పరశురాముని బాహు - బలమార్చి, యాత్మ
పురిజేర సతిగూడి - పోయి యచ్చోట

జనకాజ్ఞ గైకొని - జనక నందనయు
ననుజుడు గొల్వ మ - హారణ్యమునకు

---

1. 'ఊకుడు కథ'. ఊ కొట్టుచు వినెడు కథలకు 'ఊకుడుకథ'లను వ్యవహారము చిత్తూరు మండలమున ఈనాటికిని కలదు.

నరిగెనటన్న మే - లనుచు నూకొనియె;
వరమునులకు 'దైత్య - వరుల నందరిని

అని ద్రుంచి మిము బ్రోతు - ననుమానపడకు'
దనుచు క్రమంబుగా - నభయం బొసంగి

చని పంచవటి నివా - సము జేసియుండె,
నని పల్క సరిసరి - యనుచు నూకొనియె;

నట రావణుడు బంప - హరిణమై పంచ
వటికి మారీచుండు -వచ్చిన, సీత

మృగము గావలెనన్న - మేలు గ్రహించి
తగ ధనుర్ధారియై - తమ్ముని నచట

కావలి బెట్టి, మృ - గంబు వెన్వెంట
పోవుచుండెను రఘు - పుంగవుం డనుచు

చెప్పిన విని నవ్వి - చెలగి యూకొనియె;
నప్పుడు వివిధ ప్ర - యత్నముల్ జేసి

పట్టబోయిన, పట్టు - బడినట్టెయుండి
పట్టుపడక మాయ - ప్రకటించికొనుచు

ఘోరశైలములకు - గొనిపోవ, నతడు
శూరుడై, యిది యెందు - చొరగల? దనుచు

పటుతరాంబకముచే - ప్రాణముల్ గొనగ,
కుటిలాసురుడు నేల - గూలుచు నొరలి

'హా లక్ష్మణా! సీత!' - యని పిల్వ,సీత
యా లక్ష్మణుని జూచి - 'యన్న! మీయన్న

కడకేగు' మన, భ్రాతృ - కాంతాజ్ఞ బూని
యడవిలో జనుచుండె - నన్నకై యనుచు

తెలిపిన, మదిని చిం - తించి యూకొనియె;
వెలయగా సన్న్యాసి - వేషంబు పూని

దశకంతు డరుదెంచి - తన శతభాగ్య
దశగూల వంచించి - తరమిడి[1] ధరణి

తనయను బట్టి ర - థంబుపై బెట్టి
కొనిపోయె; ననిన భ్రూ - కుటి కుటిలంబు

గాజేసి, రోషసం - కలిత రక్తాక్షి
తేజః పరంపరల్ - దిక్కులు నిండ

గా మించి లేచి హుం - కారంబుజేసి,
'సౌమిత్రి! తే శర - చాపంబు' లనుచు

నట్టహాసముజేసి, - యపుడా యశోద
పట్టిన నిల్వక - బాలు డిట్లనియె :

## దర్వు, ఆది తాళం

తేరా లక్ష్మణ! - తే విల్లమ్ములు ॥పల్లవి॥
ధారుణిసుత గొని - దనుజుడు చనె నిటు ॥తేరా లక్ష్మణ!॥ఉ ప.॥

దశకంధరు ని - ర్ధరపై గూల్చెద
శశినిభముఖియగు - జానకి దెచ్చెద ॥తేరా లక్ష్మణ!॥ ౧

అదె చనుచున్నా - డదిగో! దనుజుడు
కొదుకక ధరపై - గూల్చెద నిప్పుడు ॥తేరా లక్ష్మణ!॥ ౨

తరిగొండ నృకే - సరి నేనైనను[2]
సురరిపు నిక్కడ - సూటిగ గూల్తును ॥తేరా లక్ష్మణ!॥ 3

---

1. 'వరుసబెట్టి' అని యర్థము. (చూ. ఆంధ్రక్రియాస్వరూపమణి దీపిక,పుట479). 'క్రమముగా' నని భావము.
2. ఇది ప్రతిజ్ఞార్థకము.

ద్విపద అని యిట్లు బాలకు- డార్భటింపుచును
మొనసి వీరావేశ -మున నటింపుచును

అట్టహాసముజేయ, - నట్టి నందనుని
పట్టజాలక భీతి - పడి యా యశోద

యిట్టి వీరావేశ - మితని కీవేళ
బుట్టె నింకెట్లని - బుద్ధి చింతించి,

జలజాప్తకులు డంత - జలజాప్త సుతుని
బలముతో నంభోధి - బంధించిపోయి,

లంక ముట్టడిబెట్టి - లలి దశాననుని
మంకు రక్కసులను - మహి గూలనేసి,

ప్రేమతో నచట వి - భీషణు నుంచి,
భూమిజ గైకొని - పొనగ సాకేత

పట్టణమున జేరి - భరతు చేపట్టి,
పట్టాభిషిక్తుడై - ప్రజల పాలించె;

నని పల్క విని శాంతు - డగుచు కృష్ణుండు
తన తల్లి తొడమీద - తాను గూర్చుండె.

వ. ఇట్లు కూర్చున్న ముద్దుకృష్ణుని జూచి యశోద యిట్లనుచున్నది: 171

## ఏలలు*

రావాణు డాపాహరించె - నా వైదేహి ననగానే నీ
వావేశామాడీతివేలారా? వో ముద్దుకృష్ణా!
- నీవు రాముడావేనేమిరా? ౧

జనకజానూ గోంపోయానూ - చపలాచురూ డంతా నీవూ
ననుతాకూ నాకూ చిగ్గాయానే! వో యచోదమ్మా!
- అపురే రాముని చివమూ వచ్చెనే! ౨

---

*ఈ యేలలు యశోదాకృష్ణ సంభాషణాత్మకములు.

పరగా శివమూ వచ్చినపుడూ - బాగా మాటాలాడితివి
తిరుగా ముద్దూమాటాలేవిమిరా? వో బాలాకృష్ణా!
- తేటగానే మాటలాడారా! 3

ఆ రాముడావేచాములో - నత్తా మాతా లారినారూ
నోరూ నా కిప్పరూ తిలగాదే! వో యచోదమ్మా!
- కోరి నీవూ బాగా జెప్పావే! ४

నే నెంతా జెప్పినగానీ - నీకూ నోరూ తిరుగాలేదూ
పూని మందూ జేతూనేమిరా? వో బాలాకృష్ణా!
- పొగొట్టాకా తినేవేమిరా? ౫

నీవు జేచే మందూపేరూ - నిజమూగా నాతో జెప్పితే
నే వెలువాకాదీ[1] తింతానే! వో యచోదమ్మా!
- నీతో లెస్సా మాత్తారుతానే! ౬

మెరయూ తారీగొండా న్నహరీ - మీదానే భారాము వేసి
మరువా కే మందైనా జేసేరా! వో బాలాకృష్ణా!
- మందు పేరూ జెప్పరాదురా! ౭

ఆ.వె. 'నీవు మందు పేరు నిజముగా జెప్పక
మందు తినను నాకు మనచు రాదు,
కనుక జెప్పు' మనుచు కమలాక్షు డడుగగా 172
నా యశోద యిట్టులనియె నగుచు:

## దరువు*

నా యన్నా! పచ్చి వజైనా - నమలేవటరా కృష్ణా?
నీవు, నమలేవటరా కృష్ణా?
వో యబ్బా! కంపు వజా నే - నొల్లనే గోపెమ్మా! ౧

---

1. 'వెరువక + అది' అని విభజనము.
*ఇది యశోదాకృష్ణుల సంవాదముగల దరువు.

తెచ్చే[1]సరస్వతియాకు - తినేవటరా కృష్ణా?
నీవు, తినేవటరా కృష్ణా! ౨
పచ్చి యాకు తింతే చేదు - బాగుండ దోయమ్మా!
తగ చింతమానీ తేనైన - త్రాగేవటరా కృష్ణా?
నీవు, త్రాగేవటరా కృష్ణా?
తెగువగా తేనే, వెన్నిత్తే - తింతానే గోపెమ్మా! 3

వెన్నా వద్దు, తేనియ ద్రా - వించే రార కృష్ణా!
త్రా, వించే రార కృష్ణా?
యన్నా! వొత్తి తేనె దాగే - దెత్తానే గోపెమ్మా? ౪

పిప్పళితోడి తేనె దిని - పించే రారా కృష్ణా!
(తిని, పించే రారా కృష్ణా!)
అప్పప్పా! కారాము దిందు - రంతావే గోపెమ్మా? ౫

గురుతూగా మీగడ, పాలు - గ్రోలేవటరా కృష్ణా?
పాలు, గ్రోలేవటరా కృష్ణా?
తరిగొండాహరీతో రేనది[2] - తాగేనే గోపెమ్మా! ౬

## ★ కాళీయుడు ★

వ. అనిన విని నవ్వుకొనుచు యశోద గారవింపుచుండె; నంత కృష్ణుం డిట్లనేక బాలలీలలు జూపుచు, బృందావనంబున లేగల మేపుచు, వత్సబకాఘ ప్రముఖ రాక్షసులం జంపుచు విహరింపుచుండి, యొక్కనాడు గోగణంబుల దోలుకొని కాళింది మడుగునకు బోయి, కాళియ విషకలితతోయంబులం ద్రావి సొలిపడియున్న గోవుల, బాలకుల మరల బ్రతికించుకొని మందకు వచ్చినం జూచి, తద్వృత్తాంతంబు విచారించుకొని భీతిల్లి యశోద కృష్ణునితో నిట్లనుచున్నది: 173

---

1. 'తెచ్చేను' (తేగలను) అని యర్థము.
2. 'హరితోరు + ఏను + అది' అని విభజనము.

## ఏలలు*

మాతండ్రీ కృష్ణా! కాళిందీ - మడుగూదిక్కూ పోవద్దందూ
పాతాకానర్పా మున్నాదీరా! వో ముద్దు కృష్ణా!
- పైకి బుస్సూమాని యెగసీరా! ౧

పామూ పేరూ వినాగానే - భయమూ నొందుచుందూగానా
నే మించీ యందేలా పొయ్యేనే? వో యశోదమ్మా!
- నీ బొజ్జాలో దాగీవుంతానే! ౨

పిరికీవాడవూ నా తండ్రీ! - పరగా పసులా మేపే నంటా
పరువూబారుచూ పోవద్దు రా ! వో ముద్దూ కృష్ణా
- పట్టు గా నా చెంతా నుండారా! 3

తరిగొండా నారాసింహుని - మరుగూనా నే నుంతా గానీ
పెరుగూబువ్వా శానా బెట్టావే! వో యశోదమ్మా!
- పెద్ద వాణ్ణిగా నే పెరిగేనే! ౪

ద్విపద. అనుచు మాయలమాట - లాడి, గోపెమ్మ
మనము రంజిలజేసి - మధుసూదనుండు

మరునాడు వేడ్క న - మ్మడువున కరిగి,
వెరచి బాలకులు ని - ర్విణ్ణులై చూడ

సరిలేని బంగరు - చలడంబు దొడిగి,
సరిగె కుచ్చులతోడ - చాల వెల్గుచును

దట్టమైన తగు పట్టు - దట్టి బిగించి,
దిట్టడై మించి త - తీర్థంబునందు

ప్రబలిన ఘన కదం - బక భూజమెక్కి,
సబల కంఠీరవ - జవమున నెగసి,

* ఈ యేలలు యశోదాకృష్ణ సంవాదాత్మకములు.

క్రోధంబుతో మహా - కుధరంబు మార్కి
మాధవు దప్పద - మ్మడువులో దుమికె.

వ. ఇట్లు దుమికిన బాలకృష్ణుని కాళియోరగుండు గరచి, యతని దివ్యదేహంబునకు చుట్టుకొనియుండె; నంత యశోదాదులు అచటికి వచ్చి, పాముచేత చిక్కి కదలకున్న హరిని జూచి, అందు గోపగోపికా వ్రాతంబులు వాపోవుచున్నం జూచి రోహిణీయశోదలు తత్తరంపడుచు నిట్లనుచున్నారు: 174

దర్వు

పాముచేత చిక్కినాడు - బాలుడూ; మెదల డింక
యేమి సేతామమ్మా? మన - మేమి సేతామే? ౧

కట్లకట్లాపాము మేను - చుట్లూ చుట్టినాది, బిడ్డ
నెట్లా[1] యుండగాను బైట - కెట్లా దీతామే? ౨

'తరిగొండస్వామి ! వీని - దయతోను రక్షించు' మని
మురువొప్పా కరములెత్తి - మొక్కుకుందామే! 3

ద్విపద. అని పల్కి మరియు దుః - ఖా క్రాంతలగుచు
కనుమూసి మెదలని - కమలలోచనుని

గనుగొని పల్కి: ర - క్కట! కృష్ణ! నీకు
మునుపు వచ్చిన గండ - ములు దప్పిపోయె,

కడపటి కీ పాము - గాచుకయుండె
నడర నేటికి దైవ - మైన లేదయ్యె;

బాలక! నిన్నిది - బట్టిన వేళ
చాల భీతిలితివో? - సంకటపడితొ?

తామరసోదర ! - తలచితో మమ్ము?
ఏమిసేయుదుము? మే - మెటు తరించుదుము?

---

1. 'నట్లే' అని యుండిన అర్థము మరింత సుగమ మయ్యెడిది.

పాపంపు పెనుబాము - పట్టి మమ్మెన
కోపించి కరువక - కుర్ర! నిన్నేల

గరచె? నీ వుండినా - క్రమ్మర మమ్ము
కరుణచే బ్రతికింప - గలవు; మేముండి

నిను బ్రదికింపగా - నేర మో తండ్రి!
యనఘాత్మ! తరిగొండ - హరియైన శేష

శైలనాయకుడు మా - జాలి తా దెలిపి
బాలక! నిన్నిందు - బ్రదికించవలెర!

వ. అని పల్కి; రంత మరిన్ని యశోద యిట్లనుచున్నది: 175

దర్వు, ఆదితాళం

నా చిన్ని కృష్ణా! - నా యన్నా! ॥పల్లవి॥
యీ చందంబున - నీ నీరములో
నీ చెడుపామున - కెటు జిక్కితివో?
॥ నా చిన్ని కృష్ణా!॥ ॥ఉ.ప.॥

కట కట! ని న్నీ - కాకోదర మిపు
డిటు చుట్టెను; నే - నెటు విడిపింతుర?
॥ నా చిన్ని కృష్ణా!॥ ౧

నీ ముద్దులు, మరి - నీ జిగి నుద్దులు
నీ మురిపెంబులు - నే నెటు మరతుర?
॥ నా చిన్ని కృష్ణా!॥ ౨

తరిగొండ నృకే - సరి కరుణను మా
వెరపు దీర్చి నిను - విడిపింపగవలె
॥ నా చిన్ని కృష్ణా!॥ 3

ద్విపద. అని యివ్విధంబున - నపుడా యశోద
యును నెందు తా నుతు - వొయ్యన గాంచి

'హా వంశ భూషణ! - హా నోముఫలమ!
హా వీర! హా ధీర! - హా సత్కుమార!

మున్ను రాక్షసి వచ్చి - మోసంబు జేసి
చన్ను బాలనుచు వి - షంబిచ్చినపుడు

విష విజయుండవై - వెరవని నీకు
విషధిశయన! సర్ప - విషమెక్కె నకట!

నీ మంజు భాషలు - నీ వినోదములు
నీ మన్ననలు జూడ - నే డెందు బోయె?

మా జోలి లేక ని - మ్మాడ్కి మైమరచి,
యీ జల మధ్యమం - దిట్లున్న నిన్ను

కనుగొనుచుండియు - కాయముల్ విడువ
మనఘ! మాయంత క్రూ - రాత్ములు గలరె?

బిడ్డలు లేకనే - పృథ్వీతలమున
గొడ్డాల [1] మనిపించు - కొనియుండి, తుదకు

నీవంటి సత్కృపా - నిధిని పుత్రకుని
గా వేడ్కతో మేము - గన్నందు కేమి

గట్టు కొంటిమి? యిందు - గలిగి నీవేమి
గట్టుకొంటివి? కట్టి - కడ కిట్టులయ్యె.

మా ముద్దులయ్య! వో - మన్నారు కృష్ణ!
ఏమి సేయుదము? ని - న్నీ చిన్ననాడె

పాపాత్ములము మేము - పశువుల వెంట
మేప నంపితిమి నీ - మే లోర్వలేక,

మాకేల పశువులు? - మాకేల బ్రతుకు?
మాకేల తనువులు? - మా కేల సుఖము?

---

1. 'గొడ్డు + అలము' అని విభజనము. ఇది ఉత్తమ పురుష బహువచనము. 'అలు' శబ్దము పరమైనను, రుగాగమము రాకుండుట ఇందలి ప్రత్యేకత.

†కొదుకక వెంటనే - గొనిపావు మమ్ము'

అని పల్కి యిరువురు - హా! యని యేడ్చి
మనములు హరియందె - మగ్నముల్ జేసి

'పదపద మడువులో - బడుద' మటంచు
పదరి పోవుట జూచి - బలు డిట్టు లనియె:

ఆ.వె. తల్లి దండ్రులార! తత్తరమున మీరు
మడువులోన బడుట మంచిదగునె?
పాము నదరదట్టి పద్మాక్షుడిక వచ్చు
చూచుచుండు డింక శోకపడక. 176

## * దివ్య నాట్యము *

ద్విపద. అని పల్కుచుండగా - నంబుజాక్షుండు
తన దేహమును బెంచి - దందశూకంబు

చుట్టిన చుట్లు వీ - డ్చుచును, తత్పుచ్ఛ
మట్టహాసంబుతో - నలరి చేపట్టి,

దిట్టడై గిరగిర - ద్రిప్పి యచ్చోట
గట్టిగా బడవైచి, - ఘనతర యమున

లోపల మించు క - ల్లోల ఘోషంబు
లాలితమగు మర్ద - ళ ధ్వనిగాగ,

బృందావనములోని - భృంగాళిమోత
క్రందైన గాయక - గానంబుగాగ,

కలహంస శుక పిక - కలకల ధ్వనులు
సలలితమగు తాళ - శబ్దముల్ గాగ,

నాకమందుండి యా - నంద మింపొంద
జోకతో జూచెడి - సుత్రామముఖులు

†ఈ పంక్తికి ముందుండ వలసిన పాదమొకటి లేఖకుని ఏమరుపాటువలన లుప్తమైనట్లు ప్రాసమబట్టి స్పష్టపడుచున్నది.

సరసులై వీక్షించు - సభ్యులుగాగ,
సురుదివ్యమణిపట - లోజ్జ్వల కాంతి

మహిత కాళియఫణి - మంటపమందు
బహువిచిత్రంబుగా - పటునటుభంగి

నటియించె; వేల్పు లా - నంద మింపొంద
తటుకున భేరికా - ధ్వనులు మ్రోయించి,

కుసుమముల్ వర్షించి - కోలాహలముల
వెస ఘటించిరి తాళ - విధి దప్పకుండ,

వర తరిగొండ ని - వాసుడై శేష
గిరివాసుడగు బాల - కృష్ణుడు సల్పు

వింత నాట్యమునకు - వెరగు నొందుచును
సంతోష మొందిరి - సకల యాదవులు.

## దర్వు, ఆదితాళం

ఆడెనే! కృష్ణు - డాడెనే! ॥పల్లవి॥
పాడుచు నా గో - పకు లందరు తన
వేడుక జూడగ - వింతగ నగుచూ ॥ఆడెనే!॥అ.ప.॥

తతకిట తకఝుం - తధిమి ధిమిత యని
గతులు[1], చొల్లు[2] లతు - లితముగ మెరయా ॥ఆడెనే!॥ ౧

అలరుచు చిరు గ - జ్జెలు, నూపురములు
ఘలు ఘలు ఘలు ఘలు - ఘల్లని మ్రోయా ॥ఆడెనే!॥ ౨

---

1. నాట్యమున తాళానుగుణముగా అడుగు వేయుటకు 'గతి' యని పేరు. ఇది i. ఏకసరగతి . ii. ద్విసరగతి iii. త్రిసరగతి యని ప్రధానముగా మూడు విధములు. ఈ త్రివిధగతుల లక్షణములకు చూ. నృత్తరత్నావళి, vi వ అధ్యా,. 181 - 184 శ్లోకములు.

2. 'శొల్' అను ద్రావిడ శబ్దము దీనికి మూలము. 'చొల్లు' లనగా 'తతకిట, తధిగిణ' వంటి వాద్యజతులు . (Rhythm - Syllables). నాట్యసందర్భమున వీటిని ఉచ్చరించుట(Oral recitatoin) ను నృత్తరత్నావళికారుడు 'వక్త్రవాద్య' మని పేర్కొనెను ( చూ. నృత్తరత్నావళి, vii వ అధ్యా,. 12 శ్లో.)

ధాణు ధణంధణు - ధణిత యనుచు గీ
ర్వాణులు నభమున - వరుసగ బొగడా ॥అడెనే!॥ 3

మణిభూషణములు - మరి మరి కదలగ
ఘణ ఘణ యని మొల - ఘంటలు మొరయా ॥అడెనే!॥ ౪

తారి తకిణఝుం - తకకిణ తకఝుం
తారి తకిటతక - తాతై యనుచూ ॥అడెనే!॥ ౫

వర తరిగొండ ని - వాసుడు వేంకట
గిరి నిలయుండగు - కృష్ణుడు చెలగీ ॥అడెనే!॥ ౬

## * శరణాగతి *

ఉ. అప్పుడు కాళియోరగుని యంగన లా విధమెల్ల జూచి, బల్
తప్పెను కార్యమంచు పరితాపము నొందుచు కృష్ణుపాలికిన్
తెప్పున వచ్చి నిల్చి, బహుదీనత నొందుచు పల్కిరిట్లు: మా
తప్పు సహించి, కృష్ణ! యిక తాండవమాడక నిల్చిపోవవే!177

వ. అని మరిన్నిట్లనుచున్నారు: 178

## దర్వు (జావిడి)

శరణు శరణూ నందాకుమారా!
శరణు శరణూ ॥పల్లవి॥

శ్రీకర! దుర్జన - భీకర! వర మో
క్షాకర! పూర్ణ ని - శాకర వదనా! ॥శరణు॥ ౧

సుందర విగ్రహ! - మందరధర ! ముచు
కుందవరద! గో - విందా! ముకుందా! ॥శరణు॥ ౨

వరతరిగొండ ని - వాస! పరాత్పర!
గురుతర వేంకట - గిరివరనిలయా! ॥శరణు॥ 3

ద్విపద. శ్రీరమాహృదయేశ! - జితదానవేశ!
నారాయణాచ్యుతా! - నందకుమార!

నిగమాంత సంచార ! - నిరూపమాకార!
భగవంతుడగు నీదు - పదముల క్రింద

మడియుటె యితనికి - మంచిది; మాకు
కడలేని శోకంబు - గల్గును గాన

మము జూచి బ్రతికించు - మాప్రాణవిభుని,
కమలేశ! నీ పద - ఘట్టనచేత

కడు దస్సి రక్తంబు - గ్రక్కుచున్నాడు;
తడవాయె నిల్పు నీ - తాండవ మింక,

నాడు జేసిన పెండ్లి - నైజంబుగాదు;
నేడు .జేయుము తండ్రి! - నీవు మా పెండ్లి.

నీయాన యెవ్వరి - నిన్ బట్టడింక
నీ యాజ్ఞలో నుండు - నేదాదిగాను;

మా మొర లాలించి - మ మ్మాదరించి,
ప్రేమతో నిక పతి - భిక్ష మా కొసగు;

మని శరణార్థులై - యందరు పాద
వనజాతములమీద - వ్రాలిన జూచి,

కరుణించి, లెమ్మని - కాళియోరగుని
శిరముల పై నుండి - చెచ్చెర దుమికి,

యలఘుశాంతి వహించి - యాత్మ మోదించి,
కలికికృష్ణుం డొక్క - కడ నిల్చియుండె.

వ. అంత కాళియోరగుండు హరికి మ్రొక్కి, అపచారక్షమజేసికొని తన కాంతలతో నిజస్థానంబు జేరె; నంత రామకృష్ణులం దొక్కని నంద యశోదాదులు గోష్ఠంబునకు జని సుఖస్థితి నుండిరి. అందొక్కనాడు హరి బృందావనంబులో నిల్చి వేణుగానంబు జేయుచుండగా విని గోపకాంతలు హరి కెదురుగా బోయి తమలోదా మిట్లనుచున్నారు: 179

*** మురళీగానము – గోపికల ఆరాటము ***

ద్విపద. సుందరీమణులార! - చూడు డా దిక్కు,
బృందావనంబులో - ప్రియుడైన నంద

నందను డిప్పు డా - నందించి, మనకు
కందర్పుడై పూర్ణ - కళలతో వామ

భాగానతానన - పద్మంబు గదల
బాగుగా డాకాలి - పై సాచినట్టి

చరణనఖద్యుతుల్ - జగతిపై నిండ,
శిరమున నవరించు - శిఖిపింఛమాల

అల్లాడ, ఘనకంఠ - హారంబుతోడ
మల్లాడు[1] నవసూన - మాలికల్ వీడ[2],

చెలగి కర్ణావతం - సిత కర్ణికార
కళ దివ్యగండభా - గప్రభ మెరయ,

కరపంకజాంగుళీ - క్రమనటనంబు
సరస స్వరౌఘ భా - స్వర వర్మసరణి

జూప, భ్రూయుగళంబు - శోభిల్ల, నోర
చూపులతో [3] లోక - సుందరమూర్తి

యందమై తగువేణు - వధరంబునందు
పొందించి యూదుచు, - భూరిశృంగార

రస ముప్పతిల, నవ్య - రాగానుసరణి
పసమీర నటియించి - బహుతాళగతుల

---

1. 'మల్లు + ఆడు' అని విభజనము. 'పెనగాడుచున్న' అని యర్థము. ( చూ.శ.ర.పుట. 609).
2. 'విచ్చుకొనగా' అని యర్థము.
3 'ప్రక్క (ఓర) చూపులతో' అనగా 'కడగంటి చూపులతో' నని యర్థము.

మనమీది సత్కృప - మానసమందు
పెనగొన కన్నులు - బెళికించి[1] నగుచు

చూచుచున్నాడల్ల - సొగసు చూచితిరె?
చూచితి మదిసరే - సుందరులార!

శ్రీ తరిగొండ నృ - సింహుని మోవి
నీ తీరుగా నంటి - యెడబాయకుండ

మురళి యామునతట - మ్మున నిల్చి మున్ను
చిరముగా తపమేమి - జేసెనో యమ్మ?

## దర్వు*

ఏమి తపము జేసెనమ్మా? - యీ మురళి పూర్వ
మేమి తపము జేసెనమ్మా? ॥పల్లవి॥

హేమాంబరు నెపు - డెడబాయక తగ
వేమరు హరిమో - విని బొందెదనని ॥యేమి తపము॥ ఉ.ప.॥ ౧

మునులకైనను బొంద - రాని ఘనతరపదవి
మురళి కెక్కడ వచ్చె పూని?
వననిధి సుతకై - నను గలుగుట లరు
దని జను లెన్నుదు - రమరగ ధరపై ॥నేమి తపము॥ ౨

తరిగొండ నారసింహు - డైనా శేషాద్రి విభుని
కరుణ దానికి గల్గెగానా
హరి యధరామృత - మిరవుగ గ్రోలెడి
గురుతర భాగ్యము - దొరికెను నిజముగ ॥నేమి తపము॥ 3

ద్విపద. ఓ యమ్మలార! యిం - కొకమాట వినుడి:
మాయా ప్రపంచ ధ - ర్మముల బోనాడి,

---

1. 'తళతళమని ప్రకాశింపజేయుచు' అని భావము.
* ఈ దరువులో ప్రథమ చరణమందలి తొలి రెండు పాదములు పల్లవిగను, మలి రెండు పాదములు ఉపపల్లవిగను పేర్కొనబడియుండుట గమనింప దగినది.

సారంబులేని వం - సారముల్ విడిచి,
శ్రీరమాధిపు జేరి - సిగ్గులు విడిచి

'యెలమి పద్మాక్షు! మ - మ్మేనయ ర' మ్మనుచు
పిలుతమా సఖులార! - ప్రియభాషణముల,

కామమార్గణముల - కనులలో నుంచి
తామరసాక్షు చి - త్తము గరగించి,

చూతమా సఖులార! - సొగసుల మించి,
నూతనమైన వి-వోదంబు కొంత

చేతమా సఖులార!-చిత్తజుండలర
ప్రీతితో కృష్ణుని - బింబాధరంబు

గరుతమా సఖులార! - కౌగిలిమ్మనుచు
కరములుసాచి యా - ఘనుని చేపట్టి,

మురుతమా సఖులార! - ముద్దులుబెట్టి,
సరసంబు లాడుచు - జలజాక్షు వెంట

పోదమా సఖులార! - భూధరంబులకు,
నేదియు దెలియ కి - ట్లమ్మహామహుని[1]

చెనకిన, మనల మ - చ్చికె గనుపట్ట
తనవారమని చాల - దయజేసెనేని

సరి; దయలేక ర - చ్చల బెట్టెనైన
వరుసగా మన మగ - వారు ప్రాణములు

అశింతురా? మన - మటు జేయదగునె?
యాశయ మెరిగి ప - ద్మాక్షుడు దానె

మనల మోహించి స - న్మానించుదనుక
మన మూరకుండుట - మర్యాద నిజము.

1. 'ట్లిమ్మహామహుని' అని యుండిన యతిమైత్రి కుదురును.

తమకముల్ మానుడీ! - తాళిన గోవు
లమరంగ తేట నీ - ళ్లావల గ్రోలు,

నంబుజాననలార! - హరిమధ్యలార!
బింబోష్ఠలార! యీ - పీతకౌశేయ

వాసు బొందుట మన - వరలలాటముల
వ్రాసియుండకపోదు - వనజ సంభవుడు.

కాకున్న నితడేల - గలుగు నిచ్చోట?
మీకు సంశయములే - మిటికి? బొమ్మనుచు

కొందరు బల్కగా, - కొంద రానంద
కందళితాత్మలై - క్రముముగా నట్టి

మగువలు తమ తమ - మానసాబ్జముల
నగధరు నాలింగ - నంబు గావించి,

ధ్యానించి తత్పర - తంత్రలై చొక్కి,
మానినుల్ తమతమ - మందిరంబులకు

బోయి శ్రీకృష్ణుని - బొందెడికొరకు
పాయని నిష్ఠతో - పార్వతీ వ్రతము

తాము సంకల్పించి తగ నాదరించి,
యా మదవతు లపు - డగజ కిట్లనిరి:

## * పార్వతీవ్రతము *
## దర్వు, ఆదితాళం

శైలజాతా! దేవీ శైలజాతా! ॥పల్లవి॥

శైలజాతా! నిన్ను మేమూ - సతతామూ కొలిచేము
బాల గోపాలూని మాకు - పతిని జేసి రక్షింపవే! ॥శైలజాతా!॥ ౧

శౌరిని మోహించినామూ - జాలిచే తాళలేము
నీరజాక్షుడు మా పాల - నిలిచే చంద మూహింపవే!
॥శైలజాతా!॥ ౨

శ్రీకరా తరిగొండా - శ్రీ నరహరి యండా
మాకు నీవు గలుగజేసి - మన్నించు మ్రొక్కేము నీకు
॥శైలజాతా!॥ 3

ద్విపద. ఓ తల్లి! శర్వాణి! - యుర్వీధరేంద్ర
జాత! జగన్మాత! - సద్గుణోపేత!
భగవతి! మా కెల్ల - పద్మలోచనుని
మగనిగా జేయుము - మధుసూదనుండు
మగడైన వెనుక ని - న్మరల పూజించి,
తగ నేతితో వసం - తంబు లాడుచును
చెలగి జాతర[1] నీకు - జేసెద మనుచు
పలికి, హవిష్యంబు[2]- భక్షించి యిట్లు
మరువక సల్పిరి - మానవ్రతంబు.
నరనాథ! యందొక్క - నాడు ప్రొద్దునవె
క్రమమొప్పగా - గోపకామినులెల్ల
యమునా తరంగిణి - కరిగి యొక్కెడను
ఏకాంతమున వేడ్క - నెనసి చేలములు
ప్రాకటంబుగ తీర - భాగంబునందు
రాశిగా నుంచి ని - ర్వాణులై, వారి
డాసి[3]యన్యోన్య వి - డంబనంబులను
రభసంబుచే మీన - రాజి గ్రక్కదల,
గుభులు గుభుల్లున - కోరి దుంకుచును
వరతరిగొండ ని - వాసుడై శేష
గిరివాసుడగు బాల - కృష్ణుని మీది

1. ఇది 'యాత్రా' శబ్దభవము. 'శక్తి యుత్సవము' అను నర్థమున ప్రధానముగ రూ
గాంచియున్నది. ( చూ. శ. ర. పుట 312).
2. 'నేతితో గలిపి దేవతలకు నివేదించిన అన్నము'. 'దేవతాప్రసాద' మని తాత్పర్యము.
3. ఇచట 'యన్యోన్య విలంబనంబులను' అని యుండదగును. 'గృహీతాన్యోన్య హస్తాబ్జ
అను పోతన ప్రయోగమిందుల కాధారము. ( చూ. ఆంధ్రమహాభాగవతము వ X వస్కం
813వ).

పాటలు బాడుచు - పరగ నొండొరులు
మాటలాడుచును వ - మ్మతి నిట్టు లనిరి:

## * జలక్రీడలు *

## దర్వు (ధ్రువం), ఆదితాళం

చేడెలంద రీడ జల - క్రీడ లాడరే! ॥పల్లవి॥
కృష్ణు, డాడూచు నీడకు వచ్చే -జాడ జూడరే!
॥చేడెలంద రీడ॥ ఉ.ప.॥

పాలతులార! యీ చెంగల్వ - పూలు గోయరే!
యిందు, కులుకూచు నాడే తుమ్మెద - గుముల దోలరే!
॥చేడెలంద రీడ॥ ౧

కమలనాళమూల మెల్ల - గా గ్రహించరే!
పెద్ద, కమలమూలు గోసి కోసి - గట్టు నుంచరే![1]
॥చేడెలంద రీడ॥ ౨

నల్ల కలువా లందు గోసి - నాకందియ్యరే!
అల్ల, తెల్లకలువాళ్లన్ని పట్టి - తీసి యొసగరే!
॥చేడెలంద రీడ॥ 3

దురుసూగ తరంగములు - ద్రోయుచున్నారే!
మీరు, వెరువా కొక్క రొక్కరీని - విడువకుండరే!
॥చేడెలంద రీడ॥ ౪

యిపుడు కృష్ణు డిటకు వస్తే - యెట్ల వుండునే?
మన, తపములన్నీ వరుసగా నీ - ధరను బండునే!
॥చేడెలంద రీడ॥ ౫

తరిగొండా నారాసింహుని - శరణు బొందరే!
మనకు, సారిదీగా కృష్ణుని దెచ్చి - చూపుమనారే!
॥చేడెలంద రీడ॥ ౬

---

1. 'గట్టున + ఉంచరే!' అని విభజనము.

## దర్వు (కోలాట), అటతాళం

హరికృష్ణ! హరికృష్ణ! హరికృష్ణ! శరణని
యలరుచు కోలాట లాడుదామా? ॥పల్లవి॥

ఝుమ్మని మన చికు - రమ్ములవలె - నుండే
తుమ్మెద కొదమల - తోలుదామా? ౧

మన వదనాముల కన్నను - మించేమని యుండే
వనజములను గోళ్ల - వ్రచ్చుదామా? ౨

కళలాచే మననేత్ర - ముల ధిక్కరించు నీ
కలువరేకుల బట్టి - పులుముదామా? ౩

పావవమగు మన - మోవితేనెలవంటి
తావిమకరందము[1] - ద్రావుదామా? ౪

ఒరపైన మన బా - హువులను హసించు తా
మరనాళముల ద్రెంచి - మరలుదామా? ౫

గురుతరముగ మన - కుచముల గేలించి[2]
మెరయు జక్కువలను - తరుముదామా? ౬

ముదమొప్ప మనహస్త - ములవలె దగు కోక
నదమూల గదలించి - యదుముదామా? ౭

ధర మన పొక్కిళ్ల - కరణి వర్తువగాను
తిరుగు నీళ్ల సుళ్ల - నొరయుదామా? ౮

పట్టుగ మన నితం - బముల పోలికె నుండు
నట్టి సైకతములం - దాడుదామా ? ౯

---

1. తావిగల మకరందము.
2. 'పరిహసించు' అని యర్థము.

అలరాగ మనపాద - ములవలె నిచ్చోట
కులికే కమఠములాను - గొట్టుదామా ? ౧౦

రంగుగ [పొం]గు త - రంగమాలికలపై
నొంగి వుయ్యల లూగు - చుందుదామా ? ౧౧

సమ్మతిగా నలి - లమ్ము నొందొరులపై
చిమ్మన గ్రోవుల - జిమ్ముదామా ? ౧౨

పోడిమి యాలలు - బాడుచు జోడుగా
వేడుకగా నీదు - లాడుదామా ? ౧౩

ఉల్లాసమలర యీ - చల్లాని జలమెత్తి
చిల్లుపాల్లుగ[1] నెగ - జల్లుదామా ? ౧౪

దిట్టముగా నీ - నది నీరు పై కుబ్బు
నట్టుగ సేతువ - గట్టుదామా ? ౧౫

శేషాద్రి పతియైన - శ్రీ తరిగొండ నృ
సింహుని కృష్ణుని - జేరుదామా ? ౧౬

ద్విపద. అనుచు నొందొరులు గో - పాంగనామణులు
గొనకొని చిమ్మన - గ్రోవుల నింద

సలిలంబు నించి యా - శ్చర్యంబుగాను
చెలగి యొందొరులపై - జిమ్మి నవ్వుచును,

శ్రీకృష్ణు బాడుచు - చెలరేగి మురిసి
వీకతో విహరించు - వేళ కృష్ణుండు

వారిజనేత్రలు - వారి వేడుకల
వారి మధ్యమున ని - ర్వాణులై యున్న

---

1. 'సంక్షోభమగునట్లుగా' అని యర్థము. ( చూ. శ. ర. పుట 270)

సరణి భావించి య - క్కడికేగి[1], వారు
చరియించు టీక్షించి - సరితరి[2] యనుచు

చెలికాంద్ర కనుసన్న - జేసి యందందు
నిలిపి, తానొక్కరే - నిపుణత మెరయ

సుదతు లెక్కడ తను - జూతురో ? యనుచు
పొదలమాటున దాగి - పొంచి లో నగుచు,

సల్లలితాత్మ డీ - శ్వరుడునై యుండి,
మెల్లన నడచుచు - మేను వంచుచును

బాలుని భంగి న - ప్పద్మలోచనల
చేలంబులెల్ల ము - చ్చిలి కొనిపోయి,

తరిగొండహరి పొన్న - తరువు పై నెక్కి,
తరుణుల చిహ్నాముల్ - తగ జూచుచుండె.

వ. ఇట్లు గోపకాంతలు జలక్రీడలాడి చాలించి, కట్టు పుట్టంబులు గానక, చలిచేత వణంకుచు తమలో దా మిట్లనుచున్నారు : 179

* చీరలు వెదకుట *

దర్వు, అటతాళం

మనచీర లేవే వోయమ్మా ?
అమ్మా ! యీమాయ యేమే వోయమ్మా ? ౧

యింకెట్ల జేతా మోయమ్మా ?
అమ్మా ! యిందెవ్వరుండీ రో యమ్మా ? ౨

యిందె వుంటి మో యమ్మా !
అమ్మా ! యెవరెత్తుకపోయీ రోయమ్మా ! 3

---

1. 'యచ్చటి కేగి' అని యుండిన యతిమైత్రి కుదురును.
2. సరియైన సమయము.

సుడిగాలి రాలే దోయమ్మా!
అమ్మా! చుట్టుకపోలే దోయమ్మా! ४

ముచ్చు లెత్తినా రోయమ్మా!
అమ్మా! యీమూల జూడూ దోయమ్మా! ౫

ఆ దిక్కు వెదకూ దోయమ్మా!
అమ్మా! యీదిక్కు జూడూ దోయమ్మా! ౬

జాడలు బట్టూ దోయమ్మా!
అమ్మా! యేడ జాడా లే దోయమ్మా! ౭

చోరు లిందున్నా రోయమ్మా!
అమ్మా! శోధించిచూడూ దోయమ్మా! ౮

తరిగొండహరికీ వోయమ్మా!
అమ్మా! తక్కక మ్రొక్కు దోయమ్మా! ౯

ద్విపద. అని గోపికలు చీర - లందందు వెదకి
కనలేక భీతిచే - కళవళంబంది,

తక్కక తమలోను - తా మిట్టులనిరి :
'ఎక్కడ బోయె నే - డీ చీరలన్ని?

నాచీర యెట్టిద - న్నను విచిత్రముగ
పూచిన బంగారు - పువ్వుల చీర

నెలతరో నాచీర, - నీదెట్టి దనిన
తళుకుల నొప్పు ర-క్తపు వన్నె చీర,

కమలాక్షి! నాచీర - కరకంచు చీర,
రమణి నాచీర వా - ర భవంతు చీర,

సఖియరో ! నాచీర - సరిగెంచు[1] చీర,
పికవాణి ! నాచీర - పెనుబాల చీర,

ఎలనాగ ! నాచీర - యెఱ్ఱని చీర,
నలువొప్పు నాచీర - నల్లని చీర,

లలన ! నాచీర తె - ల్లని చల్వ చీర,
కలకంఠి నాచీర - ఘనపట్టుచీర,

అని తమతమ చీర - లట్టిట్టి వనుచు
నొనరగా నీరీతి - నొక్క రొక్కరికి

జెప్పుచు మోములు - చిన్నజేసికొని
తప్పక తరిగొండ - ధామ ! నీవైన

మాపాలిటికి వచ్చి - మాచీరలన్ని
జూపవే ! మానముల్ - [చూర] బోనియక

వ. ఇట్లు హరికిమ్రొక్కి, మరిన్ని తమలోదా మిట్లనుచున్నారు : 181

సీ. ఈరీతి వెరవగానేల ? యిచ్చోటనే
చోరుల వెదకరే సుదతులార !
పూరుషుడైనట్టి చోరుని బట్టితే
సిగ్గులు దక్కునా చెలియలార ?
కోకలన్నియు నీగికొని దిగంబ[రలమై]
యిక నెందు బోదమో యింతులార ?
ఇండ్లలో నుండువా రీరీతి దెలిసితే
చీరలు దెత్తురే చేడెలార !

తే.గీ. వారి కిది యెట్లదెలుసునే వనితలార ?
తెలిసితే తిట్ట కుందురా తెరవలార ?
మోసపోయితి మికనెట్ల ముదితలార ?
ఇంత భయ మెన్నడెరుగమో కాంతలార ! 182

---

1. 'సరిగె + అంచు' అని విభజనము.

వ. అని స్వామి నుద్దేశించి యిట్లనుచున్నారు : 183

## దరువు, కాంభోది(జి?) రాగం ఆదితాళం

మాతప్పు మన్నించి - మానము గావవే దై వరాయా !
నీకు, జాతర జేసేము - సద్భక్తి తో మేము దై వరాయా ! ౧

యిచ్చోటికి పురుషు - [లెవరు రాక] మున్నె దై వరాయా !
నీవు, చెచ్చెర వచ్చి మా - చీరలు జూపవే దై వరాయా ! ౨

వరతరిగొండని - వాన ! నీ పుణ్యము దై వరాయా !
పరగ కొన్నాళ్లింక - బ్రతికేట్ల[1] జూడవే దై వరాయా ! 3

ద్విపద. అని యిట్లు తరిగొండ - హరిని ప్రార్థించి
[తను]వులు గంపింప, - తమకించి యొకరు

ఒక్కరి నీక్షించి[2] - యో యక్కలార !
ఎక్కడ బోయె నే - డీ యంబరములు ?

సుడిగాలి వచ్చి దా - చుట్టి వే చనెనొ ?
జడియక మ్రుచ్చు లి - చ్చట దాగియుండి

కొనిపోయిరో గాక - కోమలులార ?
మనమెందు [కి] చటి కి - మ్మాడ్కి వచ్చితిమి ?

వచ్చినవార మా - వసనముల్ విడిచి,
యచ్చట బెట్టి భ - యంబేమి లేక

నిచ్చట నీటిలో - నేల జొచ్చితిమి ?
చొచ్చినవార మ - చ్చోటి చేలములు

ఎచ్చట బోయిన - దెరుగ కందరము
ముచ్చట లాడుచు - మోసపోయితిమి.

---

1. 'బ్రతికే + అట్ల' అని విభజనము.
2. 'గోపికలు పరస్పరము వీక్షించి' అని భావము.

ఇచ్చటి కెవరైన - నేతెంచి మనల
మచ్చికతో జూడ - మనకేది తెరువు ?

మందబుద్ధులు బుట్టె - మన కందరికిని,
ముందర గతి యేమి - ముద్దియలార ?

యనుచు నొండొరులు భ - యాక్రాంతలగుచు
తనువులు గంపింప, - తమ సమీపమున

చేలముల్ గొని పొన్న - చెట్టె క్కియున్న
బాలకృష్ణుని జూచి - బాగాయె! ననుచు

పొలతులు మొగమొగం - బులు జూచికొనుచు,
తలకొని తరిగొండ - ధాముని మాయ

కనరాదనుచు చాల - కళవళంబంది,
గునిసి[1] కొందరితోను - కొంద రిట్లనిరి :

* మ్రాని పై కృష్ణుడు – కొలనిలో గోపికలు *
దర్వు, ఆదితాళం

అదిగోనే మానిమీద కృష్ణు డమ్మా!
నేడెంతవాడు ? కుదురుగా గూచోవున్నా డోయమ్మా !౧

యేడనుండి వీడు వచ్చెనమ్మా ?
చూడకపోతి, మీడనే వుంటిమిగదరమ్మా ! ౨

వీడు చోరవిద్యవాడే నమ్మా !
లేకుంటె వచ్చే, జాడ గానిపించదటరమ్మా ! 3

వేడుకోని చీర లడుగరమ్మా !
కృష్ణుని మోము, చూడ సిగ్గయ్యీని గదరమ్మా ! ४

1. 'గొణిగి' అని యర్థము. ( చూ. ఆం. శ్రీ. స్వ. మ. దీపిక పుట 374).

సిగ్గు పోనేపోయె గదరమ్మా!
తరిగొండ వార, సింహాని భజన జేయరమ్మా! ౫

క. అని కాంతలు లజ్జింపుచు
గొనకొని నదిలోని కరిగి కుత్తుకదనుకన్
తనువులు దాపుచు, కృష్ణుని
కనుగొని యిట్లనిరి చాల కళవళ పడుచున్: 184

## * ప్రార్థన *

శ్లో॥ సూర్యాది గ్రహ తారకాంతరగతం సూక్ష్మాదిసూక్ష్మం, జగ
త్కార్యాకార్య వివేచనం మునినుతం కారుణ్యసద్వారిధిం।
తుర్యాతీతసమాధిపూర్ణ మచలం దూరీకృతాఘం, మహా
ధైర్యం శ్రీతరిగొండ శేషకుధరాధ్యక్షం భజేఽహం సదా॥ 185

ద్విపద. ఓముద్దు గోపాల! - యో భర్మచేల!
ఓ మన్మథాకార! - యో మేరుధీర!

తోయజేక్షణ! - నీవు - దొంగవై వచ్చి
మా యంబరంబు లే - మరిన, ముచ్చిలుచు

గ్రక్కున చెట్టెక్కి - కదల కిచ్చోట
చొక్కి మ మ్మీరీతి - జూచుచున్నావు;

మానినులను జేరి - మర్యాద విడిచి
మానముల్ జూతురే - మగవార లిట్లు?

ఘనవర్ణ! నీకు గా - గా జెల్లె; నింత
పని జెల్ల దెవరికి - పరికించి చూడ,

కోరి మా[సిగ్గులు] - గొంటి వింకేల?
చీరలనై న మ - చ్చికతోడ నొసగు

మని తరిగొండేశు - సహా శై లవతిని
మొనసి ప్రార్థింప, ని - మ్ముగ కృష్ణు డనియె:

## ఏలలు*

యీ రీతినీ చోరుడాని - దూరుచున్నా రంతెగాని
చీరాలు నే నెరుగాను పోరే ! వో కొమ్మాలారా !
- చిడిముడిమాటా లాడకూరే ! ౧

చీరా లెత్తూ కాపోయినా - చోరూడావూ నీవేగానా
చీరాలన్ని మా కందియ్యారా ! వో ముద్దూ కృష్ణా
చేరి నిన్నూ సేవించేమూరా ! ౨

మీ చీరాలు గాలిచాత - మింటి కెగిరీ పోవుచుంటె
చూచీ తెచ్చి యిందుంచినానే ! వో కొమ్మాలారా !
- లేచీవచ్చి గైకోని పోరే ! ౩

తగ్గీ తగ్గీ నీటి లోనూ - తనువూలూ దాచీనా మేమూ
సిగ్గూ లేకా వచ్చేదెట్టూరా ? వో ముద్దూ కృష్ణా !
- చీరలూ దెచ్చి మా కియ్యారా ! ౪

తరిగొండ నారాసిహుడూ - దండించీనీ మిమ్మిప్పూడూ
సరగునా లేచిచటికి రారే ! వో కొమ్మాలారా !
-త్వరగా చీరాలూ గట్టూకోరే ! ౫

ద్విపద. అని పల్క విని కాంత - లంద రిట్లనిరి :
వనజాక్ష ! మేము ని - ర్వాణులమైన

కతమున లేచి చ - క్కగ నిల్వలేక
నతిలజ్జ తో తోయ - మందున్న మమ్ము

లేచిరమ్మంటివి - లెస్సాయె నీతి !
ఈచందమునను మ - మ్మేచుట నీవు

నిగమముల్ దెచ్చుటో ? - నిర్జరుల్ బొగడ
నగము ధరించుటో ? - నరుల బ్రోచుటకు

* ఈ యేలలు మొదలుకొని, చెట్టు పై నున్న కృష్ణునకు, నదిలోనున్న గోపికలకు నడచిన సంవాదము విపులముగా వర్ణింపబడినది.

ధరను పై కెత్తుటో ? - దై త్యుని ద్రుంచి
కరుణచే బాలుని - గాచుటో ? ప్రబలి

బలిని బంధించుటో ? - పార్థి వేశ్వరుల
చలమున గెల్చుటొ ? - సద్ధర్మ సరణి

పరగ భూ మేలుటొ ? - బలశాలి వగుటొ?
కరుణచే మెరయుటొ? - కల్కిచిహ్నములు

జేసు టే ఘనము ?[1] మా - సిగ్గులు బయలు
జేసితి; వేమోమొ - పేయబూనుటకు

సరి సరి ! మేల్ మేలు ! - చాల్ చాలు; మాకు
తరిగొండవాస ! వ - స్త్రంబు లందియర!

(వ. అనిన విని చిన్నికృష్ణు డిట్లనుచున్నాడు :) 186

దర్వు (జావిడి) అదితాళం

మీ వస్త్రము లందియ్యను[2] - మీకు కూలివాడగాను
కావలసితేను వచ్చి - గై కొనిపోరే ! ౧

అక్కట ! దిగంబరల - మగుచు నిందుండి నీ మ్రోల
నక్కడికీ లేచి రాలే - మంబుజేక్షణా !

మిమ్ము నేను చూడలేదు - మీకు నా కిదేటివాదు
కొమ్మలారా ! చీరలు గై - కోని కట్టరే !

యెగ్గింత[3] తెలియక నీ - వెంత లేచిరమ్మనిన
సిగ్గు మమ్ము లేవనీదు - చిన్ని కృష్ణుడా !

వనితలారా ! తరిగొండ - వాసుడు మీ సిగ్గులు గై
కొనకముందె మీ చీరలు - కోరి కట్ట రే !

---

1.'జాసూటే ఘనము?'- అనియుండినచో ఈ సన్నివేశమునకు మరింత అనుగుణమై యుండును
2. 'అందిచ్చుటకు' అని యర్థము.
3. 'ఎగ్గు + ఇంత' అని విభజనము. 'ఎగ్గు కొంచెమైనను' అని యర్థము, ఎగ్గు = తప్పు, అవమానము ( చూ. సూ. రా. అం, నిఘంటువు, ప్రథమ సంపుటము పుటలు 766,767)

ద్విపద. అని పల్కు విని భామ - లా హరి జూచి
కను లెఱ్ఱజేపి త - క్కక విట్టు లనిరి :

సరి సరి, మేల్ మేలు - సరసీరుహాక్ష !
సరగున నీ ముచ్చు - జాడలు దెలిసె;

శరణనుచున్న మా - సంసారములను
హరియింప దలచెద - వౌర ! నీ వింత

గుణవిహీనుడవౌట - గురు తెరుంగకనె
గుణశాలివని నమ్మి - కొలిచియుంటి మకట !

నీకు హేయములేక - నేడు మామైల
కోక లిష్టములయ్యె, - కొనకు[1]నీరీతి

మానహీనుడవని - మాకెల్ల దెలిసె;
[గాని యిం] తటనైన - గౌరవం బెసగ

మాయంబరంబులు - మాకు దెచ్చిమ్ము!
మాయావివై మారు - మసలవద్దనిన

తరిగొండహరి గోప - తరుణుల జూచి
యురవైన దయ దాచి - యిట్లని పలికె :

## ఏలలు

అకాశాన నెగిరీపొయ్యే - కోకాలు నా [కూ ధొరి] కేనూ
మీకూ నే నేమిటీ కిచ్చేనే ? వో కొమ్మూలారా !
-రూకాల కే నమ్మూకూనేనే ! ౧

రాజాసామూతో నీవూ చీ - రా లమ్మేనంటెనూ మేమూ
రాజూతో జెప్పూకాపోమూరా ! వో ముద్దూ కృష్ణా !
- రవ్వలేలా ? చీరా లియ్యూరా ! ౨

---

1. 'చివరకు' అని యర్థము.

రాజూతో [జెప్పి] నూ మీ - రారంభించియున్నా రట్టైతే
రాజెవ్వాడో నాకూ జూపారే? వో కొమ్మాలారా !
- రాజుకడకూ పోదామూ రారే ! 3

రాజూకడకూ బిరబిత్తాలే - రమ్మానే వట్టైతే మేలే !
వాజాగా; దీ మాటా లనకూరా ! వో ముద్దూ కృష్ణా !
- వచ్చి మా చీరా లం [దియ్యా]రా ! ४

మీకెందూ రాజున్నాడానీ - జోకగా నంటిరీ పూనీ?
నాకూ మీరాజూనూ జూపారే ! వో కొమ్మాలారా !
- నాటికి మీ చీరా లిచ్చేనే ! ౫

శ్రీ తారీగొండా మా నారా - సింహ ! మాకూ రాజావీవే !
ఖ్యాతీగా నన్యూలూ లే[రూరా !] వో ముద్దూ కృష్ణా !
- కావునా మా చీరా లియ్యారా ! ౬

ద్విపద. అన విని శ్రీకృష్ణు - డతివల జూచి
కనుగీటి పలికె : నో - కామినులార !

ఎవని వీక్షించి మో - హించితి రిచట?
ఎవడు మీ హృదయంబు - లెల్ల హరించె?

మరువ కే పురుషుని - మగనిగా దలచి
మురియుచున్నారు? మీ - ముచ్చట లెల్ల

తెలుపు డన్యుడగాను - తెలియ బాధ్యుడను,[1]
తలపులు మీరేల - దాచెదరింక?

మొనసి చల్లకు వచ్చి - ముంత దాచినను
పని యౌనె? తెల్పి, యం - బరము లామీద

[ నడిగి ]తే లేదన; - నటమీద నేను
నడిగిన విచ్చెద - మని మాటజేసి[2],

1. 'బంధువు' అని యర్థము. 'బాధ్యుడు, బాధ్యము' అను పదములు సన్నిహిత బాంధవ్యమును దెలుపునవిగా చిత్తూరు మండలమున నేటికిని వ్యవహారములో నున్నవి.
2. వాగ్దానము చేసి' అని యర్థము.

వచ్చి కైకొనుడు మీ - వసనంబులన్ని
యిచ్చెద; నీటిలో - నిటు వానవలదు,

చలిచేత వాతంబు - సంభవించీని;
కలకంఠులార! శీ - ఘ్రమె రారె! యనుచు

పలికిన తరిగొండ - పతిని వీ[ క్షిం ]చి
తలిరాకు బోణు లం - దరు నిట్టు లనిరి:

**దర్వు, అట తాళం**

చీరాలు కట్టక - నే రీతి వత్తుము బాలకృష్ణా?
మీ రీ, వారి వెడలివచ్చి - చీరలు గట్టరె చెలియలంరా! ౧

చేరవచ్చేము మా - చీరలు మున్నీర! బాలకృష్ణా !
నన్ను, చేరితేగాని మీ - చీరలియ్యను పోరె ! కొమ్మలారా !౨

తరిగొండవాస ! యెం - తటి నిర్దయుడవురా ! బాలకృష్ణా !
నన్ను, దురుసుగ మీరింత - దూరితే వెరతునా కొమ్మలారా? ౩

(వ. అని పల్కిన విని గోపకాంత లిట్లనుచున్నారు:) 187

తే.గీ. అయ్యయో ! నీట దేహంబు లదరసాగె
నేమిసేతుమురా కృష్ణ ? యిచటి కింక
నూరి మగవారు రాకమున్నే రయమున
తెచ్చి మాచీర లీర! సందేహమేల ? 188

ద్విపద. అన విని శ్రీకృష్ణు - దతివల జూచి
తనలోన నగుచు న - త్తరి నిట్టు లనియె:

వనితలారా ! మగ - వారెవ్వరైన
మొనసి వచ్చిన సిగ్గు - మోసమౌ ననుచు

దిగులు నొందెదరైతె - తెలిసి చూచినను
మగువనే నేనైతి ? - మగవాడగానె ?

మీదగ్గరికి వచ్చి - మీకు నన్ చీర
లాదరంబుగ నియ్య - మనుటకు మీకు

సిగ్గులేకను, నన్ను - చేరవచ్చుటకు
సిగ్గంటి రటుగాన - చీర లెత్తికొని

మీకూలివాడనై - మీకిచ్చు పనికి
నాకు సిగ్గయ్యీ [ని, - నా] తల్లిదండ్రి

యిది విన్న తిట్టుదు; - రింక మీతోను
మదవతులార ! నే - మాట్లాడ వెరతు;

మీ చీర లిచటికి - మీ మగల్ వచ్చి
మీ చేతులందుంచి - మీ సిగ్గు గావ

వలె; నిందు పర మగ - వాడనై నేను
చెలగి మీ చీర లి - చ్చిన సిగ్గు బోదె ?

కొంటెలై కట్టిన కోకలు విడిచి,
జంటగా మీర లి - చ్చట నుండు వేళ

నొంటిగా నిచట నే - నుండితినేని
కంటు దోచును మీ మ - గండ్ల కందరికి,

కావున నాతోడు - గా మీ మగండ్లు
వావిరి నిచటికి - వచ్చిన, నాకు

భయము దీరు నటంచు - పలికి, వేణువును
రయ [మున] మధురాధ - రంబుపై నుంచి

తగ నూది తరిగొండ -ధాము డా చెలుల
మగలను బిలిచె స - మ్మతి నిట్టు లనుచు:

## ఏలలు

కియ్యో ! యాని పసులా నెల్లా - గెంటా కి దిక్కూ మళ్లించి
చయ్యానా నిందూ రండొండ్లాలా ! వో గొండ్లాలా!
- సరవినీ జూడుడీ [పెండ్లాలా] ౧

బిరబిత్తాలె జలమూలోనూ - చొరబాడీయున్నా రీడానూ
సరగూనా నిందూ రండోంఢ్లాలా ! వో గొండ్లాలా !
- చక్కగా జూడుడీ పెండ్లాలా ౨

తరిగొండా నారాహారి మీ - తరుణూలా సిగ్గూ లిచ్చేట
చెరచకాముందే రండోంఢ్లాలా ! వో గొం[డ్లాలా!]
- చేపట్టీ యేలుడీ పెండ్లాలా 3

ద్విపద. ఓ తిమ్మిగౌడ ! యో - హెూ బొమ్మిగౌడ !
ఓ తిన్నిగౌడ ! యో - హెూ కన్నిగౌడ !

ఓ చిక్కగౌడ ! యో - హెూ చుక్కగౌడ !
ఓ చిర్రగౌడ ! యో - హెూ కుర్రగౌడ !

ఓ బాలగౌడ ! యో - హెూ బుచ్చిగౌడ !
ఓ [బయ్య] గౌడ ! యో - హెూ కియ్యగౌడ !

ఓ కోనగౌడ ! యో - హెూ యెర్రగౌడ !
ఓకానగౌడ ! యో - హెూ కందగౌడ !

రండురం డోహెూ హెు ! - రాంఢ్రో ! యటంచు
దండిగా ధ్వనిజేసి - తరిగొండ నృహరి

పిలిచిన వెరచి యా - బింబోష్ఠు లెల్ల
వె[లవె] లబోవుచు - వేగ నిట్లనిరి :

## దర్వు, (ధ్రువం), ఆదితాళం

పిలువావద్దురా ! మా పతుల పిలువావద్దు రా ! ॥పల్లవి॥

వోరీ ! చెలువాకృష్ణా ![1] వారిందు వచ్చితే మమ్ము కొట్టేరయ్యో!
॥పిలువావద్దురా !॥ ॥ఉ.ప.॥

---

1. చెలువము (అందము) గల కృష్ణా!' అని యర్థము. ఈ ప్రయోగము 'కలికి కృష్ణుడు వంటిది. చూ. పుట. 6

గుట్టుగా నీ విందు వచ్చి - కోక లియ్యుమంటె, గట్టి
రట్టు బెట్టి మా మగల - రమ్మాని పిల్చే వయ్యయ్యో!
॥పిలువావద్దురా !॥ ౧

యీ రభసామెల్ల నూరి - వారందారూ విని పరువు
బారి వచ్చితే మేమెట్ల - బ్రతుకుదు? మయ్యయ్యో !యింకా
॥పిలువావద్దురా !॥ ౨

నవ్వుగాదు తారిగొండా - [నర] హరితోడే ! మమ్మిందు
రవ్వ జేయవద్దు ! మా చీ - రా లిచ్చి సిగ్గూ నిల్పారా !
॥పిలువావద్దురా !॥ 3

(వ. అనిన గోపికలతో కృష్ణుం డిట్లనుచున్నాడు :) 189

## ఏలలు

మగలాను నే బిల్చేనాని - దిగులు నొందేరైతె గానీ
వే గట్టీగా పిల్చుట మానేనే ! వో కొమ్మలారా !
- వేణునాదామైనా .జేసేనే ! ౧

పొందూగా వేణువూదీనా - నందారు వత్తూరుగానా
నెందూకూ రచ్చాబెట్టేవురా ? వో ముద్దూకృష్ణా !
- యింత నిర్దయా నీకేలారా ? ౨

యెంతా నే బిల్చినా రాకా - పంతాముతో నందె యున్నా
రింతా నెనరూ లేనీదేమే ? వో భామలారా !
- యేను మీకూ నన్యుడానేమే ? 3

బిరబిత్తాలే రమ్మా నూచు - తరుణూలాను చేరా బిలిచే
పురుషూ లెందున్నారు తెలుపారా! వో ముద్దూకృష్ణా !
- భూరినీతీ మదిలో దలపారా ? ౪

సరవీనీ చీరాలు విడిచీ - జలమూలాలో నీదులాడే
తరుణూల మీరెందు గన్నారే ? వో భామాలారా !
- తప్పు చిన్నే లెన్ని బన్నేరే ? ౫

సమ్మాతముగా తారిగొండా - స్వామీ ! నిర్వాణముగా
నీవూమమ్మూ చూడావలే నేమిరా ? వో ముద్దూకృష్ణా
- మంచి, దైతే వత్తూమేమిరా ? ౬

## * నిర్వాణులు – గోపాలుడు *

ద్విపద. అని పల్కి యాకాంత - లందరు ధైర్య
[ము]న కృష్ణు నీక్షించి - 'ముద్దుగోపాల!

అచ్చుగా నీవంటి - యభిమానశాలి
రచ్చల బెట్టునే - రమణీమణులను ?

మమ్మిట్లు గనుట నీ - మానసంబునకు
సమ్మతమైన న - చ్చటికె వచ్చెదము,

లోకాత్మ ! నీ యాజ్ఞ - లోనె నిల్చెదము;
మాకేల మానవ - మానంబు ?' లనుచు

మానినీమణులు వా - మ కరాబ్జములను
మానరక్షణము స - మ్మతిని గావించి,

పాలిండ్ల దక్షిణ - పాణిపద్మముల
చాల గప్పుచు జలా - శయముద్ర వెడలి,

వచ్చిన వారి ని - ర్వాణ చిహ్నంబు
లచ్చుగా తరిగొండ - హరి జూచి, పొన్న

చెట్టుపై నుం [చిన - చీ]రల మూట
దిట్టడై కొని మ్రాను - దిగి యిట్టు లనియె:

## దర్వు. ఆదితాళం

సమ్మతమాయనే ముద్దు - గుమ్మలారా !
నే మీ, సొమ్మునైతినే బంగారు - బొమ్మలారా !

మీరు రెండు చేతులెత్తి - మెలతలారా !
నాకు, నేరుపుతో మ్రొక్కారె [వెలతలారా!
తరిగొం] డా వాసుని తోడె - తరుణులారా !
మీకు, సరగూనా చీర లిచ్చెనె - సఖియలారా !

ఆ.వె. చిన్నికృష్ణ ! రెండు చేతులతో నీకు
మ్రొక్కుమన్న నిపుడు మ్రొక్కలేము;
మొనసి యొక్కచేత మ్రొక్కుమనిన, మేము
నీకు మ్రొక్కగలము నీరజాక్ష! 190

[ఆ.వె. చేడెలార ! యొక్క] చేత మ్రొక్కిన మ్రొక్కు
లెందు కిపుడు మెచ్చు నీశ్వరుండు?
రెండుచేతు లొక్కరీతిగా పై కెత్తి,
నిలిచి మ్రొక్కుడిందు నెలతలార! 191

### జంపె

ఇటువంటి యన్యాయ - మెందైన గలదటరా కృష్ణ ?
కటకటా ! కృష్ణ ! మా - పటము లందియరా ! ౧
న్యాయంబుగా [నేను] - నడిపింప, మీర ల
న్యాయమిది యని పలుక - నర్హమగునటరే ? ౨

యిపుడు చేతులను పై - కెత్తుడని పలికేవు
కపటాత్మ ! నీకు కని - కరము లేదటరా ? 3

కనికరము నామదిని - కలుగగానే[1], వచ్చి
మొనసి నాకెటులైన - మ్రొక్కుమనినానే ! ౪

తరిగొండహరి ! నీకు - తగ మ్రొక్కితే మాకు
నిరవంద నాదాయ - మేమిరా కృష్ణ ? ౫

---

1. 'కలిగినందువలననే' అని యర్థము.

## దర్వు, ఆదితాళం, మధ్యమకాలం

శ్రీకరముగ మీ చీరల నిచ్చితె - నా కాదాయంబేమే ?
మరి, నా కాదాయం బేమే ? భామా ! ౧

మా కీ చీరల జోకగ నిచ్చిన - నీకూ పుణ్యమురా కృష్ణా !
మరి, నీకూ పుణ్యమురా కృష్ణా ! ౨

చీరల మీ కిచ్చిన నా కావల - మీ రేమిత్తురె భామా ?
(మరి, మీ రేమిత్తురె భామా ?) ౩

తరిగొండాధీశ్వర ! నీ వడిగిన - దిరవుగ నిత్తుమురా కృష్ణా
మే, మిరవుగ నిత్తుమురా కృష్ణా ! ౪

## ఏలలు

ఎవడూ మగడూగా దలంచి - యిలలో గౌరిదేవీవ్రతము
సవినయముగా జేయూచున్నారే ? వో భామలారా !
- సత్యమూగా నాతో జెప్పారే ! ౧

అంతటికీ పరుడై విశ్వా - మంతా రక్షింపుచున్నా శ్రీ
కాంతు పొందూ గోరీనామూరా ? వో ముద్దు కృష్ణా !
- గౌరినోమూ నోమినామూరా ! ౨

వ్రతమూ సాంగమూగాకానే - వసనమూలూ విడిచీ, నీటా
హితమూగా జొచ్చితిరందునా వో భామలారా !
- యీ వ్రతా మింకా ఫలించూనా ? ౩

వెలయా గౌరివ్రతమూ జేయా - ఫలియించే పాటి వుపాయా
మెలమీతో నీ విపుడూ దెలుపారా ! నోముద్దూకృష్ణా !
- చెలగీ మే మట్లాగ జేసేమూరా ! ౪

కరమూలూ పై కెత్తి మీరూ - తరిగొండా నరాహారికీ
వరుసాగానూ నిలిచీ మ్రొక్కారే! వో భామలారా !
- వాడు వ్రతఫలామూ నిచ్చూవే ! ౫

ఆ.వె. మొనసి యొక్కచేత ముందుగా మ్రొక్కెద,
మంబరంబు లియ్యు ! మంది కట్టి,
యవల రెండు చేతు లమరగా పైకెత్తి
నీకు మ్రొక్కెదముర నీరజాక్ష ! 192

(వ. అనిన శ్రీకృష్ణు డిట్లనుచున్నాడు :) 193

ఆ.వె. ఒక్కచేత మీరు మ్రొక్కిన నే చీర
లియను ! రెండు చేతు లెత్తి మ్రొక్కి
చీరలడుగు, డేను చెచ్చెర నిచ్చెద;
నెలమి మ్రొక్కకున్న నుయను పొరె ! 194

వ. అనిన విని గోపకాంతలు తమలో దా మిట్లనుచున్నారు: 195

## దర్వు, అటతాళం

బాలగోపాలూడు - పద్దాతో నున్నాడు
చేలము లీయ డేమి - సేయుదామే ?

తిన్నతిన్నగ బోయి - చిన్ని గోపాలూని
పన్నుగ నిక పొంచి - పట్టుదామే,
పట్టబోయిన వీడు - పటమూలు గొని మంద
కట్టె బోయిన, వీని - కర్థమేమే ?

కూరిమితో వాని - జేరి, చుట్టును పొంచి
కోరి చీరలు నాచి - కొందామేమే?

తరిగొండ నరహరి - దండసాధ్యుడుగాడు,
శరణనుటే మంచి - సదుపాయమే !

క. అని పల్కిన సుందరులను
కనుగొని దరహాసవదన కలితుండగుచున్
కనకాంబరు డంబరముల
గొనిపోవుచున్న జూచి గోపిక లెలమిన్. 196

వ. శ్రీ కృష్ణుడు జనుచున్న మార్గంబున కడ్డంబుగా బోయి
యిట్లనుచున్నారు: 197

## దర్వు, అటతాళం

గోపాల ! మందకు బోకురా ! సుగుణాకరా !
నీపుణ్యము, మమ్మూ

రాపూరవ్వలు సేయవద్దురా ! యేటి పద్దురా ?
మేము బ్రదికే వుపాయ

మీపట్ల నీవు చింతించరా ! కరుణించరా !
మాచీర లందిచ్చి

యాపాద వారించి బ్రోవరా ! సిగ్గుగావరా ! ౧

[అగ] రా ! యిది యేటి సద్దురా ? యేమి రద్దురా ?
యీ నందాడి వినీ

మగవాం డ్లింకెవరైన వచ్చేరూ, మమ్మూ జూచేరూ;
వారు జూచితే మేమూ

జగతి నెవ్వరి నెట్ల జూతూమూ ? యేమి సేతూమూ ?
మా కిపు డంటియుండే

దిగులు దీరిచి నీవే బ్రోవరా ! సిగ్గు గావరా ! ౨

యేమూ నేరము జేసినామురా ! వెరచేమురా !
కట్టు చీరలు విడిచీ

మేమూ నీళ్లలో చొరరాదురా ! బుద్ధిలేదురా !
యీ తప్పు మన్నించి

మామీద నీదయ నుంచరా ! పరిపాలించరా !
వో తరిగొండనగరా

ధామా ! మమ్మెట్లైన బ్రోవరా ! సిగ్గు గావరా ! 3

ద్విపద. అని భంగిపడెడి [1]గో - పాంగనామణుల
గని హరి దరహాస - కలితుడై పలికె :

---

1. 'భంగపడెడి' అని యుంతదగును. 'బ్రతిమాలుచున్న' అని యర్థము. ఈ యర్థమున రాయలసీమయందలి కొన్ని ప్రాంతములలో 'భంగపోవు' అను ప్రయోగము నేటికిని వ్యవహారమున నిలిచియున్నది.

పతిని గోరుచు రతి - పతిని గెల్చుటకు
వ్రతనిష్ఠతోనుండి, - వసనముల్ విడిచి

నీటిలో జొత్తురె - నియమంబు లేక ?
నేటికి కాత్యాయ - నీ దేవి వరము

కల్ల జేసుటెగావి - కల్గునె ఫలము ?
పల్లవాధరలార ! - పాణిపద్మముల

నెత్తి మ్రొక్కితిరైన[1] - యీ వ్రతఫలము
నిత్తు, మీచేతులంబు - లిత్తు;నటంచు

పలికిన తరిగొండ - పతిని వీక్షించి
నలినాక్షు లందరు - నగి యిట్టు లనిరి :

## దర్వు, ఆదితాళం

సిగ్గు లే తెరువయినాగాని - చిన్నికృష్ణునీ
కిచ్చేట, తగ్గి చేతులెత్తి మ్రొక్కు - దామె వేడ్కనూ ౧

రెండు చేతు లెత్తి మ్రొక్కే - దుండకుంటెమానె
పెద్ద, కొండగవిలో తపమూజేయు - చుండవచ్చునే ! ౨

ధైర్యమూన మ్రొక్కకుంటె - కార్యముగా దింకమీద
నార్యు లిచ్చేటికి వచ్చే - రమ్మా ! జిల్లారే ![2] 3

పదరి చేతు లెత్తబోతె - కదిసిపుట్టే సిగ్గుచేత
వదలి, గుండె లదరూచున్న - విదిగో చూడారే ! ౪

యేమెట్టైనాగాని చేతు - లెత్తి తారిగొండాహరికి
క్షేమముగా మ్రొక్కాకుంటె - సిగ్గు దక్కాదే ! ౫

వ. అనిన విని మరికొంద రతివ లిట్లనుచున్నారు : 198

---

1. 'మ్రొక్కినచో' అని యర్థము.
2. ఇది 'పురే! బాపురే!' - మొదలగువానివంటి ఆశ్చర్యార్థకమగు అవ్యయము.

ద్విపద. కాంతలార ! యింత - కళవళపడుచు
నెంతసేపుండిన - నీ మాధవునకు

దయబుట్టి మనకు వ - స్త్రంబు లందియడు;
రయమున మన మంద - రము నొకమాటు

కనుగవల్ ముకుళించి - కరముల నెత్తి,
తనువులు వంచి నం - ద తనూజుమోము

మొనసి చూడక వేగ - మ్రొక్కి కూర్చుంద;
మని నిశ్చయింపుచు - నాకాంతలెల్ల

వరతరిగొండ ని - వాసుడౌ శేష
గిరిధాము నీక్షించి - గెంట కిట్లనిరి:

ఆ.వె. వినర కృష్ణ ! మేము కనుగవల్ ముకుళించి,
కాయములను వంచి, కరము లెత్తి.
తనర నీకు మ్రొక్కెదము ; నీవు మాదిక్కు
చూడ కంబరంబు లీడ నుంచు. 199

ద్విపద. అని గోపికలు బల్క - నంబుజాక్షుండు
విని, వారియుక్తికి - వెరగునొందుచును

కరము ద్రిప్పుచు శిరః కంపంబుజేసి,
పరిహాసకంబుగా - పలికె నిట్లనుచు :

నెరజాణలార ! మీ - నిపుణత నేను
నెరుగుదు కొంతైన - నీ మాటలేల ?

చక్కగా లేచి హ - స్తములు పై కెత్తి
మ్రొక్కకుండిన, చేల - ములను మీ కియను.

మీ కన్యుడనుగాను - మిత్రుడ గాని,
మీకు సంకోచ మే - మిటికి నాచెంత ?

నయము[తో] నే చిన్న- నాటినుండియును
ప్రియుడనై మీతోడ -పెరుగుచున్నాడ;

మెరయుచు మీలోనె - మెలగుచున్నాఁడ,
మరి నేను చూడని - మర్మంబు లేవి ?

ఇచ్చట మీకన్య - లెవ్వరు లేరు,
ముచ్చటగా నాకు - మ్రొక్కి చేలములు

[ధరియింపుఁడ]ని పల్క - తరిగొండ హరిని
చిరునవ్వుతో నవ్వి - చేడె లిట్లనిరి:

## ఏలలు

ఎంతా వేడీనానూ చేతూ - లెత్తీ మ్రొక్కూడాని పలికే
పంతామూ వీడ వింకెట్లారా ? వో ముద్దూకృష్ణా !
- బ్రతుకూ బయలుజేసేవేమిరా ? ౧

తక్కాకా కరాము లెత్తి - మ్రొక్కామంటె నన్నూ మీరు
చిక్కూ[లు బె] ట్టూచున్నారే ! వో కొమ్మలారా !
- తక్కూ లెన్ని నేర్చుకున్నారే ! ౨

తరింగొండావాసా ! నీ కిది - ధర్మమూగా దోచియుంటె
కరమూ లెత్తీ మ్రొక్కేములేరా ! వో ముద్దూకృష్ణా !
- సరగూనా మా చీర లియ్యూరా ! 3

## * ఆత్మ నివేదనము *

ద్విపద. అని గోపభామిను - లందరు ధైర్య
మున కృష్ణదేవుని - ముందర నిలిచి,

తొలగక రెండు చే - తులు ముకుళించి,
నలువొప్పగా 'నమో - నలినాక్ష!' యనుచు

'తరిగొండపురవాస ! - దందశూకాద్రి
వర ! విశ్వరూప ! స - ర్వజ్ఞ ! గోవింద !

పురుషోత్తమా ! నంత - పుణ్య ! తపంబు
లెఱుగము; మమ్ము నీ - వేరీతినైన

రక్షించు' మనుచుమ - రోకేందువదన
లకీణ భక్తితో - నవ్వు డిట్లనిరి :

శ్లో॥ ఆధారాది సరోరుహేరావరి సహస్రారాబ్జ మధ్యస్థితం
బోధానందఘనం వికారరహితం పూర్ణానుభావోజ్జ్వలం।
రాధాలోచనకైరవామృతకరం రాజీవపత్రేక్షణం
స్వాధారం తరిగొండశేషకుధరాధ్యక్షం భజేఽహం సదా॥

## చూర్ణిక

శ్రీమదఖండ బోధప్రద సకల నిగమ నిగమాంత శాస్త్ర పురాణేతిహాస ప్రతిపాద్య సచ్చిదానంద నిత్య పరిపూర్ణ దివ్య మంగళ విగ్రహం, కమలా పరిగ్రహం ౧

ఉరుతర పాఠీన కమఠ వరాహ నరకంఠీరవ వటుక పరశుధర కోదండా భరణ సీరహస్త బుద్ధ కల్కి ప్రముఖ వివిధావతారం, సుజన మందారం ౨

సనక సనందన సనత్కుమార సనత్సుజాతాభిధానవ[రమ][1] యోగీంద్ర కోపోదిత శాప సంజాత హేమాక్ష హేమకశిపు దశకంఠ కుంభకర్ణ శిశుపాల దంతవక్త్ర భీకర గర్వాంధకార ప్రభాకరం, బృందారక జన శ్రీకరం ౩

కమలగర్భ రుద్ర కశ్యప వశిష్ఠ శక్తి పరాశర వ్యాస శుక శౌనక గౌతమాంగీర సాత్రి భరద్వాజ నారద శ్రీవత్సగౌ కౌత్స భృగు జమదగ్ని వాలఖిల్య వాల్మీకి విశ్వామిత్ర ముఖ్య భక్తబృంద వందిత చరణార విందం, జగన్మూలకందం ౪

---

1,2, - ఈ శిథిల భాగములు 'విష్ణుపారిజాత' మందుగల యిదే చూర్ణిక ననుసరించి పూరింపబడినవి.

సహస్ర మార్తాండప్రభా భాసమాన నానామణిగణఖచిత నూపుర కింకిణీ మేఖలాంగద కంకణ కౌస్తు [భగ్రైవేయ][3]హార కుండల మకుట దివ్య కనకాంబరాలంకృతం, దూరీకృత ప్రాకృతం ౫

శంఖ చక్ర గదా ముసల కౌక్షేయక ధనుర్బాణ ముద్గర భిండివాలపరశు పట్టిస పరిఘాద్యనేక దివ్యాయుధధరం, శత్రుజన వాతూలమ [హీధరం][4] ౬

మగధ మాళవ మళయాళ చోళ నేపాళ కొంకణ ద్రవిడ టేంకణ సాళ్వ సౌరాష్ట్ర సౌవీర కురు కుకురు కోసల పుళింద లాట మరాటఘోట కర్ణాట కాంభోజ కాశ్మీరాది సకల దేశధీశ్వరాధీన సమస్త విత్తాపహరణం, సా[ధు సంపత్కారణం][5] ౭

నిరంతర కిసలయ పత్ర కోరక కుసుమ ఫల మిళితవిలస న్మహీజాత పరివృత శేషశైలాగ్ర శాతకుంభకలశోన్నత గోపురప్రాకార మంటపాలయ ద్వార కవాటశోభితానందనిలయ నివేశం, శ్రీవేంకటేశం ౮

[నిరుపమ నిరుపాధిక ని]6 'రాలంబ నిష్కళంక నిరామయ నిర్వికారాదిమధ్యాంతరహిత స్వయంప్రకాశం, తరిగొండ పట్టణాధీశం భజే ఒహం, భజే ఒహం, భజే ఒహం, ౯

వ. అని మరి న్నిట్లనుచున్నారు : 201

## దర్వు

దండమూ కృష్ణా ! దండ[మూ] ॥పల్లవి॥
[అండజవాహన ! పండిత పాలన]॥
కుండలిశయన ! బ్ర - హ్మాండశరీరా! ॥దండమూ॥ ౧

మందరగిరిధర ! - సుందర విగ్రహ !
నందతనయ ! గో -వింద ! ముకుందా ! ॥దండమూ॥ ౨

3, 4, 5, 6, - ఈ శిథిల భాగములు 'విష్ణుపారిజాత' మందుగల యిదే చూర్ణిక ననుసరించి పూరింపబడినవిది.

గురుతరవేంకట - గిరివరనాయక !
తరిగొండాధీ - శ్వర ! నరసింహా ! ॥దండము॥ 3

## ∗ వస్త్రదానము ∗

గీ. అనుచు మ్రొక్కిన సతులతో నంబుజాక్షు
డిట్టులని పల్కె : మీచీర లెట్టి ? విపుడు
దెలుపరే ! యన విని గొల్ల తెరవ లెల్ల
బాలకృష్ణుని వీక్షించి పలికి రిట్లు : 202

### దర్వు, ఆనందభైరవిరాగం, ఆదితాళం

నా చీర యెట్టిదన్నను - నందనందన వినరా !
పూచినట్లుండు బంగారు పూలా చీరరా ! ౧

నెళవుగా నాచీర మరి - నీ వెట్టిదనిన విను
కళలచే నొప్పు చందురు - కావీ చీరరా ! ౨

శ్రీలలనాధీశ ! నాదు - చీర యెట్టిదంటె విను
మేలు కమ్మిన మరు పెను - బాలా చీరరా ![1] 3

చిన్నికృష్ణ ! నే గట్టిన - చీ[ర యెట్టిదంటె]విను
పన్నుగా మెరసే లింగాల[2] - పట్టుచీరరా ! ౪

వేణుగానలోల ! నీవు - విను నా చీర యెట్టిదంటె
నాణెమైన యెర్రని బా - ణాలా[3] చీరరా ! ౫

---

1. 'పెనుబాల (పెనుబాల పేట?) అను ఊరిలో తయారు చేయబడిన మేలు కమ్మిచీర' అని యర్థము. 'మేలుకమ్మిచీర' యనగా అంచు మూడంగుళముల ఉండునటుల వాయనూలితో నేసిన పెద్దంచులు గల కోక. (చూ. శ. ర. పుట. 634).
2. 'లింగాల' - అనునది చీరల నేతకు ప్రసిద్ధి గాంచిన ఒకానొక గ్రామం పేరు కావచ్చు.
3. 'బాణాల' (బాడాల? లేదా బాణావరం) - ఇదికూడ చీరల నేతకు పేరుపడిన గ్రామనామం కావచ్చు.

బాలకృష్ణ ! నా చీర యే - పాటి చీరంటేను వినుము
లాలితమైనట్టి కలికి కలిమి పులా చీరరా ! ౬

కలికికృష్ణ ! నా చీర యే - ఘనమైన చీరంటివైన
బలు మేలైనా కంభావతీ - పట్టు చీరరా ![1] ౭

నీరజాక్ష ! నే గట్టిన - చీర యే చీరంటివైనా
కోరి కొన్నట్టి ప్రాప - ల్కాల చీరరా ![2] ౮

వ. అనుచు తమతమ చీర లట్టిట్టివని [గోపిక] లందరు వినిపింప,
నవ్వి తరిగొండ విభు డిట్లనెను : 203

ఆ.వె. గోపకాంతలార ! కోక లిచ్చెదగాని,
నాయెదుటను మీరు నగుచు నిలిచి,
మీరు కట్టికొనుడు మీయంబరంబులు,
మరుగు కేగవలదు మగు [వలార!] 204

తే.గీ. అనిన విని గోపకాంత లిట్లనిరి : కృష్ణ !
యిలను మానవమానంబులెల్ల నీకు
ప్రీతి రెట్టింపగా సమర్పించి, మరల
మ్రొక్కెదము వల్వ లియ్యరా మోహనాంగ ! 205

క. అని మ్రొక్కిన గోపికలను
వనజాక్షుడు మెచ్చిమెచ్చి వసనము లొసగన్
ఘన ముగ గోపిక లవి గై
[కొని] తమవస్త్రములు గట్టికొనిరి ముదమునన్. 206

వ. అప్పు డా శౌరి గోపకాంతల జూచి యిట్లనుచున్నాడు: 207

---

1. మడుగు వస్త్రముగా నుపయోగించుటకై ప్రత్యేకముగా తయారు చేయబడిన ఎర్రని పట్టు దోవతిని 'కంభావతి' యందురు. అటువంటి పట్టుతో నేసిన చీరయే 'కంభావతి పట్టుచీర'.

2. ప్రాపలుకులనగా వేదములు. నాలుగు వేదములకు నాలుగు వర్ణములు పురాణ ప్రసిద్ధములు. అందు ఋగ్వేదము పసుపు. యజుర్వేదము తెలుపు. సామవేదము ఎరుపు. అధర్వణ వేదము నలుపు. ఈ నాలుగు రంగుల తంతులతో ప్రత్యేకముగా నేయబడిన చీరకు' ప్రాబల్కాల చీర' యను వ్యవహార ముండి యుండవచ్చును

## * వ్రతఫలము *

మ. నతులారా ! వరగౌరిదేవివ్రతమున్ సంకల్ప పూర్వంబుగా
పతి గామించుచు జేసినారు : భళి ! మేల్, బాగౌను: మీకోర్కెలన్
వ్రతమున్ పూర్తిగ నాచరించి, యట సర్వంబు నారాయణా
ర్పితమంచున్ వచియించు డా ఫలము నిప్పింతున్ విశేషంబుగా 208

వ. అనిన విని గోపకాంతలు పద్మాసనాసీన[లై కూర్చుండి] గౌరికి
షోడశోపచార పూజలు సమర్పించి, వ్రతోద్యాపనంబు [జేసి,
గౌరిదేవిని]మది నుద్దేశించి యిట్లనుచున్నారు : 209

శా. గౌరీ ! పార్వతి ! చంద్రమౌళితరుణీ ! కల్యాణసంధాయినీ !
సారాసారవిచారిణీ ! శుభగుణీ ! సానందచిద్రూపిణీ !
కారుణ్యామృతవీక్షిణీ ! భగవతీ ! కంకాళినీ[1] ! భైరవీ !
శౌరే మమ్ము వరించు సద్వరము ని[ప్పింపన్ కృపన్ బూనవే!] 210

వ. అని ప్రార్థించి, యారాత్రికంబుగైకొని మంగళంబు బాడే విధం
బెటువలెను. 211

### దర్వు (జావిడి), ఆదితాళం

శైలజాతాకూ గౌరికీ - జయమంగళం ॥పల్లవి॥

త్రి, శూలధరునా కభవూనాకు-శుభమంగళం ॥శైలజాతాకూ॥ ॥అ.ప.॥

మహిషాసుర సంహారిణికి - మౌనిజనోద్ధారిణికి
బహుచరాచరమాతకు - భవ్యమంగళం ॥శ్రీ॥శైల॥ ౧

సుగుణాభరణధారిణికి - సురసమూహోద్ధారిణికి
నిగమాంతసంచారిణికి - నిత్యమంగళం ॥శ్రీ॥శైల॥ ౨

తరిగొండ నరహరి సో -దరికి శ్రీకంకాళినికి [1]
సురుచిర సువాసినికి - శుభమంగళం ॥శ్రీ॥శైల॥ 3

---

1. 'కంకాళిని' అనునది దుర్గయొక్క వివిధ స్వరూపములలో నొకదాని పేరు. (చూ. మోనియర్ విలియమ్స్ సంస్కృత - ఇంగ్లీషు డిక్షనరి, న్యూ ఎడిషన్ పుట 242).

వ. అని గోపికలు మంగళంబు బాడి, గౌరివ్రతంబు సంపూర్ణంబు గావించి, హరిని జూచి యిట్లనుచున్నారు : 212

## ఏలలు

జలజానయనా గౌరివ్రతమూ - సాంగామైనా వెనకా, వ్రాతాఫలము
నిచ్చేనంటి వియ్యారా ! వో బాలకృష్ణా !
- పలికి మాతో బొంకావలదూరా ! ౧

గౌరీనిగూర్చి యీ వ్రతమూ - గావించితీరీగాదా ? మీ
కోరికే నాతోనూ దెలుపారే ! వో భామలారా
-గొబ్బునా నా ఫాలా మియ్యానే ! ౨

సారాసాక్షా ! మా మాదిలో - కోరికే నీతో జెప్పామూ
లేరా ! నీవే తెలూసూకోరా ! వో బాలకృష్ణా !
- తెప్పునా తత్త్వార్థా మియ్యారా ! ౩

మానాసామూలో కోర్కెలూ - పూనీ మీతో జెప్పూటా [కూ
నేనూ సుద్దీవా] డానూ[1]గానే ! వో భామలారా !
- నిజమూగా మీ రంటే వినేనే ! ౪

శ్రీతారిగొండా మా నారా - సింహునీతోడే ! మా కోర్కె
నీతో జెప్పా సిగ్గయ్యానీరా ! వో ముద్దూకృష్ణా !
- నీలో నీవే తెలూసూకోరా ! ౫

ద్విపద. అని గోపికలు బల్క - నామాట లెల్ల
నను గొల్వ చింతించి - నారు, మేలయ్యె;

సిగ్గుచే మీరది - జెప్పజాలకను
తగ్గగా నేనె మీ - తలపు జెప్పితిని;

1. 'సుద్ది (ఎరుక) చెప్పెదువాడు' అని యర్థము.

సారసేక్షణలార ! - సంప్రీతితోను
మీరు రాత్రులయందు - మెరయుచు వచ్చి
యనువొంద తరిగొండ - హరి మెచ్చగాను
నను బొందుదురు గాని - నమ్మి పొందిపుడు.

వ. [అని పల్కిన, గో] పకాంతలు నమ్మక హరితో నిట్లనుచున్నారు: 212

## దర్వు, అటతాళం

మగవాని మాట యి - మ్మహి మంచుమాట,
వగలు జూపే మేలు - వనధిపై వ్రాలూ; ౧
కామించె విభ్రమము - గగనకుసుమము,
భూమి పురుషుని విందు - పులి [బెట్టే విందూ ; ౨
నీరజేక్షణు] మాటలు - నిజమనరాదు,
తరిగొండహరి తోడె! - దబ్బరా గాదూ. ౩

వ. అని గోపికలు సందేహింపుచున్న, నవ్వి నందకుమారుం డిట్లనుచున్నాడు: 213

ద్విపద. నను నమ్మజాలక - నలినాక్షులార!
యనుమానముగ మాట-లాడనేల?
రమణతో మిము నేను - రక్షించుపనికి
అమర మీ మధురాధ - రాబ్ధులు సాక్షి,
కొదువేమి? మీ కుచ - కులగిరుల్ సాక్షి,
కదియ మీ నాభి పు - ష్కరిణులు సాక్షి,
ఎదుట రోమాళి ఫ - ణీంద్రులు సాక్షి,
అదిగో! మా తరిగొం[డ - హరిసర్వ సాక్షి;
నమ్మరే నా ] మాట - ననబోణులార!
మిమ్ము రక్షింతు; నే - మిటికి సందియము?

వ. అని గోపకాంతలకు నమ్మిక లిచ్చి, వారితో విలాసంబుగా నిట్లనుచున్నాడు: 215

## దర్వు, అటతాళం

వేడుక గౌరమ్మ - జూడాగా నెదుటా
నాట్లాడుదామా? వో చెలియలారా!
[తూగుటు] య్యాలవలె వుండె - వుయ్యాల తీగెల
నూగుదామా? వో - చెలులారా!
వాడిగా తరిగొండ - వాసూని పదములు
పాడుదామా? వో - భామినులారా!

## దర్వు,* ఆదితాళం

రారే వేడ్కను - రామలా [రా!]
పూబొదరిండ్లకు పోదాము రారే! ॥రారే॥ ౧
తుమ్మెద కొదమల - తోలుదాము రారే! ॥రారే॥ ౨
కుసుమ ఫలంబులు - గోతాము రారే! ॥రారే॥ ౩
శ్రీ తరిగొండ నృ - సింహుని మీరే ॥రారే॥ ౪
ప్రార్థింపుచు స - త్పద మిమ్మనరే! ॥రారే॥ ౫

ఆ.వె. అనుచు వారితోడ వనవిహా [రము జేసి]
చాల మోదమొసగి చక్రధరుడు
['మంద క] రుగు డింక, మన ధేనువుల మేప
పోయివత్తు నేను పాలతులార!' 216

వ. అని పలికిన హరిని సాభిప్రాయంబుగా జూచి, గోపికలు మంగళంబు బాడే విధం బెటువలెను. 217

---

*ఈ దర్వు యొక్క మొదటి పాదము పల్లవి వలె ఆవృత్తినొందియుండుట గమనింపదగినది. ఇది యిందలి కొన్ని గేయములకు సహజముగా కనబడుచున్నది.

## * మంగళము *
## దర్వు, ఆదితాళం

మాధవునకు జయ - మంగళం ॥పల్లవి॥
శ్రీమహినీళునకు - జయమంగళం ॥ఉ.ప.॥

విదురవరదునకు - విశ్వంభరునకు
మదనజనకునకు - మంగళం
సదయహృదయునకు - చపలాసుర దు
ర్మదభంజనునకు - మంగళం ॥మాధవునకు॥ ౧

సహజానంద ర - స స్వాంతునకును
మహిత చరితునకు - మంగళం
బహువిధ చేతన - భరితోదరునకు
మహిమాఢ్యునకును - మంగళం ॥మాధవునకు॥ ౨

గురుతర వేంకట - గిరిపతి యై మము
మరువని సామికి - మంగళం
తరిగొండధీ - శ్వరుడై మ మ్మే
మరని నృహరికిని - [ మంగళం ॥మాధవునకు॥] 3

## * అనంతర కథా సంగ్రహము *

ద్విపద. [ అని భక్తితో మం] గ - ళారతు లెత్తి,
మనములు గరుగంగ - మందకు గోప

తరుణులు జని; రంత - దనుజసంహరుడు
పరుగెత్తి చని గోప - బాలుర గూడి,

పసుల మేపుచునుండి, - బ్రాహ్మణ స్త్రీల
పసమీర రక్షించి, - పర్వతమెత్తి,

అమీదటను రాత్రు -లందును గోప
కామినీమణులను - గలిసి, యానంద

కల్లోలముల దేల్చి, - కరిని, చాణూర
మల్లుని, కంసుని - మరి తక్కినట్టి

దుష్టరాజుల నెల్ల - దును మాడి, వరున
శిష్టులనెల్ల ర - క్షిం పుచునుండి,

వనధిమధ్యంబున - ద్వారక గట్టి,
పనిబూని రుక్మిణి - ప్రముఖాంగనలను

బహుసంఖ్య నొనర చే - పట్టి, పుత్రకుల
మహిమ మీరగ పెక్కు - మందిని గాంచి,

పరమసంతోష నం - భరితుడై శౌరి
సురుచిర లీలల - సుఖియింపుచుండె.

*** సమర్పణము ***

అని యిట్లు శేషాచ - లాధీశుడగుచు
తను నేలు తరిగొండ - ధాముని పేర†
*[వాసి కెక్కిన నంద - వరకులోద్భవుడు
శ్రీశదాసుండు వా - సిష్ఠ గోత్రుండు

---

†మూలప్రతిలో గ్రంథ మింతవరకే యున్నది. తరువాతి భాగము గల చిట్టచివరి తాళపత్రము లోపించినది. అందు కవయిత్రి నామధేయము, అంకితప్రసక్తి గల ఐదారు ద్విపద పంక్తులు, అటుపిమ్మట - అనగా గ్రంథాంతమున - లేఖకుడు, లేఖనకాలము ఇత్యాది వివరము లుండియుండును.

*'[ ]' - ఈ గుర్తుల మధ్య గల ఆరు ద్విపదలు 'విష్ణుపారిజాతము' నుండి గైకొనబడినవి. అందు వాల్గవ ద్విపదలో నున్న 'వల పారిజాతాపహరణంబు యక్ష' అను పాదమునకు మారుగా నిందు 'లలి జలక్రీడావిలాసమన్ యక్ష' అని చేర్చబడినది.

కానాలవంశ సా - గర శశాంకుండు
నైన కృష్ణార్యున - కతివయై వెలయు

మంగాంబ సుతయయి - మహిఁ బుట్టి నట్టి
వెంగమాంబిక మోక్ష - విభవంబుకొరకు

నలువొప్ప తరిగొండ - నరసింహు కరుణ
లలి జలక్రీడా వి - లాసమన్ యక్ష

గానంబు జేసి వేం - కటగిరీంద్రునకు
పూని సమర్పించె - బుధసమ్మతముగ;

భూచక్రమందు పెం - పుగ నీప్రబంధ
మా చంద్రతారార్క - మై యొప్పుగాత !]



## అనుబంధము -(i)

Note:- దిగువ నీయబడిన పాఠాంతరములుP ప్రతియందుండి స్వీకరింపబడినవి. వీటిలో కొన్ని మూల ప్రతియందలి శిథిల భాగములకు పూరకములు.

| పుట | పంక్తి | పాఠాంతరము |
|---|---|---|
| 3 | 14 | బాల - కృష్ణ లీలలను |
| 5 | 11 | జాహ్నవి పినతల్లి మాకు |
| 5 | 22 | అనిన విని వారు సంతసించి; రంత విఘ్నేశ్వరునకు |
| 9 | 5 | అరసి గోపకులు, |
| 11 | 19 | బ్రతుకు మీదా జోలీ విడువారా ! |
| 24 | 16 | విజిత శతకోటి మదనం, సత్య ధర్మ |
| 28 | 9 | గర్భమున దాల్చి |
| 38 | 12 | ప్రవిమలాకార ! |
| 39 | 13 | గచ్చాలమారి ! నీ - కనుగవ మోడ్వావు ॥ చిచ్చో ॥ |
| 40 | 26వ పంక్తికి తరువాత | నూట యిరవై యయిదేండ్లు జీవిస్తున్నాడూ. |
| 41 | 21 | నలరుచు పురుడు పు-ణ్యాహవాచనము |
| 45 | 10, | వావలింపుచు కన్ను -లప్పుడు దెరచి |
| 49 | 17 | యచ్చెరు విక నేమి సేతు వమ్మయలారా? |

| పుట | పంక్తి | పాఠాంతరము |
|---|---|---|
| 50 | 19 | నడర నవ్వల జూడ - నమితంబుగాను |
| 64 | 15 | బాలు దెరుగునటరె భామలార? |
| 74 | 17 | గోపిదేవినుతుని కొట్టు మంటివి; వాడు |
| 80 | 23 | తనయూల గన్నవారు గాదా? |
| 88 | 20-21 | కామాక్షి !జగదీశ్వరి! జంబుకేశ్వ రాఖి లాండేశ్వరి ! |
| 152 | 5 | లలన ! నా చీర తె - ల్ల ని చల్వ చీర |
| 161 | 13 | కొంటెలై కట్టిన - కోకలు విడిచి |
| 165 | 12 | చెలియలార ! యొక్క చేత మ్రొక్కిన |
| 168 | 9 | నగధీర ! యిది య్యేటి సద్దు రా? |
| 173 | 20 | అండజవాహన ! - పండితపాలన ! |
| 174 | 4 | అనుచు మ్రొక్కిన సతులతో- నంబుజాక్షు |
| 174 | 10 | పూచీనట్లుండు బంగారు - పూలా చీరెరా ! |
| 175 | 2 | లాలితమై నట్టి కలిమి పూ - లా చీరెరా ! |
| 175 | 6 | కోరి కొన్నట్టి కప్ర ప - ల్యూల చీరెరా ! |
| 175 | 19 | ఘనముగ గోపిక లవి గై, కొని |
| 176 | 4 | వ్రతమున్ పూర్తిగ నాచరించి, యట |
| 176 | 12 | సద్వరము సత్రేమంబుతో నీయవే ! |
| 177 | 4 | జలజా నయనా ! గౌరీవ్రతమూ |
| 177 | 9 | గొబ్బూనా ఫాలామూ యిచ్చేనే ! |
| 177 | 19 | అని గోపికలు బల్క - నా మాట లెల్ల |
| 177 | 19వ పంకి కి తరువాత | వినికృష్ణ దేవుండు -వికవిక నవ్వి |
|  | 20వపంక్తి కి ముందు | మనము రంజిలజేసి- 'మదవతులార ! |
| 177 | 20 | నను గొల్వ జింతించి - నారు; మేలయ్యె |
| 178 | 4 | నను బొందుదురు గాని - నమ్మి పొందిపుడు |

| పుట | పంక్తి | పాఠాంతరము |
|---|---|---|
| 178 | 10 | భూమి పురుషుని విందు -పులి బెట్టే విందూ |
| 178 | 11 | నెరయ నీ మాటలు - నిజమనరాదూ |
| 178 | 15 | యనుమానముగ మాట - లాడనేల? |
| 178 | 21 | యదిగొ! మా తరిగొండ - హరి సర్వసాక్షి! |
| 178 | 22 | నమ్మరే! నా మాట |
| 179 | 4 | వేడూక గౌరమ్మ - జూడాగనెదుటా |
| 179 | 5 | నా,ట్లాడుదామా? వో చెలియలారా! |
| 179 | 6 | శయ్యాల వలె నుండె - వుయ్యాల తీగెల |
| 179 | 11 | రారేవేడ్కను - రమణులారా! |
| 179 | 12 | పూ బొదరింట్లకు - పోదాము రారే! |
| 179 | 18 | చాల మోద మొనగి చక్రధరుడు |
| 180 | 4 | శ్రీమహి నీళునకు - మంగళం |
| 180 | 10 | మహిత చరితునకు - మంగళం |
| 180 | 11 | బహు విధ చేతన - భరితోదరునకు |
| 180 | 18 | అని కృష్ణునకు మంగ - ళారతు లెత్తి |
| 181 | 1 | ఆ మీదటను రాత్రు - లందును గోప |
| 181 | 8 | పని బూని రుక్మిణి -ప్రముఖాంగనలను |



## అనుబంధము - (ii)

శ్రీకృష్ణునకు 'జగన్నాటక సూత్రధారి' యని, 'లీలామానుషవిగ్రహు' డని పౌరాణిక ప్రసిద్ధి. ఆయన లీలలతో ముడివడిన ఘట్టములలో మిగుల ముఖ్యమైనది గోపికల 'జలక్రీడ.' ఈ ఘట్టమునకు గల ప్రశస్తిని గుర్తించిన పలువురు ప్రాచీనార్వాచీన కవులు ఈ కథావస్తువుతో వివిధ వాఙ్మయ ప్రక్రియలలో వేర్వేరు రచనలను వెలయించిరి.

తెలుగున ఆ ఘట్టమును ప్రధానీకరించుకొని అదే పేరుతో గాని, లేదా ఆ ఘట్టముతో గూడిన భాగవత దశమస్కంధ కథను గైకొని మరేదైన పేరుతో గాని యక్షగాన రచన గావించిన కవుల వివరము ఈ దిగువ నీయబడినది.

| కవి | కృతి | వివరములు |
|---|---|---|
| 1) *అక్కయ ప్రధానుడు (క్రీ.శ. 16,17 శతాబ్దుల నడిమి కాలము) | శ్రీకృష్ణలీలా విలాసము | శ్రీరంగపతికి అంకితము. ముద్రితము. 'యక్షగానములు' (4వ సంపుటము), ఆంధ్రవిశ్వ కళా పరిషత్తు, వాల్తేరు (1959). |
| 2) శహాజీ (క్రీ.శ. 1684-1712) | జలక్రీడలు | శ్రీకృష్ణాంకితము. ముద్రితము. 'యక్షగానములు' (9వ సంపుటము),ఆంధ్ర విశ్వ కళాపరిషత్తు, వాల్తేరు,(1973). |
| 3) సరబాద లింగోజీ (క్రీ.శ. 17వ శతాబ్ది) | జలక్రీడ | అలభ్యము |
| 4) నిముషకవి రామయ్య (క్రీ.శ. 1758 ప్రాంతము, | జలక్రీడా విలాసము | విష్ణుసంవేద్యక్షేత్రమున వెలసిన రామేశ్వరున కంకితము (?) ముద్రితము. శర్వాణీ ముద్రాక్షరశాల, అమలాపురము(1908) |

---

*ఈ కవి కాలమును తెలిసికొనుటకు ఇతరాధారములు లేకపోయినను, ఈతని రచనయందలి ప్రాచీనతను బట్టి కాల నిర్ణయము చేయబడినది.

| | కవి | కృతి | వివరములు |
|---|---|---|---|
| 5) | -- | జలక్రీడ | తిరువళ్లూరు వీరరాఘవునకు అంకితము.అముద్రితము. S.V.U.O.R. Inst. Library లో క్రింది సంఖ్యలు గల వ్రాత ప్రతులు గలవు: D 1839 (b) (P.L.); D 1881 (P.L.); R 2421 (Paper); R 2422 (Paper). ఈ ప్రతులన్నియు అసమగ్రములు. |
| 6) | -- | భాగవతము | సత్యపురవేణుగోపాలాం కితము. అముద్రితము. Adayar Library, Madras లో నొక వ్రాత ప్రతి కలదు. సంఖ్య: 74790 |
| 7) | అలూరి కుప్పన కవి (18వ శతాబ్ది మధ్య కాలము) | పార్థసారథి విజయము | చోళపురము పాలకుడగువేంక టాచల విభునకు అంకితము. అముద్రితము. S.V.U.OR.I. Library లోని వ్రాతప్రతులు D 1908(P.L). R 758 (Paper); G.O.M; Library (Madras) లోని వ్రాతప్రతి : R 1907 (Paper) |
| 8) | భారతి రామరాజు (క్రీ.శ. 1795 ప్రాంతము) | జలక్రీడలు | పొట్లదుర్తి శ్రీహరి కంకితము. ముద్రితము. సరస్వతీ నిలయ ముద్రాక్షరశాల, మదరాసు, తృతీయముద్రణ (1883) |

| కవి | కృతి | వివరములు |
| --- | --- | --- |
| 9) రాయభట్టు వీరరాఘవ కవి (క్రీ.శ. 1800కు పూర్వుడు) | జలక్రీడా నాటకము | అలభ్యము. |
| 10) పాకనాటి గణపతిరెడ్డి (గణపతి పెద్దన అని నామాంతరము. 18వ శతాబ్ది) | గోపాలవిలాసము (కృష్ణ విలాసము) | నీలాద్రినిలయుడగు జగన్నాథునకు అంకితము(?) ఐదారు తడవలు ముద్రితము. అందొకటి రాయపురం రత్నా నాయకర్ శ్రీ సరస్వతీ ముద్రాక్షర శాల, మదరాసు (1886). |
| 11) శిర్నాడు వెంకటరాయ కవి | లేపాక్షి కృష్ణ నాటకము (జలక్రీడలు) | లేపాక్షి శ్రీహరికి అంకితము. మూడు తడవలు ముద్రితము. విశాఖపట్టణము (1931): వెస్టు వార్డు అండ్ కో, మదరాసు(1947, 1950). |
| 12) కానుకొలను వెంకటదాసు (19వ శతాబ్ది పూర్వార్ధము) | శ్రీకృష్ణనాటక యక్షగానమహా ప్రబంధరాసక్రీడా విలాసము. | ఇందు గోపికల 'జలక్రీడల' ఇతివృత్తము గల ఆశ్వాసము నేడలభ్యము. 'రాసక్రీడల'కథాభాగము గల చతుర్థాశ్వాసము మాత్రమే లభ్యమై, రెండుతడవలు ముద్రితమైనది. నేషనల్ ప్రెస్, బందరు(1926): వెంకట్రామ పవర్ ప్రెస్, ఏలూరు (1948) |
| 13) మతుకుమల్లి నృసింహ కవి ((క్రీ.శ. 1816-1873) | శ్రీకృష్ణ జలక్రీడా విలాస నాటకము | అలభ్యము |
| 14) మరింగంటి వేంకట నృసింహాచార్యులు (క్రీ.శ. 1842 ప్రాంతము) | ఇందిరాల భాగవతము | అముద్రితము. వ్రాతప్రతి హైదరాబాదు లక్ష్మణరాయ పరిశోధక మండలిలో కలదట. |

| కవి | కృతి | వివరములు |
|---|---|---|
| 15) చిలకమర్తి నారాయణా చార్యులు (క్రీ.శ. 1865 ప్రాంతము) | భాగవతము (దశమస్కంధ పూర్వ భాగము) | అలభ్యము. |
| 16) భారతుల శ్రీ రంగకవి (క్రీ.శ. 1879 ప్రాంతము) | శ్రీకృష్ణ లీలలు (శ్రీకృష్ణ జల క్రీడలు) | మాచెర్ల చెన్న కేశవునకు అంకితము.ముద్రితము. వర్తమాన తరంగిణి ముద్రాక్షరశాల, మదరాసు, (1881). |
| 17)మైనంపాటి వీరరాఘవయ్య (19వ శతాబ్ది ఉత్తరార్ధము) | బాలగోపాల విలాసము | నాలకూరపాటివేణుగోపాల స్వామికంకితము. ముద్రితము. శ్రీవాణీ వినోద మందిరముద్రా క్షరశాల, మదరాసు (1887) |
| 18) ద్విభాష్యం పుల్ల కవి (19వ శతాబ్ది ఉత్తరార్ధము) | శ్రీ కృష్ణ గోపీ జలక్రీడా భాగవతము | అలభ్యము |
| 19)గరికిపాటి సూర్యనారాయణ శాస్త్రి, (19వ శతాబ్ది ఉత్తరార్ధము) | శ్రీకృష్ణ జలక్రీడా నాటకము | ముద్రితము(1898),అలభ్యము |
| 20)వి. వెంకట నారాయణకవి (20వ శతాబ్ది పూర్వార్ధము) | శ్రీకృష్ణ బాల క్రీడా విలాసము | ముద్రితము (1901), అలభ్యము. |
| 21) వేదంభట్ల వేంకట రాయ కవి (20వ శతాబ్ది పూర్వార్ధము) | జలక్రీడా విలాసము | పూసపాటి వేంకటపతిరాజునకు అంకితము. ముద్రితము. శ్రీశారదా మకుట ముద్రాక్షర శాల, విశాఖపట్టణము (1906) |
| 22)అంబటిపూడి ఆనందయ్య (20వ శతాబ్ది పూర్వార్ధము) | గోపికా వస్త్రాప హరణము | ముద్రితము(1908),అలభ్యము |

| కవి | కృతి | వివరములు |
|---|---|---|
| 23)నాగినేని వెంకటప్ప (20వ శతాబ్ది పూర్వార్థము) | కృష్ణలీలా నాటకము | ముద్రితము (1914), అలభ్యము |
| 24) బళ్ల రామరాజు (20వ శతాబ్ది పూర్వార్థము, | శ్రీకృష్ణ లీలలు | ముద్రితము, తొమ్మిదవకూర్పు శ్రీకాళహస్తి తమ్మారావు అండ్ సన్స్, రాజమండ్రి (1945). |
| 25) చెర్విరాల భాగయ్య (20వ శతాబ్ది పూర్వార్థము) | భాగవతము | తెలంగాణా ప్రాంతమందలి 'చందా' గ్రామమున వెలసియున్న దేవున కంకితము.ముద్రితము. కొండా శంకరయ్యఅండ్ కో, సికింద్రాబాదు (1954). |

---

Note:- పై పట్టికయందు అలభ్య కృతులుగా పేర్కొన్న వాటిలో నొకటి రెండు యక్షగానేతర నాటకము లుండిన నుండవచ్చును.

పై పట్టికను బట్టి క్రీ.శ. 17వ శతాబ్దికి పూర్వమునుండియే తెనుగున 'జలక్రీడా' వస్తుక యక్షగానరచన సాగినట్లు నిశ్చయింప వీలగుచున్నది.

పై పట్టిక యందలి 4, 8, 10, 11, 16, 21 సంఖ్యల కవుల రచనలు వెంగమాంబ జలక్రీడా విలాసమువలెనే శ్రీకృష్ణ జన్మ వృత్తాంతముతోమొదలిడి గోపికల జలక్రీడల ఘట్టముతో ముగియుచున్నవి. అందులోను 4, 8, 11, కవుల రచనలకు వెంగమాంబ రచనకు కథా విస్తృతిలో సన్నిహిత సారూప్యము గోచరిచుచుండుట యొక విశేషము.


పై పట్టికను సమకూర్చుటలో ఉపకరించిన గ్రంథములు:

1. ఆంధ్రవాఙ్మయ సూచిక(1929) ప్రకా: కీ.శే. కాశీనాథుని నాగేశ్వరరావు.
2. ఆంధ్రకవి సప్తశతి (1956) బులుసు వేంకటరమణయ్య
3. ఆంధ్రయక్షగాన వాఙ్మయ చరిత్ర (1961) డా. యస్వీ. జోగారావు ఎమ్.ఏ., పిహెచ్.డి.
4. మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత గ్రంథాలయమువారి డిస్క్రిప్టివ్ కేటలాగులు.











మహా నిర్వాణము

క్రీ శ 1817 ఈశ్వర-శ్రావణ శుద్ధ నవమినాడు - ఈ మహాజ్ఞాని, మహాయోగిని, భక్తకవయిత్రి, తిరుమల పుణ్యక్షేత్రంలో శ్రీవేంకటేశ్వరుణ్ణి స్మరిస్తూ, సజీవసమాధి చెందింది